ఆదిత్యపురాణాన్తర్గత

# శ్రీ వేంకటేశమాహాత్మ్యము

శ్రీ ఆర్. రామమూర్తి శర్మ



ప్రచురణ:
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

ఆదిత్యపురాణాన్తర్గత

# శ్రీవేంకటేశమాహాత్మ్యము

తాత్పర్యము, విశేషార్థముల కూర్పు:

శ్రీ ఆర్. రామమూర్తి శర్మ



ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1997

**ADITYA PURANANTHARGATHA**
**SRI VENKATESA MAHATMYAMU**
(Translated With Meanings and Explanations)

Translated by
**R. Ramamurthy Sarma**



T.T.D. Religious Publications Series No. 123

First Edition : 1982
Reprint : 1997

Copies: 2,000

Price : Rs. 14-00

Published by:
M.K.R. Vinayak, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati – 517 507.

Printed at:
Keerthi Offset Printers,
Tirupati – 517 501.

# ముందుమాట

పురాణాలు ప్రాచీన భారతీయ విజ్ఞాన సర్వస్వాలుగా ప్రసిద్ధి పొందాయి. పురాణాలలో వర్ణింపబడిన అసంఖ్యాకమైన విషయాలలో క్షేత్రమాహాత్మ్యాలు విశిష్టమైనవి. వివిధ క్షేత్రాలు, తీర్థాలు మొదలైనవాటి మాహాత్మ్య ప్రాశస్త్యాదులు కూడా వివరింపబడి ఉంటాయి.

పుణ్యక్షేత్రాల్లో తిరుమల చాలా ప్రసిద్ధి వహించిన క్షేత్రం. అలాగే క్షేత్రమాహాత్మ్య గ్రంథాల్లో 'వేంకటాచల క్షేత్రమాహాత్మ్యం' విశిష్టతని సంతరించు కొన్న గ్రంథం. ఏదో ఒక పురాణం కాకుండా శ్రీ వేంకటేశ్వరుని మహిమను తిరుపతి పుణ్యక్షేత్ర ప్రశస్తిని పన్నెండు పురాణాలు పేర్కొంటున్నాయి. ఈ పన్నెండు పురాణాలలో వరాహపురాణం మొదలుకొని భవిష్యోత్తర పురాణం వరకూ పేర్కొన్న వేంకటేశ్వరుని ఇతిహాస సమాహార రూపమే 'శ్రీ వేంకటాచలక్షేత్రమాహాత్మ్య' గ్రంథం.

ఈ పన్నెండు పురాణాలలోని వేంకటాచల మాహాత్మ్యాలలో ఆదిత్య పురాణాంతర్గతమైన 'వేంకటేశ మాహాత్మ్యానికి' ఒక ప్రత్యేకత ఉంది. ఇది ప్రతిదిన పారాయణార్హమని, సకలాభీష్టసిద్ధి ప్రదమని పెద్దలు ఆచరించి అనుభవ పూర్వకంగా చెబుతున్నమాట, ఐదధ్యాయాల ఈ చిన్న స్తోత్ర గ్రంథంలో ఎన్నో శాస్త్రరహస్యాలు, సిద్ధాంతాలు, భగవన్మహిమలు ఉన్నాయి.

ఈ గ్రంథంలోని స్తోత్ర శ్లోకాలకు ఆవశ్యకమైన విశేష వివరణతో శ్రీ ఆర్. రామమూర్తిగారు, సుబోధకంగా తెలుగు అనువాదం సమకూర్చారు.

ఇహపరాభ్యున్నతికి అత్యంత ఆవశ్యకమైన ఈ స్తోత్రమాల గ్రంథ పునర్ముద్రణని ఇంతకుముందులానే ఆస్తికలోకం ఆదరించగలదని ఆశిస్తున్నాం.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఉపోద్ఘాతము

* * * * *

దయావిధే దయావిధే దయావిధే దయావిధే।
నమోనమో నమోనమో నమోనమో నమోనమః॥

శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్।
అభంగుర విభూతి ర్నస్తరంగయతు మంగళమ్॥

ఆపాదమౌళి పర్యంతం గురూణామాకృతిం స్మరేత్।
తేన విఘ్నాః ప్రణశ్యన్తి సిధ్యన్తి చ మనోరథాః॥

* * *

"అదుఃఖమితరత్సర్వం జీవా ఏవ తు దుఃఖినః।
తేషాం దుఃఖప్రహాణాయ శ్రుతిరేషా ప్రవర్తతే॥

అను ప్రమాణానుసారము నిత్యానంత సుఖస్వరూపియైన ఈశ్వరునకు దుఃఖములేదు. జడమునకు జ్ఞానము లేకుండుటచే దుఃఖానుభవ ప్రసంగమే లేదు. కాని, జీవునకు జ్ఞానముండుటచే సుఖదుఃఖములను తెలిసికొను సామర్థ్యము కలదు. కాని, ఆ స్వరూప సుఖము అవిద్యచే ఆవృతమైనందున దానియనుభవము అతనికి కలుగుటలేదు ఈ కారణముచే నిరంతరము దుఃఖము ననుభవించుచునేయుండును కొన్ని వేళలయందు సుఖము కలిగినను ఆ సుఖము క్షణికమగుటచే, కొద్ది కాలములోనే తీరిపోవు ననెడి దుఃఖముతో కూడియుండును.

జీవరాసుల ఈ దుఃఖమును పొగొట్టుటకే వేదము ప్రవృత్తమైనది. 'వేదోఽఖిలో ధర్మమూలం, స్మృతిశీతే చ తద్విదామ్' అను ప్రమాణముచే సర్వజగదుద్ధారకములైన ధర్మ–న్యాయ–నీతులకు వేదమే మూలాధారమని సిద్ధించుచున్నది. ప్రత్యక్షాది ప్రమాణ

ములచే సర్వథా తెలిసికొనవీలుగాని యలౌకిక విషయములను బోధించు అత్యుత్తమ పవిత్రగ్రంథమే 'వేదము'. ఈ వేదమునే 'ఆగమ' మనియు, 'ఆమ్నాయ' మనియు, 'శ్రుతి' యనియు శాస్త్రములో వ్యవహరింతురు.

ఈ వేదము కృతయుగమునందు మంత్రములరాశిగా నుండి 'మూలవేద'మని ప్రసిద్ధిగాంచెను త్రేతాయుగమునందు ఋక్, నిగద, సామములని మూడు విధములుగ విభజింప బడెను. ద్వాపర యుగమునందు

'ఋచః స ఋచ ఉద్ధృత్య ఋగ్వేదం కృతవాన్ ప్రభుః।
యజూంషి నిగదాచ్చైవ తథా సామాని సామతః'॥

అని చెప్పిన ప్రకారము సాక్షాత్ నారాయణావతారుడైన శ్రీవేద వ్యాసమహర్షులవారు వేదమును నాల్గు విధములుగ విభాగము చేసి యుండినను, కాలప్రభావముచే రానురాను వేదములు శిలములగుచు వచ్చినవి. ఉపలబ్ధమగుచుండెడి వేదముల యొక్క అర్థజ్ఞానము అందుబాటులో లేకుండ పోయినది. కొందఱకు అల్పజ్ఞానమున్నను పరిపూర్ణ యథార్థజ్ఞానము కలుగలేదు. నిజమైన జ్ఞానముగలవారు మిగుల అరుదైరి. కొందఱియందు ఆ జ్ఞాన మున్నను, అట్టి మహనీయులనుండి ఆ జ్ఞానమును పొందవలెనను ఇచ్ఛ జనులకు కలుగ లేదు. ఇట్టి దుర్దశ ప్రాప్తించినపుడు బ్రహ్మాదుల ప్రార్థన మేరకు శ్రీహరి వేదవ్యాస రూపమున అవతరించినట్లు కౌర్మపురాణమున క్రింది విధముగ చెప్పబడినది.

'తృతీయే సప్తమే చైవ షోడశే పంచవింశకే।
అష్టావింశే యుగే కృష్ణః సత్యవత్యాం పరాశరాత్'॥

అని పైన చెప్పినరీతిగ ప్రస్తుత వైవస్వతమన్వంతరములోని 71వ మహాయుగమునందలి మూడవ, ఏడవ, పదునాఱవ, ఇఱువదియైదవ

యుగములందు శ్రీహరి వేదవ్యాస రూపముతో నవతరించి యుండి నను. ఆ భగవానుడు మరల 28 వ ద్వాపర యుగమునందు సజ్జనుల నుద్ధరించుటకై వేదవ్యాసుడుగా జనించి మఖిల ఆవేదములను విభజించెను అనగా ఋగ్వేదమును 24 భాగములుగను, యజుర్వేద మును 101 భాగములుగను, సామవేదమును 1000 భాగములుగను, అథర్వణవేదమును 12 భాగములుగను విభజించెను. వీనినే ఉపవేద ములు, అవాంతర వేదములు, అని వ్యవహరింతురు.

సంశయగ్రస్తులైన సజ్జనుల నుద్ధరించుటకై మఖిల ఆ సమస్త వేదముల యర్థమును నిర్ణయించుటకై 'బ్రహ్మసూత్రములను' రచించిరి. ఆ సర్వవేదములయొక్క, బ్రహ్మసూత్రములయొక్క అర్థమును యథాతథముగ వివరించుటకై మహాభారతమును, భాగవతాద్యష్టాదశ పురాణములను, ఉప పురాణములను వ్యాసభగ వానుడు రచించెను. అయినను

"యది విద్యాచ్చతుర్వేదాన్ సాంగోపనిషదాన్ ద్విజః।
న చేత్ పురాణం సంవిద్యాత్ నైవ స స్యాద్విచక్షణః"॥

అను ప్రమాణానుసారము సర్వశాస్త్రములను తెలిసికొనినప్పటికిని భగవత్తత్త్వమును నిరూపించు పురాణములను తెలిసికొనకపోయి నచో, జ్ఞాని కాలేడని శ్రీమధ్వాచార్యుల వాక్యము.

ఈ సమస్త పురాణములయందును హరి సర్వోత్తమత్వము మొదలైన సిద్ధాంత తత్త్వములు నిరూపింప బడినవి. అదియునుగాక "భక్తౌఘానుగ్రహార్థాయ త్యక్త్వా వైకుంఠముత్తమమ్, ధరణ్యామవ తీర్ణోఽసి" అను ప్రమాణానుసారము భక్తుల ననుగ్రహించుటకై సాక్షాన్నారాయణుడే శ్రీకృష్ణరూపముతో వైకుంఠమునుండి వచ్చి భూమిపై నవతరించెను. శ్రీకృష్ణుని బాలరూపము శ్రీ పాండు రంగవిఠలుడనియు, విభూతిరూపము సాక్షాత్ భూలోకవైకుంఠమని

ప్రసిద్ధిగాంచిన శ్రీ వేంకటాచలమున కధిపతియైన శ్రీ శ్రీనివాసుడనియు శాస్త్రప్రసిద్ధి.

ప్రస్తుత వైజ్ఞానిక యుగమునందు సనాతన భారతీయ ధర్మ సంస్కృతుల ఆవశ్యకతను కొందఱు వ్యతిరేకించినను, సజ్జనులకు వాని పరమావశ్యకత అత్యధికముగ గోచరించుచున్నది. వైజ్ఞానికావిష్కారములు మనుష్యుని కొన్ని సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించినప్పటికిని మూలభూతములగు క్లిష్ట సమస్యలను పరిష్కరించుటలో అసమర్థములై యున్నవనునది సర్వులకు తెలిసిన విషయమే. అందుచే సుజనులందఱు శాంతి నిరీక్షణలో నున్నారని వేఱుగ చెప్పనవసరములేదు. ఈ దశయందు భారతీయ సనాతన ధర్మ సంస్కృతి మార్గదర్శకముగను, సహాయకముగను నిలచియున్నది.

ఇట్టి భారతీయ సనాతన ధర్మ సంస్కృతికి నిలయమై సాక్షాత్ కలియుగ వైకుంఠమని ప్రసిద్ధిగాంచిన ఈ తిరుపతి క్షేత్రము తీర్థయాత్రాస్థలములలో మకుటాయమానమై యున్నది. ఉత్తర దక్షిణములుగ విస్తరించి యున్న ఈ పర్వతశ్రేణులు తొలిపంక్తి సర్పాకారముగ శయనించియున్నట్లు భాసించుచున్నది. ఆ సర్పాకృతి యొక్క శిరస్సున 'తిరుమల'యు, ఉదరభాగమున నారసింహ క్షేత్రమైన 'అహోబిలము', తోకయందు 'శ్రీశైలము' కలవని ప్రసిద్ధి.

వేయి పడగలు గల ఆదిశేషునివలె అగపడుటచే 'శేషాచల' మనియు, వరాహస్వామి వృషభాసురుని నిగ్రహించి యనుగ్రహించుటచే 'వృషభాద్రి' యనియు, వాయుదేవునకు ఆదిశేషునకు స్పర్ధ కలిగి, తత్ఫలితముగ మేరుపర్వత పుత్రుడగు ఆనందపర్వతము ఇచ్చటికి వచ్చుటచే 'ఆనందాద్రి' యనియు, శ్రీరామభక్తుడైన ఆంజనేయుని పుత్రునిగా బడయుటకై అంజనాదేవి తప మాచరించిన

స్థలమగుటచే 'అంజనాద్రి' యనియు, కపివీరుడైన నీలుని పేరట 'నీలాద్రి' యనియు వేర్వేఱు నామధేయములతో ఈ కొండ వ్యవహరింపబడు చున్నది.

ఈ వేంకటాచలము కోరిన వారికి కొంగు బంగారమై ఇష్టార్థముల ననుగ్రహించుటచే 'కల్పవృక్షము', 'చింతామణి' మొదలగు పేర్లు గలిగి ప్రఖ్యాతి వహించినది. పవిత్ర తీర్థములు గలదగుట వలన 'పుష్కరాద్రి' యనియు, బంగారువలె మెఱయుటచే 'కనకాద్రి' యనియు, నృసింహస్వామి ఆవిర్భవించుటచే 'నరసింహాద్రి' యనియు, ఆది వరాహమూర్తి నెలకొని యుండుటచే 'వరాహాద్రి' యనియు వేర్వేరు పేళ్ళతో వ్యవహరింపబడుచున్నది

సాక్షాత్తు శ్రీమన్మహావిష్ణువు నెలకొని యుండుటచే 'వైకుంఠాద్రి' 'నారాయణాద్రి' యనియు పాపములను దహించుటచే 'వేంకటాద్రి' యనియు పిలువబడుచున్నది.

శ్రీహరి యాజ్ఞచే గరుత్మంతుడు వైకుంఠము నుండి ఈ క్రీడాచలమును తెచ్చి గోమతీనదికి దక్షిణమున అరువది యోజనముల దూరములో సువర్ణముఖరీ నదికి ఉత్తరదిశ యందు పూర్వపశ్చిమ సముద్రముల మధ్యలో నుంచెనని పురాణప్రసిద్ధి. అటులనే పవిత్ర తీర్థములన్నియు భూమికి దిగివచ్చి స్వామి పుష్కరిణిలో సంగమించినవి ఇంతటి పరమ పవిత్రమైన స్వామి పుష్కరిణీ తీర్థమునందు విష్ణువు శ్రీ శ్వేత వరాహరూపముతో స్థిరపడెనని పురాణములు చెప్పుచున్నవి.

ఆ శ్వేతవరాహస్వామి యొక్క రూపమే అయిన శ్రీ శ్రీనివాసుడు భక్తకోటి నుద్ధరించుచు శ్రీ, భూదేవీ సహితుడై ఆనంద నిలయ విమానమునందు నెలకొని యున్నాడు.

ఇట్టి మహోమహిమోపేతమైన శ్రీవేంకటాచల క్షేత్రమున కధిపతియైన శ్రీకృష్ణాభిన్న శ్రీ శ్రీనివాసుని యొక్క అనంతము లగు మహిమలు సర్వవేదములందును, సమస్త పురాణములందును బహువిధములుగ వర్ణింపబడియున్నను, పండ్రెండు పురాణములయందు విశేషముగ నిరూపితములై యున్నవి. అందును ఈ ఆదిత్య పురాణాంతర్గతమైన శ్రీవేంకటేశమాహాత్మ్యమునందు వర్ణింపబడినన్ని భగవన్మహిమలు ఏ యితర పురాణములోను వర్ణింపబడలేదు. అందువలన ఈ పురాణము సర్వపురాణముల సారసర్వస్వమై యున్నది. సర్వవేదములు, ఇతిహాసములు, మహాభారతాద్యాగమములు, శ్రీ మద్రామాయణము, బ్రహ్మసూత్ర ప్రస్థానము, భగవద్గీతా ప్రస్థానము, ఉపనిషత్ప్రస్థానము మొదలగు సర్వశాస్త్రార్థములు ఈ పురాణమునందు ఇమిడియున్నవి. మఱియు హరినామమహిమలు విశేషముగ ప్రతిపాదింపబడి యున్నవి.

"యస్య చేతసి గోవిందో హృదయే యస్య నాచ్యుతః।
కలిః కృతయుగం తస్య కృతం కలియుగాయతే ॥

అనగా హరినామస్మరణము చేయువారికి కలియుగము కృతయుగము వలెను, చేయనివారికి కృతయుగము కలియుగమువలెను ఉండుననిపై శ్లోకభావము. ఈ యుగములో హరినామ స్మరణముచేతనే భగవదనుగ్రహమును సంపాదింపవచ్చునని సర్వ పురాణేతిహాసములలో ప్రతిపాదితమై యున్నది. కృతాది యుగములందు యజ్ఞాదులచే కలుగునట్టి ఫలము కలియుగములో శ్రీహరి స్మరణచేతనే కలుగునని 'కలిస్సాధుః కలిస్సాధుః' అని విష్ణుపురాణము చెప్పుచున్నది. "నారాయణేతి యస్యాస్తే వదనే నామ మంగళమ్। నారాయణ స్తమన్వేతి వత్సం గౌరివ వత్సలా॥" దూడ అరుపును విన్నతోడనే ఆవు దూడ దగ్గఱకు పరుగెత్తి వచ్చి పాలు కుడిపి తృప్తి పఱచు

నట్టే సంసారనిమగ్నులై యున్నను, తనను స్మరించు భక్తులను శ్రీహరి రక్షించి తరింపచేయును.

"తద్దినం దుర్దినం మన్యే మేఘచ్ఛన్నం న దుర్దినమ్।
యద్దినం హరిసల్లాప కథాపీయూష వర్జితమ్॥"

ఏ దినమున భగవన్నామ స్మరణము, నామోచ్చారణము, అద్భుత గుణమహిమల కీర్తనము జరుగదో ఆ దినము దుర్దినమని శ్రీ మద్వాదిరాజ పూజ్యపాదులు చెప్పియున్నారు. భగవన్నామస్మరణము చేతనే అజామిళాదులు యమబాధా నివృత్తులై ముక్తిని పొందిరి.

"జిహ్వా న వక్తి భగవద్గుణ నామధేయమ్
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిందమ్।
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాఽపి
తా నానయధ్వ మసతోఽకృత విష్ణుకృత్యాన్॥

జిహ్వాతో హరిగుణగానము చేయని వారిని, మనసారా హరి పాదారవిందములను స్మరింపని వారిని, తలవంచి నమస్కరింపని వారిని నా వద్దకు కొనిరండని యముడు తనభటుల కాజ్ఞాపించెనట! కనుకనే పరమ భాగవతుడైన మహాశివుడు —

"అహం భవన్నామ గృణన్ కృతార్థో వసామి కాశ్యామనిశం భవాన్యా।
ముమూర్షమాణస్య విముక్తయేఽహం దిశామి మంత్రం తవ రామ నామ॥"
(అధ్యాత్మ రామాయణము, యుద్ధకాండము సర్గ 15, శ్లో॥ 62)

అని పార్వతినుద్దేశించి పలుకుట ద్వారా రామనామస్మరణము చేయవలెనని ప్రపంచమున కుపదేశించియున్నాడు

"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ."

నాన్యం వదామి న శృణోమి న చింతయామి।
నాన్యం స్మరామి న భజామి న చాశ్రయామి॥
భక్త్యా త్వదీయ చరణాంబుజ మంతరేణ।
శ్రీ శ్రీనివాస పురుషోత్తమ దేహి దాస్యమ్॥

'నీవే నాకు గతి' యని మనసారా అతనిని శరణుజొచ్చిన వారిని ఆ దయానిధి ఎల్లపుడు నభయమిచ్చి యనుగ్రహించు ననుటలో సందేహము లేదు.

భగవంతుని సేవ-అర్చన, స్తోత్రాదులచేతనే సంపూర్ణ ఫలప్రద మగుచున్నది. అట్టి స్తోత్రములందు ఈ వేంకటేశస్తోత్ర రాజము అత్యుత్తమమైయున్నది. అదియునుగాక 'నారాయణ పరావేదాః, సర్వేవేదా యత్పదమామనంతి' అనగా సకల వేద వేదాంత స్మృతి పురాణేతిహాసాదులు శ్రీహరియే సర్వోత్తముడనియు, సర్వజ్ఞుడనియు, సర్వ వ్యాపకుడనియు, సర్వాంతర్యామియనియు, సద్గుణ పరిపూర్ణు డనియు నిరూపించుచున్నవి. పైచెప్పిన ఈ శ్రుత్యుక్తాంశములను ఈ 'వేంకటేశ మాహాత్మ్యము' విశదీకరించుచున్నది.

'యథా దుగ్ధే స్థితం సర్పిః నాస్వాదాయోపకల్పతే ।
పృథగ్భూతం హి తద్దివ్యం దేవానాం రసవర్ధనమ్ ॥

పాలలో కలసియున్న నెయ్యి మన జిహ్వకు అందదు. కనుక దానిని పాలనుండి ప్రత్యేకముగ తీసినచో మనకు భోజ్యముగను, దేవతలకు రసవర్ధకముగను నగును. అట్లే శ్రుతి పురాణములందిమిడియున్న హరినామ మహిమలను ప్రత్యేకించి అందించినచో భక్తులందఱకు నుప యోగపడునని తలంచిన శ్రీ వేదవ్యాస మహర్షి సర్వపురాణ సారమును శ్రీ వేంకటేశ మాహాత్మ్యములో నిమిడ్చియున్నారు. ముఖ్యముగా నిది హరి సర్వోత్తమత్వ ప్రతిపాదకము. సర్వానిష్ట నివారకము. భక్తులకు సర్వాభీష్ట వరప్రదము. దరిద్రులకు దారిద్ర్య దోష పరిహారకము. జ్ఞానార్థులకు జ్ఞానదాయకము. సర్వదేవతలకు, ఋషులకు, మునులకు మిక్కిలి ప్రియమైనదియు, సర్వపాపహార మును, పుణ్యసమృద్ధి కారకమును అయి యున్నది. ఇట్టిస్తోత్ర రాజ మును చిరకాలము నుండి భక్తులనేకులు పఠించి ఇహపర శ్రేయము లంబడసి యున్నారనుట సుప్రసిద్ధము.

భగవంతుని గుణమహిమలను ప్రతిపాదించుటయందు ఈ మాహాత్మ్యమునకు సాటియగునది మఱెచ్చటను లేదు. అట్లే ఈ తిరుపతి క్షేత్రమునందుగల మహిమలు ఏ యితర క్షేత్రములందును లేవు ఇతర పుణ్యక్షేత్రములయందుండు మహిమలన్నియు నిచ్చట కలవు

వేయేల? శ్రీవేదవ్యాసమహర్షి ప్రణీతమగు ఆదిత్యపురాణాంతర్గతమైన ఈ వేంకటేశ్వర మాహాత్మ్యము సర్వవేదశాస్త్ర పురాణేతిహాస వాఙ్మయములనెడి పాలసముద్రమునుండి ఉద్ధరించిన పరిపూర్ణ అమృతకలశము వలెనున్నది సంసార సర్పదష్టులగు సజ్జనులు ఈ యమృతకలశమును స్వబుద్ధి కోశమునందు ధరించి నిత్యము పానము చేయుచుండిన యెడల వారికి తప్పక అమృతత్వ ప్రాప్తి యగును.

అయిదధ్యాయములు గల ఈ వేంకటేశమాహాత్మ్యమునకు (1) శ్రీ శ్రీనివాసుడు 'విషయము'. (2) హరి, వాయు, గురువుల యందు శ్రద్ధాభక్తియుతులైన మనుష్యోత్తములు, శమదమాది యుక్త ఋషి గంధర్వులు మఱియు దేవతలు 'అధికారులు' (3) ఈ స్తోత్రమును పఠించుట 'సంబంధము' మఱియు (4) అట్టి సేవచే ప్రాప్తమగు శ్రీహరియొక్క ప్రసాదము, తజ్జన్యసంసారబంధ విమోచనము, తదనంతరము మోక్షప్రాప్తి 'ప్రయోజనము'. ఇట్లు అనుబంధ చతుష్టయము గలదు

సంక్షిప్త మహిమావర్ణనమగు ఈ స్తోత్రరూప గ్రంథమునందు శ్రీ వేంకటేశుని మాహాత్మ్యము 'అద్భుత' మనియు, వేంకటేశుని దివ్యచరిత్రమును సంపూర్ణముగ వర్ణించుట ఎవరికిని సాధ్యముగాదనియు, 'అపూర్వార్థము' తో కూడినదనియు, దేవ ఋషి గంధర్వులచే నిత్యము పఠించుట కర్తవ్యమైనదనియు, సమస్త జీవులకు తారక

మనియు, జ్ఞానప్రదమనియు, ఇహపరములందు ఇష్టార్థ ప్రదమనియు సంక్షేపముగా ఆరంభమునందు వర్ణింపబడియున్నది.

## స్తోత్రాగమన వివరణము

వేంకటాచలపతియగు శ్రీ శ్రీనివాసుని యనుగ్రహాదులు శీఘ్రముగ మాకెట్లు కలుగునని శౌనకాదులచే బహువిధములుగ ఆదరముతో ప్రార్థింపబడిన శ్రీ సూతమహర్షి ఈ స్తోత్రమును ఉప క్రమించు సందర్భములో, ఈ మాహాత్మ్యము పూర్వము ఆదిశేషునిచే మహాత్ముడగు కపిలమహర్షికి చెప్పబడినదనియు, ఆ సందర్భమున తావా స్తోత్రమును వింటిననియు లోకములో దీని ఆగమనమును వివరించి యున్నారు.

## ఇతిహాసము

శ్రీ శ్రీనివాసుని మాహాత్మ్యము భక్తబృందముల మనస్సులలో దృఢముగా నాటుకొనుటకై దేవశర్మయొక్క వృత్తాంతమును (ఇతిహాసమును) దృష్టాంతముగ చెప్పియున్నారు. దేవశర్మ యను నిజవేద భక్తుడు వాయుదేవుని ప్రేరణచే శ్రీ వేంకటాచల పుణ్యక్షేత్రమున కేగి శ్రీ లక్ష్మీ వేంకటేశ భగవానుని కన్నుల కలవుదీర దర్శించి, నోరార స్తుతించి కోరకుండగనే సకలాభీష్టములను బడసిన విషయము ఇందలి కథ.

ఈ స్తోత్రమునందు గర్భితమైయుండు కొన్ని వేదార్థతత్త్వములను మఱియు సిద్ధాంతములను యథామతి శ్రీహరి వాయుదేవుల ప్రేరణచే ఈ దిగువ సంగ్రహించుచున్నాను.

## ప్రథమాధ్యాయము

(1) జిజ్ఞాసువులు తాము శ్రీహరియొక్క మాహాత్మ్యజ్ఞానమును పొందవలెననిన, యోగ్యులైన గురువులను శ్రద్ధతో, విశ్వా

సముతో అనేకవిధములుగ ప్రార్థింపవలయునని ఈ అధ్యాయపు తొలి మూడు శ్లోకములయందు చెప్పబడియున్నది.

(2) వేంకటాచల క్షేత్రముయొక్క మఱియు ఆ క్షేత్రజ్ఞుడైన శ్రీవేంకటేశుని యొక్క మహిమలు 'అద్వితీయము' లనియు, ఇచ్చట భగవంతుడు సాక్షాత్తుగా నున్నాడనియు, నిత్యకళ్యాణము పచ్చతోరణమనియు, భూ వైకుంఠమనియు — ఈ కారణములచే 'అశుచిదోషము' లేదనియు వివరింపబడి యున్నది. (శ్లో॥ 5-14)

(3) "కర్తాహి సృష్టిస్థితిసంయమాదేః........" (శ్లో 13)-అను శ్లోకమునందు పరమాత్ముని సృష్ట్యాద్యష్టకర్తృత్వ మహిమలను మఱియు "... ...వచసా నిరుక్తో" అను శ్లోకమునందు "అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తో" అను శ్రుత్యర్థము ప్రతిపాదింపబడి యున్నది.

(4) శ్రీవాసుదేవుని యనుగ్రహము నపేక్షించువారు వాయు శిష్యత్వము, జితేంద్రియత్వము, భగవన్మాహాత్మ్య ప్రతిపాదక — వేద శాస్త్రార్థాలోచనారూపమగు తపశ్చరణము, అహంకార మమ కారాదుల త్యాగము, సంసారియై యున్నప్పటికిని విషయ విరాగము, మఱియు గుర్వాజ్ఞయందు అచంచల విశ్వాసము....ఇత్యాదులను అవశ్యము పొందవలెనని, దేవశర్మను ఉదాహరణముగా జేసి (శ్లో 24—40) ఉపదేశించి యున్నారు. వీనియందు వాయు శిష్యత్వము మఱియు వాయుదేవుని కృపామహిమలను చూడవచ్చును.

(5) "దిష్ట్యా చాదృష్టపాతేవ తద్గురుర్వాయురాగమత్........"
(శ్లో. 34) మఱియు "శ్రీమద్వేంకటనాథస్య యాత్రార్థం గచ్ఛ మా చిరమ్ ——" (శ్లో 37) అను శ్లోకమున వాయుదేవుడు తన ప్రియశిష్యుడగు దేవశర్మకు ప్రత్యక్షముగా దర్శనమిచ్చి వేంకటాచల యాత్రకు వెళ్ళుమని యాజ్ఞాపించుట, దేవశర్మకు త్వరలోనే శ్రీ శ్రీనివాసుని సాక్షాత్కారము కలుగునని ముందుగా సూచించుట

వలె నున్నది. వాయుదేవుని దర్శనానంతరమే శ్రీహరి దర్శనమను సిద్ధాంత మిందు సూచింపబడియున్నది.

"స ఆన్యైః దేవైః హరిం పశ్యేత్। జ్ఞానరూపేణ వాయునా।
బ్రహ్మణా పరమజ్ఞానరూపేణ హరిణా తథా। ప్రసన్నేనైవ తం పశ్యేత్"–

శ్రీ మధ్వాచార్యుల అథర్వణ భాష్యమందలి ఈ వాక్యము పై సిద్ధాంతమునే వక్కాణించుచున్నది.

(6) "గురూపదేశో బలవాన్ గురోరాజ్ఞాం న లంఘయేత్"
(శ్లో. 40)

–గురూపదేశము మిక్కిలి బలవత్తరమైనది. గుర్వాజ్ఞ నతిక్రమింప రాదు. అని హితోపదేశము చేయబడినది.

(7) "విహారంతం శ్రీధరాఖ్యాం శ్రీ వేంకటేశం సందృష్ట్వా"
(శ్లో. 43)

అను శ్లోకమునందు వాయుదేవుని యాజ్ఞను శిరసావహించి శేషాచలమునకు వచ్చినపుడు దేవశర్మ, శ్రీ వేంకటేశుని సాక్షాత్తుగ దర్శించెనని స్పష్టముగ నిరూపణ కలదు.

(8) సాక్షాత్తుగ స్వామి దర్శనమయిన వెంటనే ..........
నమోనమో నమోనమో నమోనమో నమో నమః (శ్లో 44)

–అని దేవశర్మ ఎనిమిది పర్యాయములు నమస్కరించుట శ్రీ వేంకటేశుని సృష్ట్యాద్యష్ట కర్తృత్వ మహిమలను చెప్పక చెప్పుచున్నది. బ్రహ్మసూత్రములందు రెండవదైన "ఓం జన్మాద్యస్య యతః ఓం" అను సూత్రమునందు శ్రీనారాయణుని సృష్ట్యాద్యష్ట కర్తృత్వ మాహాత్మ్య పూర్ణ పరబ్రహ్మ లక్షణములను ఆదియందు చింతింప వలెనని చెప్పినట్లే యిచ్చటను సూచింపబడి నట్లున్నది.

(9) శ్రీనివాసాభిన్న త్రివిక్రముని పాదముయొక్క నఖాగ్ర భాగమునందు మాణిక్యమువలె ప్రకాశించు రూప–గుణ–క్రియా మహిమలు శ్రీలక్ష్మీదేవిచేగాని, బ్రహ్మ, శేష, రుద్రాది ఇతర దేవతలచేగాని సంపూర్ణముగ తెలియుట కశక్యమని వివరింపబడి యున్నది (శ్లో. 47–62)

---

## రెండవ అధ్యాయము

(1) అత్యద్భుతములు, మఱియు వర్ణించుట కశక్యములు నైన శ్రీ వాసుదేవుని పాదసౌందర్యమహిమలను దేవశర్మ తన శక్త్యనుసారము స్తుతించుట కారంభించినాడు.

"స్వామిన్ త్వయా ప్రేరితశ్చేత్ యథామత్యనువాదయే" (శ్లో. 1)

అను శ్లోకమున

"ప్రతిబింబ క్రియాయాః బింబక్రియానుస్యూతతా–
కిమత్ర బహునోక్తేన నాకృతం క్రియతే జనైః"

అను శాండిల్య తత్త్వసారమగు జీవుని పరాధీన కర్తృత్వ సిద్ధాంతమే ఉక్తమైనది. భాగవతమునందలి

"యోఽన్తః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తిధర స్స్వధామ్నా॥–

అని ధ్రువబాలకుడు చెప్పిన శ్లోకముసైతము ఈ సిద్ధాంతమునే చెప్పుచున్నది.

(2) శ్రీ శ్రీనివాసుని పాదరేఖామహిమా స్తోత్రములు మహాఫలప్రదములని వర్ణించుచు పాదచిహ్నములైన శంఖ, చక్ర, గదా, పద్మ, వజ్ర, ధ్వజ, అంకుశముల శ్రవణ–మనన–ధ్యాన–ప్రవచన–

అర్చనాదులు; పాదమాహాత్మ్య లేఖనము; పాదమాహాత్మ్య గ్రంథ దానము - ఇత్యాదుల ఫలమును విశదీకరించియున్నాడు. (శ్లో. 30-45)

(3) శ్రీ శ్రీనివాసుని యనుగ్రహమువలన ఆయన శయ్యా, ఆసనము, పాదుకలు, గొడుగు - ఇత్యాదుల సేవారూపమున ఆ భగవంతుని యంగ సంబంధము శేషదేవునకు ప్రాప్తించినదట! ఆ రీతిగ శేషదేవునకు లభించిన ఆ మహాద్భాగ్యజన్య మహానందమును శ్రీ లక్ష్మీదేవి కోరుచున్నదట! ఈ విషయమునే

"అహమేవ అనుభోక్ష్యామి మత్పతే రంగసంగజమ్" (శ్లో. 49)

"సర్వం భాగ్యం మమైవ స్యాత్" (శ్లో. 50)

అను శ్లోకములు చెప్పుచున్నవి. ఈ యభిప్రాయమునే

"ఋతే రమాం జాతు మమాంగసంగ యోగ్యాంగనా నైవ సురాలయేఽపి"

అను భారత తాత్పర్యనిర్ణయము కూడ బలపఱచుచున్నది.

(4) వైకుంఠాది లోకములందు గాని, బ్రహ్మాండము లోపల గాని, వెలుపల గాని, జీవరాసుల హృదయములందు గాని, క్రీడా వనములందు గావి, సర్వవిధ ఫలపుష్పములందు గాని, క్రీడామంటపము లందుగాని, నానావిధ నైవేద్య సమర్పణలయందు గాని, వేయేల? సర్వ స్థలముల యందును లక్ష్మీదేవియే తన రమణుని భక్త్యాదరములతో సేవించునని వర్ణింపబడియున్నది. (శ్లో. 51-62)

(5) చతుర్విధ జీవరాసుల సృష్టిక్రమము, పంచవిధ తార తమ్యము, శ్రీమన్నారాయణుని అఘటన ఘటనా సామర్థ్యము, సర్వప్రేరకత్వము, సర్వదోషదూరత్వము, స్వాతంత్ర్యాది గుణపూర్ణ త్వము, అత్యంతాశ్చర్యకరమైన అణువునందలి మహత్వము, అల్లే

మహాత్మునందలి అణుత్వము, అనిత్యత్వము, దేహహాని మొదలగు చతుర్విధ నాశరహితత్వము, చతుర్ధర్మ ప్రదర్శకత్వము మొదలగు పరమాత్మని యనంతగుణముల వర్ణనము కలదు. (శ్లో. 68-72)

(6) అవతారములయందు - చూపించిన అద్భుతమహిమలు, అహల్యోద్ధరణము, కీటకమునకు స్వశరీరముతోనే సామ్రాజ్యభోగము, అర్జునునకు చేసిన సారథ్యము, బలిచక్రవర్తికి ద్వారపాలకుడై యుండుట - ఇత్యాదులయందు చూపబడిన భగవంతుని భక్తానుకంపత్వము, మఱియు భక్తపరాధీనత్వముల మహిమలను స్తుతించునపుడు శేషాచలస్థ శ్రీ శ్రీనివాసునకు - రామ, కృష్ణ, వామనాద్యవతారములకు 'పూర్ణ అభేద' మను సిద్ధాంతము సూచింపబడినది.

"మత్స్యకూర్మవరాహాశ్చ సింహవామనభార్గవాః ।
ఇత్యాద్యాః కేవలో విష్ణుః నైషాం భేదః కథంచన ॥"

(భారత తాత్పర్యనిర్ణయము)

అను శ్లోకమునందును ఈ సిద్ధాంతమే చెప్పబడియున్నది.

(7) "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"
"యః సర్వజ్ఞః స సర్వవిత్" మఱియు
"యస్య జ్ఞానమయం తపః"

అను శ్రుత్యర్థములు ఇందు వివరింపబడి యున్నవి. (శ్లో. 76)

---

## మూడవ అధ్యాయము

ఈ అధ్యాయమున శ్రీమన్నారాయణుని దశావతారముల, మఱియు ఇతరావతారముల గుణ - రూప - క్రియా - మహిమల వర్ణనము గావింపబడినది. మఱియు కొన్ని శ్రుతివాక్యములను వివరించు కొన్ని శ్లోకములు కూడ ఇందున్నవి.

**ఉదాహరణమునకు**

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"
"సహస్రశీర్షమహం భజే" "సహస్రశీర్షా పురుషః"
"వేదా హి ఏవ ఏనం వేదయంతి"
"న తత్ర చక్షు ర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి న మనః" (శ్లో. 9)
"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"
"సర్వే వేదా యత్పదమామనంతి" (శ్లో. 53)
"ఏష ఉ ఏవ పరో వరీయాన్ ఉద్గీథః స ఏష ఆత్మా" (శ్లో. 56)
"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి (శ్లో. 58)
"స యో ఒతో ఉగతో ఒమతో ఒవతో ఒదృష్టో .... ...
శ్రోతా, మంతా, ద్రష్టా, హోష్టా" (శ్లో. 59)

మొదలగునవి. ఇంకను ఇందనేకవిధములుగా శ్రీ శ్రీనివాసుడు స్తుతింపబడెను. శ్రీహరి యొక్క అవతారములు అనంతములుగ నుండుటచే వాని నామాదులను గ్రహించుట అశక్యమనియు, ఆ యవతారముల శక్తియుక్తులు, గుణగణములు అనంతములనియు, వర్ణించుట కశక్యములనియు చెప్పబడినవి.

---

## నాల్గవ అధ్యాయము

(1) ఈ అధ్యాయమునందు ప్రప్రథమమున శ్రీ వేంకటేశుని స్తోత్రము 'పురుషసూక్త' ప్రకారముగ చేయబడినది.

(2) క్షేత్రమూర్తియగు శ్రీ లక్ష్మీవేంకటేశుని అనుగ్రహ సిద్ధికొఱకు ఆ మూర్తిరూపము, తద్వైశిష్ట్యము వర్ణింపబడియున్నవి. (శ్లో. 8-17)

(3) బ్రహ్మాండ పిండాండములయందు 'వ్యూహ' రూపముల సమస్త వ్యాపారములను అవలీలగా నిర్వహించు 'వాసుదేవ-సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధాది' చతుర్వ్యూహ రూపముల వర్ణనము, పంచ మహాభూతములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచతన్మాత్రలు మఱియు పంచ కర్మేంద్రియములు అను వానియందు అధిష్ఠించి యుండి సర్వజీవరాసులకు వాని వాని గతి ననుసరించి చేసెడి వ్యాపార మహిమలు మొదలగు వానినన్నిటిని తెలిపి, ఇంతటి అచింత్యాద్భుత శక్తి కలిగిన శ్రీ వేంకటేశుని 'శరణం ప్రపద్యే' అని దేవశర్మ ప్రార్థించెను. (శ్లో. 20-21)

4) పిదప శ్రీ శ్రీనివాసుని 'నామసంకీర్తన' మహిమలు వర్ణించుచు "అయమేవ మహా ధర్మో నరాణాం తారకః స్మృతః" (శ్లో. 42) అని చెప్పిరి. శమదమాది యుక్తులై, భాగవతమున చెప్పబడిన ముప్పది భాగవత ధర్మముల యనుష్ఠానముచే శ్రీహరి యొక్క ప్రసాదమును, మోక్షమును పొందు ఉపాసనా మార్గము ననుసరించుటకు శక్తి లేనివారికి నిరంతర నామస్మరణమే తారకమని భాగవతమునందు చెప్పబడియున్నది. "సూచీముఖాది" "ఏవం విధస్యాపి నరకదుఃఖస్య హరినామ కీర్తనమేవ పరిహారకమివ తదేవ మహాప్రాయశ్చిత్తం త్రివిధానామపి పాపానామితి సంతతం ఆదరేణ అనుష్ఠేయమ్" అని భాగవతమునందు ఉపదేశింపబడినది ఈసిద్ధాంతమే యని స్పష్టముగ నిరూపితమైనది. దీనిని బుద్ధ్యారూఢము చేయుటకే 'అజామీళుడు' 'గజేంద్రుడు' మఱియు 'ప్రహ్లాదుడు' మొదలగువారు దృష్టాంతములుగ నివ్వబడిరి

5) "ఓం నమో వేంకటేశాయ" (శ్లో: [illegible])

అను మంత్ర జపమహిమను వివరించు సందర్భ[illegible] [illegible]కము యొక్క "పురుషాయ" అను శబ్దమునందు శ్రీనివాసుడు 1) శ్వేత

ద్వీపము, 2) అనంతాసనము, 3) వైకుంఠము, 4) అవ్యాకృతాకాశము, 5) సత్యలోకము మఱియు 6) సర్వవ్యాప్త్యమలములు అను ఆరు వాసస్థానములు కలవాడు-అను నర్థములు సూచింపబడియున్నవి. ("పురాని షడ్ వాసస్థానాని యస్య సః పురుషం")

6) శ్రీ శ్రీనివాసుని నిరంతర స్మరణచే మాహాత్మ్యజ్ఞానము, తద్ద్వారా అతనియందు భక్తి, ఇతర విషయములందు వైరాగ్యము, వీనివలన ఆపై క్రమముగా గురువగు వాయుదేవుని అనుగ్రహము, తద్ద్వారా శ్రీ శ్రీనివాసుని ప్రసాదము, అపరోక్షము, తుదకు మోక్షప్రాప్తి కలుగునని వివరింపబడియున్నది. (శ్లో. 55)

7) "యేనైకదా విష్ణుపదాబ్జయుగ్మే సమర్పితం చిత్తమనన్య బుద్ధ్యా" (శ్లో. 59)

అను శ్లోకమునందు "జిహ్వా నవక్తి" అను భాగవత వచనమునందిమిడి యున్న సిద్ధాంతమే చెప్పబడియున్నది.

---

## ఐదవ అధ్యాయము

సర్వత్ర సర్వకాలసర్వావస్థలయందు సకల జీవరాసులను రక్షించుటలో సమర్థురాలును, దోషదూరురాలును, నిత్యముక్తురాలును, గుణపూర్ణురాలును అయిన లక్ష్మీదేవిని స్తోత్రముచేయు సందర్భమున వ్యాఖ్యాతలు గాయత్రీ మంత్రములోనుండు 'సవితుః' 'వరణీయా' 'గాయత్రీ' 'ధ్యేయా' 'ప్రచోదితా' ఇత్యాది శబ్దములచే, ముఖ్యార్థములో గాయత్రీ మంత్ర ప్రతిపాద్యురాలు లక్ష్మీదేవియే (పరమముఖ్యార్థమునందు శ్రీనివాసుడు) అని వ్యాఖ్యానించియున్నారు. మఱియు 'సావిత్రీ' 'సరస్వతీ' 'భారతీ' అను శబ్దములు కూడా ముఖ్యార్థమునందు శ్రీ లక్ష్మీదేవినే చెప్పునని వివరింపబడి యున్నది.

ఇట్టి కరుణామయురాలైన శ్రీ లక్ష్మీదేవి, పరమాత్ముని భక్తులకు "కల్పవృక్ష" మనియు, "చింతామణి" యనియు, "కామధేను" వనియు స్తుతింపబడినది. (శ్లో. 3-10) ఇందులో

"యంకామయే తం తముగ్రం కృణోమి" అను శ్రుత్యర్థము వర్ణింప బడినది. (శ్లో. 12)

అప్రమేయురాలును, నిత్యావియోగినియు, మహైశ్వర్యములతో కూడినదియును అయిన ఈ లక్ష్మీదేవియే భగవంతుని నిరంతరము స్మరణ-ధ్యాన-మనన-నమన-అర్చన-జప-తపః-ప్రార్థనారూపములగు సేవలచే సర్వవిధముల సేవించుచున్నపుడు, అల్పులైన ఇతరులు అట్లు చేయుటలో ఆశ్చర్యమేమియు లేదని చెప్పబడినది.

పిదప, దేవశర్మ తన అల్పత్వమును చెప్పుకొనుచు తన అహంకార, మమకారాభిమానాది దోషములను ఖండించుకొని యున్నాడు. బింబోపాసనమును వదలి, ఇతరములగు సహస్రవిధ సాధనములుండినను వానిచే మోక్షము లభింపదను సిద్ధాంతమును స్ఫుటముగ నిరూపించుటకై

'వినా బింబోపాసనాం సాధన సహస్రేణాపి ముక్తేరయోగాత్'

(భాగవతము)

తన హృత్కమలస్థుడును, బింబరూపియునైన శ్రీహరియొక్క స్తోత్రమును, చింతనరూపమగు ఉపాసనను చేసి చూపించి యున్నాడు. (శ్లో. 31-45)

పిదప పరమాత్ముని అనితరసాధ్యములైన కార్యములను వర్ణించి, చివరగా ఆతని పాదారవిందములను "ముక్తిం భక్తాయ దేహి మే" అని ప్రార్థించియున్నాడు. (శ్లో. 52-54)

ఈ రీతిగా గావింపబడిన అత్యుత్తమ స్తోత్రముచే, స్తోత్రరూపోపాసనచే భక్తులయందు కరుణామయుడగు శ్రీ శ్రీనివాసుడు

సుప్రసన్నుడై దేవశర్మను 'మత్ప్రియప్రాణశిష్యస్య' అని సంబోధించి

'తేఽపి శ్రియం దీర్ఘమాయు ర్విద్యాం పుత్రాన్ సువర్చసః।
లబ్ధ్వా భోగాంశ్చ భుక్త్వాంతే వరా మోక్షమవాప్నుయుః'॥

అనగా ఐహిక సంపదలు, దీర్ఘాయువు, సద్విద్య, వర్చస్సుగల భార్యా పుత్రులు; ఐహిక భోగాదులు కలిగి, అనంతరము జననమరణాదులులేని పరమపదమును (మోక్షమును) పొందుదువని యనుగ్రహించి అంతర్ధాన మయ్యెనని ప్రతిపాదింపబడి యున్నది.

ద్వాపరయుగములో కుచేలుడు శ్రీకృష్ణపరమాత్మయొద్దకేగి ఆయన యనుగ్రహముచే శ్రీమంతుడైన రీతిగ, కలియుగములో దేవశర్మయను విప్రుడు కుటుంబజీవనోపాయము గానక శ్రీ శ్రీనివాసుని శరణువేడగా ఆ కరుణాసాగరుడు సర్వ సౌఖ్యముల నిచ్చి రక్షించెనను దృష్టాంతముచే, ప్రస్తుత సమాజమునకు దారిద్ర్యపరిహారమునకు ఇదియొక్కటియే అత్యుత్తమ సాధనమని చెప్పవచ్చును.

శ్రీ సూతమహర్షి శౌనకాదులు ఆదిలో తన్నడిగిన ప్రశ్నకు ఈవృత్తాంతముతో ప్రత్యుత్తరము చెప్పుచు 'దేవశర్మవలె మీరును వేంకటాచలయాత్రకు వెళ్ళి శ్రీ వేంకటేశుని యనుగ్రహమును సంపాదింపు'డని ఉపదేశించియున్నారు.

భగవంతుని ఉపాసించుటకై మన ప్రాచీను లేర్పరచిన పద్ధతులలో ఈ 'పారాయణవిధానము' అత్యంత విశిష్టమైనది. వేదవ్యాసాది మహర్షి పుంగవులు వెలయించిన ఆర్ష వాఙ్మయములో ప్రతిదిన పారాయణార్హములైన ఇటువంటి ఘట్టములెన్నో కలవు. వానిలో ఈ మాహాత్మ్యగ్రంథము అగ్రగణ్యమైయున్నది.

ఇట్లు ఈ ఆదిత్యపురాణాంతర్గత "శ్రీ వేంకటేశమాహాత్మ్య స్తోత్రము" వేదార్థసారమై యున్నది. పురుషసూక్త, గాయత్రీ మంత్రా

ర్థములు, బింబోపాసనము ఇత్యాదులచే సంగ్రహముగా అమరియున్న ఈ ప్రశస్తగ్రంథమును పూర్తిగా గాని, అందులో కొంత భాగమైనను, కనీసమొక శ్లోకము చొప్పునైనను వరుసగ ప్రతిదినము భక్తి పూర్వకముగా పఠించువారలకు శ్రీ వేంకటేశుడు ఐహికాముష్మిక సమస్త శుభములను అనుగ్రహించుచున్నాడను విషయము సంప్రదాయ సిద్ధమైన, అనుభవైకవేద్యమైన సత్యము.

ఇటువంటి అమూల్యమైన సనాతనధర్మప్రబోధాత్మకములగు సంస్కృతగ్రంథములను భాషాంతరీకరించి మూల శ్లోకపూర్వకముగా అనువాదగ్రంథములను ప్రాంతీయ భాషలలో ముద్రించి ప్రచురించిన యెడల సంస్కృత భాషాపరిచయములేని తత్త్వజ్ఞానార్థులగు భక్త జనులకు మిక్కిలి నుపయోగకరముగ నుండుననుటలో సందేహము లేదు ఈ విధముగా భారతీయ తత్త్వజ్ఞాన భండారమును బహు కాలము రక్షించి నట్లగును.

ఆ కృషిలో నొకభాగముగ ఈ స్తోత్రముయొక్క ఉనికిని గుర్తించి దీనిమూలమును మాత్రము దేవనాగరిలిపిలో మొదట ప్రచు రించితిని. అశేషజనాదరణమున అది పునర్ముద్రణ భాగ్యమును బడసి నది. అటు పిమ్మట కన్నడపాఠకుల కోరికపై ఈ స్తోత్రమును కన్నడ భాషలో తాత్పర్య విశేషార్థ సహితముగా కన్నడలిపిలో ప్రచురించి తిని. ఆ కర్ణాట భాషానువాదము సైతము భక్తుల అభిలాష కారణ ముగా ద్వితీయముద్రణ గావింపబడినది.

ఇట్టి మహిమోపేతమైన ఈ స్తోత్రమునకు ఇంతవరకు ఆంధ్రాను వాదము లేకుండుటవలన, ఆస్తిక మహాజనులనేకుల కోరిక ననుసరించి తెలుగులో తాత్పర్య విశేషార్థ సమేతముగా ఈ గ్రంథము రచింప బడినది. ఈ యాంధ్రానువాదము ప్రప్రథమముగా తిరుమల తిరుపతి దేవస్థానమువారి ద్వారా ప్రచురింపబడుచున్నందులకు మిగుల సంత సించుచున్నాను.

ఈ గ్రంథములో ప్రతిపాదింపబడిన సిద్ధాంతములన్నియు స్వప్రమాణములు. ఆయా సిద్ధాంతములను గూర్చి కొంత సంగ్రహముగా వివరింపబడియున్నను, అట్లు వివరింపబడని స్థలములందు ఆయా గ్రంథముల నామములను మాత్రమిందు ఉదాహరించితిని. గ్రంథవిస్తరభీతిచే ఆయా విశేష వివరణలను ఇందుదాహరింపలేదు. పఠితల పారాయణ సౌకర్యార్థము మూలశ్లోకములు గ్రంథారంభమున ప్రత్యేకముగా పొందుపఱుపబడినవి.

ఆస్తికమహాశయులు శ్రీ స్తోత్రరత్నమును నిత్యము పఠించి, భగవదనుగ్రహమువలన సర్వారిష్టశాంతిని, సకల మనోరథప్రాప్తిని బడయగలరనియు, నీరక్షీర వివేక న్యాయమున ఈ అనువాదములోని దోషములను మన్నించి, గుణములను గ్రహింతురనియు విశ్వసించుచున్నాను.

శ్రీ వేంకటాచలసచ్ఛైలవాసీ దాసీకృతామరః।
ఛాయయా పాతు మాం నిత్యం శ్రీనివాస సురద్రుమః॥

తిరుపతి,
దుందుభి,
నృసింహ జయంతి

ఆర్. రామమూర్తిశర్మ.

# కృతజ్ఞతలు

తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్. (ఐ.ఏ.యస్..) గారు భారతీయ సనాతన ధర్మప్రబోధాత్మకములైన గ్రంథములను పెక్కింటిని ప్రచురించి తక్కువమూల్యమునకు ప్రజల కందించుచున్న విషయము సర్వజన సువిదితము. ఆ ప్రణాళికలో నొక గ్రంథముగా దీనిని ప్రచురించుచున్న సువిశాలహృదయులు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు. ఇటులనే ఇంకను అనేక ధార్మిక గ్రంథములు వీరిచే ప్రచురింపబడి వెలుగులోకి రావలయునని శ్రీ వేంకటరమణుని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథప్రకటనకు సహాకరించిన శ్రీ కె. సుబ్బారావు M.A., (సప్తగిరి సంపాదకులు) గారికి నా అభినందనలు.

ఈ గ్రంథము వెలుగులోనికి వచ్చుటకు ముఖ్య ప్రేరకులైన తిరుపతి వాస్తవ్యులు వ్యాకరణశిరోమణి శ్రీ వి. కృష్ణాచార్యులు గారికి నా కృతజ్ఞతాభివందనములు. కన్నడ భాషలో దీని ననువదించిన కీర్తిశేషులు ఉడిపి వాస్తవ్యులైన శ్రీ అగ్రహార నారాయణ తంత్రిగారికి, ఆంధ్రానువాదమునకు తోడ్పడి ముద్రణకు ప్రోత్సహించిన కీర్తిశేషులు శ్రీ సుస్వరం వేంకటరమణ భాస్కర్. (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ, తిరుపతి) గారికిని నా కృతజ్ఞతాభివాదములు.

ఈ గ్రంథపరిష్కరణలో మిగుల సహాకరించిన డా॥ కె. జె. కృష్ణమూర్తి, M.A., Ph.D., (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ, తిరుపతి.) గారికి నా కృతజ్ఞతాపూర్వక ఆశీరభినందనలు. అదేరీతిని సహాకరించిన మద్రాసు వాస్తవ్యులు సాహిత్య శిరో

మణి శ్రీ నుస్వరం నాగరాజ భాస్కర్ గారికి, వ్యాకరణ విద్యా ప్రవీణ శ్రీ కె. వి. రామకృష్ణమాచార్యులు, M.A., (కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము, తిరుపతి) గారికి నా అభినందనలు.

ఈ గ్రంథమును అందముగా ముద్రించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాలయాధికారి శ్రీ ఎమ్. విజయకుమార్ రెడ్డి (Dip. in Ptg. Technology) గారికి, మిగుల సహకరించిన తదితర సిబ్బంది వర్గమునకు నా ప్రేమపూర్వక శుభాకాంక్షలు.

" సర్వే జనా స్సుఖినో భవన్తు "

ఆర్. రామమూర్తిశర్మ.



శ్రీః

శ్రీ శ్రీనివాసో విజయతే

## ఆదిత్య పురాణాన్తర్గత

# శ్రీ వేంకటేశ మాహాత్మ్యము

## ప్రథమాధ్యాయము

శ్రీ శౌనకాదయ ఊచుః—

శ్రీ వేంకటేశమాహాత్మ్యం శ్రీనివాసప్రసాదతః ।
శ్రీప్రదం సర్వదా సూత దయయా ప్రోక్తవానసి ॥ 1

ఇతః పరం శ్రీనివాసః శ్రీపతిః సర్వశో హి నః ।
కథం ప్రీతో భవేత్సద్యో హ్యాభీష్టాని ప్రవర్షయేత్ ॥ 2

తద్వదస్వ కృపాపూర్ణ వేంకటేశకథామృతమ్ ।
భగవన్ సర్వతత్త్వజ్ఞ దయాపాత్రం వయం తవ ॥ 3

శ్రీ సూత ఉవాచ:—

శృణుధ్వం మునయో దివ్యం సావధానతయా త్విదమ్ ।
యథా పృష్టం తథైవాహం వక్ష్యామి వచనం శుభమ్ ॥ 4

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి ॥ 5.

అద్భుతం చాస్య చరితం వర్ణితుం కేన శక్యతే ।
తథాపి తారకం సర్వపాపఘ్నం పుణ్యవర్ధనమ్ ॥ 6

సువిచిత్రమపూర్వార్థం దేవర్ష్యాదిభిరాదృతమ్ ।
లోకోత్తరం మహైశ్వర్యం వక్ష్యే సర్వార్థసిద్ధిదమ్ ॥ 7

శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే న తత్ క్వచిత్
తద్గత శ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః ॥ 8

వేదేషు చ పురాణేషు వేంకటేశకథామృతమ్।
వర్ణితం చేతిహాసేషు భారతాద్యాగమేషు చ॥ 9

మనోహరం తు సంశ్రావ్య మిహాముత్రేష్టదాయకమ్।
జ్ఞానప్రదం విశేషేణ మహదైశ్వర్యకారణమ్॥ 10

వైరాగ్యభక్తిసత్త్వాదిప్రదేంద్రియవశప్రదమ్।
వేంకటాద్రౌ శుచిక్షేత్రేఽశుచిదోషో న విద్యతే॥ 11

తస్మాద్వేంకటనాథస్య నైవేద్యం గ్రాహ్యముత్తమమ్।
తేన క్షేమం ప్రజానాం హి విపరీతే విపర్యయః॥ 12

కర్తా హి సృష్టిస్థితిసంయమాదేర్ధర్తా రజస్సత్వతమాంస్యనర్హాః।
అనాద్యనంతో వచసాఽనిరుక్తః సదాశ్రయో దేవవరో
వరేణ్యః॥ 13

నిత్యం బ్రహ్మా శివః శేష గరుడేంద్రాదయోఽమరాః।
పూజయంతి మహాభక్త్యా వేంకటేశం శ్రియా సహ॥ 14

చరాచరగురుర్దేవః సర్వసాక్షీ మహేశ్వరః।
సేవ్యస్తు పూజ్యోఽర్చనీయశ్చ స్మర్యో ధ్యేయోఽఖిలైరపి॥ 15

తన్మనాస్తద్గతప్రాణో భక్త్యా తన్నామ సంస్మరేత్।
గోదానాన్యశ్వమేధాద్యాః కన్యాదానాన్యసంఖ్యయా॥ 16

అసంఖ్యమేరుసౌవర్ణదానాన్యన్యాన్యనేకశః।
తన్నామస్మృత్యతుల్యాని మాహాత్మ్యం కిముతాద్భుతమ్॥ 17

ఇతి శేషేణ కథితం కపిలాయ మహాత్మనే।
కపిలాఖ్యమహాయోగిసకాశాత్తు మయా శ్రుతమ్॥ 18

తదుక్తం భవతామద్య సద్యః ప్రీతికరం హరేః।
అతో వో మంగలార్థం చ శృణుధ్వం యన్మయోచ్యతే॥ 19

శ్రీవేంకటేశయాత్రార్థం గచ్ఛధ్వం సుదృఢవ్రతాః ।
విష్ణుసందర్శనం కృత్వా భక్తిమంతో జితేంద్రియాః ॥ 20

స్తోత్రం కురుధ్వం బహుధా భగవద్గుణవర్ణనైః ।
స్వగుణోత్కర్ష విజ్ఞానాద్యథా ప్రీతిర్నిజే హరేః ॥ 21

న తాదృశీ ప్రీతిరస్తి హ్యజ్ఞానాదన్యథా మతా ।
భక్త్యా స్తోత్రేణ సంతుష్టః సర్వేష్టాని ప్రవర్షతి ॥ 22

భక్తిస్తోత్రాదిహీనేషు దయాపాంగో న సర్వథా ।
అత్ర వః కథయామీష్టమితిహాసం పురాతనమ్ ॥ 23

యస్య స్మరణమాత్రేణ భక్తిర్విష్ణుపదాంబుజే ।
వాయుశిష్యో దేవశర్మా విష్ణుభక్తో జితేంద్రియః ॥ 24

తపస్వీ బహునిష్ఠావాన్ సర్వదా విష్ణుచింతనే ।
మమతాహంకారవర్జ్యో విషయేషు విరాగవాన్ ॥ 25

షట్ఛత్రువిజయీ శాంతః షట్తరంగసుభంగకృత్ ।
కుటుంబే న మనఃకారీ దారిద్ర్యాత్పీడితోఽపి చ ॥ 26

భార్యయా ప్రార్థితో నిత్యం దారిద్ర్యాపగమేచ్ఛయా ।
"భో నాథ! హే పతే! స్వామిన్! ప్రసీద కరుణాకర! 27

క్షుధయా పీడితా బాలాస్తవ పుత్రాశ్చ కేవలమ్ ।
న శక్తాఽహమరణ్యేషు కందమూలార్జనాదిషు ॥ 28

రక్షకో మమ నాన్యోఽస్తి శిశూనాం పాలనేఽపి చ ।
కృపాం కురుష్వ శిశుషు విజ్ఞాపనమిదం శృణు ॥ 29

కులస్వామీష్టదేవో నో జగద్రక్షణదీక్షితః ।
శరణాగతసంత్రాణః శ్రీనివాసస్సతాం గతిః ॥ 30

పాలకో హి బహూనాం చ భక్తానాం భక్తవత్సలః ।
తల్లక్ష్మీపతిపాదాబ్జం గత్వా తత్ప్రార్థనాం కురు ॥ 31

తేన ప్రీతో భవేత్సద్యః తతోఽస్మజ్జీవనం భవేత్ ।
ప్రసీద త్వం దయాసింధో దయాం కురు దయాం కురు ॥ " 32

ఇతి దైన్యేన మహతా ప్రార్థితోఽహర్నిశం తయా ।
న స్వీచకార తద్వాక్యం తపోవిఘ్నభయాత్తదా ॥ 33

దిష్ట్యా చాదృష్టపాకేన తద్గురుర్వాయురాగమత్ ।
పతివ్రతాయాం శిశుషు ప్రసన్నః కరుణానిధిః ॥ 34

తపోఽవసానే సంప్రాప్తం స్వగురుం జగతాం గురుమ్ ।
దృష్ట్వా ముదా దేవశర్మా సహసోత్థాయ చాదరాత్ ॥ 35

సాష్టాంగం తం ప్రణమ్యాథ బద్ధాంజలిపుటోఽభవత్ ।
తతో వాయుః ప్రాహ శిష్యం మధురం వచనం హితమ్ ॥ 36

"శ్రీమద్వేంకటనాథస్య యాత్రార్థం గచ్ఛ మా చిరమ్ ।
తేనేహాముత్ర తేఽభీష్టసిద్ధిర్భవతి నాన్యథా ॥ 37

లక్ష్మీపతే ర్దయాసింధోః బ్రహ్మాదివరదాయినః ।
యాత్రాయాంమాస్తు సందేహః శీఘ్రం గచ్ఛ సుభక్తిమన్" ॥ 38

ఇతి దేవాద్యుత్తమేన గురుణా వాయునేరితః ।
ముహుర్ముహురోప్యేధితోఽథ విష్ణుయాత్రామహాదరః ॥ 39

గురూక్తమర్థం జగ్రాహ గురువాక్యే సదా రతః ।
గురూపదేశో బలవాన్ గురోరాజ్ఞాం న లంఘయేత్ ॥ 40

ఇత్యర్థమనుసంధాయ వ్రతస్థే శేషపర్వతమ్ ।
తత్ర శ్రీవేంకటేశస్య సందర్శనమహాదరః ॥ 41

ఆనందజ్ఞానదం విష్ణుం ఆనందమయనామకమ్।
ఆనందేన దదర్శాథ ఆనందనిలయాలయే॥ 42

విహరంతం శ్రీధరాభ్యాం నానాలీలావిలాసినమ్।
భక్తదర్శనమాత్రేణ ప్రసన్నం మందహాసినమ్।
శ్రీ వేంకటేశం సందృష్ట్వా భక్త్యా చక్రేఽథ సంస్తుతిమ్॥ 43

## ॥ అథ దేవశర్మకృతా స్తుతిః ॥

దేవశర్మోవాచ –

దయానిధే దయానిధే దయానిధే దయానిధే।
నమో నమో, నమో నమో, నమో నమో, నమో నమః॥ 44

శ్రీపద్మనాభ పద్మేశ పద్మజేశేంద్రవందిత।
పద్మమాలిన్ పద్మనేత్ర పద్మాభయదరారిభృత్॥ 45

పద్మపాణే పద్మపాద సర్వహృత్పద్మసంస్థిత।
త్వత్పాదపద్మయుగలం ప్రణమామ్యతిసుందరమ్॥ 46

త్వత్పాదపద్మ మాహాత్మ్యమప్యనంతం త్రివిక్రమమ్।
యత్కనిష్ఠాంగుళీ నఖమణ్యగ్ర గుణసంగతాన్॥ 47

అనంతాన్ సువిశేషాంశ్చ పశ్యంతీ శ్రీర్నిరంతరమ్।
స్తోతుకామాఽక్షీణదీక్షా హర్షాదాశ్చర్యసాగరే॥ 48

గహనే గాహమానాఽభూదనంత శ్రుత్యగోచరే।
త్వయోపదిష్టో యః పుత్రవాత్సల్యాచ్చతురాననః॥ 49

త్వద్గుణానాం చ గణనాత్ ఆనందమతులం భజన్।
నాద్యాపి విరరామాసౌ గణనాద్దేవరాడపి॥ 50

సహస్రవదనః శేషోఽశేష వేదార్థకోవిదః।
నాహం జానే ఇతి బ్రూతే యన్నఖాగ్ర్యాగ్రవైభవమ్॥ 51

**అనంత వేదాః ఖాపంతే హ్యనోన్యఽన్యం ప్రవిచార్య చ॥** 52

ఏకైకస్మిన్నధికారే నియుక్తాః
ఏకైకశో బ్రహ్మపూర్వాశ్చ విష్ణోః।
సర్వే దేవాః స్వాధికారే నియుక్తాః
సత్యాదిలోకేషు యథాక్రమేణ॥ 53

భుంజంతి చేష్టాని మహోదరేణ
భజంతి శేషాచలగం రమేశమ్।
వయం త్వనంతా హరిణా నియుక్తా
వేదాః స్తుతౌ స్వస్య గుణానుభావమ్॥ 54

గుణాస్త్వనంతాః పరమాత్మనో యత్
పదోనఖాగ్రస్థ గుణైకదేశమ్।
స్తుతౌ మిలిత్వా వయమప్యశక్తాః
వేదాస్త్వనంతాజనితా స్తదర్థమ్॥ 55

ఏవం సునిశ్చిత్య గుణైకదేశ -
మాహాత్మ్యమేతే త్వవిజానమానాః।
ఉప (అప) క్రాన్తాః స్తోతుమథో గుణైక -
దేశోఽప్యనంతాంత్మతయాఽభివృద్ధః॥ 56

తం వీక్ష్య తేఽన్యోఽన్యమథోచురేకం
గుణం వదామో విసృజామ శేషాన్।
ఆరేభిరే పూర్వవదేక తేఽపి
గుణా హ్యనంతాః ఫలదాస్త్వా సృతాశ్చ 57

గుణైస్సమంతాత్ శుభదైరనంతైః
ప్రత్యేకశః కిరణానీవ పూష్ణః।
విదిశు దిశూర్ధ్వమధశ్చ దేవాః
దృష్ట్వా గుణానద్భుతా నిత్యవోచన్॥ 58

ద్రష్టుం శ్రోతుం కీర్తితుం వాఽపి బోద్ధుం
అశక్యం నః కిముత స్తోతుమేశాన్ ।
అస్మానతీతాన్ వయమల్పసారాః
కిం వర్ణయామోఽలమలం ప్రశంసయా ॥ 59

ఇత్యుక్తవంతః స్వమనోఽనుసారాత్
గుణానేతాన్ వర్ణయామాసు రంజసా ।
తథాఽపి తే పాదనఖాగ్రగేషు
గుణేష్వనంతేషు విభాజితస్య ॥ 60

గుణైకదేశస్య గుణైకదేశః
ప్రవర్ణితోఽంశా బహవో న వర్ణితాః ।
ఏవం రమాఽజాహిప వేదముఖ్యాః
శక్తా నాసన్ వర్ణనే త్వద్గుణానామ్ ॥ 61

యత్సను స్తగుణాన్విష్ణోః వర్ణనే శక్తివర్జితాః ।
అనంతవేదాస్తద్భూమన్ గుణమాహాత్మ్యమీదృశమ్ ॥ 62

ఇతి ఆదిత్య పురాణాంతర్గత శ్రీ వేంకటేశ మాహాత్మ్యమునందు
పాదనఖాగ్రమహిమావర్ణనపరమగు ప్రథమాధ్యాయము సమాప్తము.

## ద్వితీయాధ్యాయము

॥ అథ శ్రీ శ్రీనివాస దివ్యమంగళ విగ్రహసౌన్దర్యాది వర్ణనమ్ ॥

దేవశర్మోవాచ —

ఇతోఽప్యథ త్వత్పాదాబ్జగతసౌన్దర్యమద్భుతమ్ ।
స్వామింస్త్వయా ప్రేరితశ్చేత్ యథామత్యనువాదయే ॥ 1

వక్షఃస్థాఽపి రమాదేవీ తవ పాదాంబుజే స్థితమ్ ।
సౌన్దర్యమద్భుతం దృష్ట్వా సున్దరీ మోహితాఽభవత్ ॥ 2

విస్మితా ద్రష్టుకామా ద్ధి స్వస్య నేత్రద్వయేన వై ।
అశక్యం దర్శనం మత్వా త్రిరూపా చాభవత్తదా ॥ 3

హర్షాత్ శ్రీరూపిణీ వామే భూరూపా దక్షిణే స్థితా ।
దుర్గారూపాఽగ్రభాగస్థా త్రిరూపా నేత్రషట్కతః ॥ 4

పశ్యన్త్యనన్యమనసా సౌన్దర్యాఖ్యరసాయనమ్ ।
పిబన్త్యప్యన్వహం నాపి నివృత్తా తృష్ణయాఽధునా ॥ 5

శ్రీసున్దర శ్రీనివాస నాభిస్థశ్చతురాననః ।
తవ పాదాంబుజే రమ్యే సౌన్దర్యే లగ్నమానసః ॥ 6

అష్టనేత్రాణ్యే దివారాత్రం పశ్యన్ సౌన్దర్యమద్భుతమ్ ।
నాలం నేత్రాష్టకమితి బహురూపీ తదాఽభవత్ ॥ 7

కంఠే చ కౌస్తుభం నాభౌ వైకుంఠాదిత్రిధామసు ।
సత్యలోకే చ మేర్వాదౌ సర్వత్ర చతురాననః ॥ 8

తతః పాదాబ్జసౌన్దర్యరసం చామృతధిక్కరమ్ ।
ప్రీత్యా పాతుమహోరాత్రం ఆస్వాద్య సుఖభోగినః ॥ 9

తృష్ణా శాన్తాఽధునా నాపి పాదసౌన్దర్యమీదృశమ్ ।
శయ్యాసనాఽఽతపత్రాదిరూపీ త్వత్పాదసేవకః ॥ 10

శేషో బహుసహస్రాతః సదాఽనన్తస్థోఽప్యచిన్తయత్ ।
అస్మత్స్వామ్యంఘ్రిసౌన్దర్యం విచిత్రం సుమనోహరమ్ ॥ 11

అదృష్టశ్రుతపూర్వం చ మహాగాధం విలక్షణమ్ ।
సులక్షణం చ సన్ద్రశ్యం జగన్మోహనమోహకమ్ ॥ 12

బహూని మమ నేత్రాణి సమీపే సర్వదా హరేః ।
వాసశ్చేశప్రసాదేన త్వేవం భాగ్యమభూన్మమ ॥ 13

ఇతి సంభ్రమసంయుక్తః సర్వదాఽతిప్రియో హరేః ।
నేత్రైర్బహుసహస్రైశ్చ లక్ష్మీపతిపదాంబుజే ॥ 14

అసమం చిత్రసౌన్దర్యం దృష్ట్వా దృష్ట్వా పునః పునః ।
మహానన్దామ్బుధౌ మగ్న ఏవం మేనే ఫణీ తదా ॥ 15

వసామ్యహం సదైవాత్ర పాదమూలే చ మత్పతేః ।
వైకుంఠం వా న గచ్ఛామి త్యక్త్వా విష్ణుపదాంబుజే ॥ 16

యస్త్వానన్దో భవేన్నిత్యం పాదసౌన్దర్యదర్శనాత్ ।
వైకుంఠ ఈదృశానన్దః కైవల్యేఽపి న విద్యతే ॥ 17

పాతాళమాత్రం గన్తవ్యం పాదమూలం యతో హరేః ।
న స్థాస్యామి క్షణమపి యత్సౌన్దర్యామృతం వినా ॥ 18

ఇతి నిశ్చిత్య నాగేన్ద్రః పాదసౌన్దర్యమోహితః ।
యత్ర యత్రేన్దిరేశస్య పాదమూలం ప్రవర్తతే ॥ 19

తత్ర తత్ర సదా పాదసౌన్దర్యామృతపాయ్యభూత్ ।
అథాచిన్తయదేవం హి శంకరో లోకశంకరః ॥ 20

శేషస్య కిమహో భాగ్యం శేషాగేశప్రసాదజమ్ ।
బహునేత్రాణి త్వత్పాదసౌన్దర్యామృతసేవనమ్ ॥ 21

ఏతద్ద్వయం దుర్లభం మే త్రినేత్రత్వాదహో బత ।
భావిజన్మని శేషత్వప్రాప్త్యర్థం వా మహత్తపః ॥ 22

కరోమీత్యతివైరాగ్యాత్ శంభుః కైలాసగోఽభవత్ ।
శ్రీవేంకటేశేన్దిరేశ విష్ణుస్తవ ముఖాంబుజాత్ ॥ 28

జాతస్సహస్రవదనోఽప్యేవం తవ పదాంబుజే ।
అదృశ్యాశ్చర్యసౌందర్యం సంపశ్యన్నప్యహర్నిశమ్ ॥ 24

ఇత్యచింతయదత్యన్తం పాదసౌందర్యమోహితః।
అమృతస్య పురా పానే మే నాభూదీదృశం సుఖమ్॥ 25

సౌందర్యమతిసామీప్యదోషాత్ సమ్యఙ్ న దృశ్యతే।
ఇతోఽప్యతిశయానందః కించిద్వ్యవహితే భవేత్॥ 26

అతః స్వర్గస్థోఽనిమిషస్తావన్నేత్రైః రహర్నిశమ్।
వీక్ష్య యావదలంబుద్ధిః తతో మత్స్థానమావ్రజేత్॥ 27

ఇతి స్వర్గగతస్యాపి యావన్నేత్రైః శ్రియఃపతే।
త్వత్తేజఃపుంజపాదాబ్జ సౌన్దర్యామృతపాయినః॥ 28

తృష్ణా శాన్తాఽధునా నాపి తస్మాత్ స్వర్గే స్థిరా స్థితిః।
శ్రీశ తే పాదసౌందర్యం లేఖానాం మహతామపి॥ 29

యద్యేవం దుర్లభమభూత్ ఇతరేషాం తు కా కథా।
కృష్ణ తే పాదరేఖాణాం మాహాత్మ్యం లోకపావనమ్॥ 30

విజ్ఞాపనం కరిష్యామి హ్యపరాధం క్షమస్వ మే।
పాదమాహాత్మ్యశ్రోతౄణాం భక్తానాం భక్తవత్సల॥ 31

మహోఽజ్ఞానతమో భిత్వా కృత్వా జ్ఞానప్రకాశనమ్।
త్వన్మార్గదర్శనార్థాయ చక్రరేఖాం పదేఽధరః॥ 32

పాదమాహాత్మ్య మన్తౄణాం సాంగవేదచతుష్టయమ్।
ఇతిహాసపురాణాని మంత్రోపనిషదాత్మకాః॥ 33

సర్వవిద్యా దదామీతి దరరేఖాం పదేఽధరః।
పాదమాహాత్మ్యధ్యాతౄణాం ఉపద్రవకరాన్ ఖలాన్॥ 34

దైత్యరక్షఃపిశాచాదీన్ కూష్మాండబ్రహ్మరాక్షసాన్।
సంచూర్ణయామీతి హరే గదారేఖాం పదేఽధరః॥ 35

పాదమాహాత్మ్యవక్తౄణాం ఉత్తమే మందిరే సదా।
పద్మయా భార్యయా సాకం పద్మజేన సుతేన చ॥ 36

కుటుంబీ పద్మనాభోఽహం వసామీత్యేవ సూచయన్।
పద్మరేఖాం పాదపద్మే పద్మేశ త్వం ధరన్నసి॥ 37

విరజా మానససరో ధనుష్కోటీ మహాఘహృత్।
గంగాదిసర్వతీర్థాని త్వత్పాదాబ్జే వసంతి హి॥ 38

సహస్రపత్రపూర్వాణి జాయన్తే తేషు నిత్యశః।
ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నసి॥ 39

పద్మా హృత్పద్మసంస్థాఽపి పాదపద్మస్య మూలగా।
పశ్యంతీ నేత్రపద్మాభ్యాం త్వత్సౌందర్యమలౌకికమ్॥ 40

ధ్యాయంతీ చ స్వహృత్పద్మే త్వన్మాహాత్మ్యం శ్రుతీరితమ్।
భజంతీ కరపద్మాభ్యాం స్వాంకేఽర్చనకరీ సదా॥ 41

ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నసి।
పాదపంకజమాహాత్మ్యం లిఖిత్వైవ స్వహస్తతః॥ 42

దాస్యానాం వైష్ణవాగ్ర్యేభ్యో మహాఘౌఘాద్రిభేదనమ్।
కరోమీతి జ్ఞాపనాయ వజ్రరేఖాం పదేఽధరః॥ 43

మాహాత్మ్యమర్చకానాం తు గజాన్ కామాదిసంజ్ఞితాన్।
అదమ్యాన్ దమయామీతి హ్యంకుశాఖ్యాం పదేఽధరః॥ 44

శ్రుత్వాఽఽదరేణ సంతుష్టాన్ భక్తాన్ ధ్వజవదుచ్ఛ్రితాన్।
కరోమీతి జ్ఞాపనాయ ధ్వజరేఖాం పదేఽధరః॥ 45

అబగ్నిరనభోఽహంకృన్మహత్తత్త్వగుణత్రయైః।
క్రమాద్దశగుణైరండమావృతం పరమాద్భుతమ్॥ 46

యన్నభాగ్రాద్వినిర్భిన్నం త్వత్పాదం కోఽనువర్ణయేత్ ।
శేషో మహత్తపస్తప్త్వా త్వామారాధ్య జగత్పతిమ్ ॥ 47

త్వత్ప్రసాదాన్మహాభాగ్యం యద్యప్యాప సుదుర్లభమ్ ।
శయ్యాసనం పాదుకే చ హ్యాతపత్రమభూత్తవ ॥ 48

తత్సుఖం తు రమా దృష్ట్వా మేనే శేషైకభాజనమ్ ।
అహమేవానుభోక్ష్యామి మత్పతేరంగజం సుఖమ్ ॥ 49

ఆతపత్రేణ యత్ప్రాప్యం పాదుకాభ్యాం చ యత్సుఖమ్ ।
సర్వం భాగ్యం మమైవస్యాదితి వక్షఃస్థితాఽపి సా ॥ 50

వైకుంఠాదిషు లోకేషు చతుర్దశసు వై తథా ।
బ్రహ్మాండాంతర్బహిశ్చాపి సర్వహృత్కమలేష్వపి ॥ 51

సుస్థితో భగవాన్యత్ర వసేఽహం తత్ర తత్ర హి ।
క్రీడావనమభూన్మందవాయుగంధాదిరంజితమ్ ॥ 52

మల్లికాకేతకీజాతీచంపకాకుసుమాన్వితమ్ ।
ఖర్జూరపనసద్రాక్షా కదళీనారికేళకైః ॥ 53

బదరీమాతులంగైశ్చ కపిత్థైశ్చూతదాడిమైః ।
జంబూజంబీరక్రముకప్రముఖైః ఫలదాయకైః ॥ 54

పారిజాతైః కల్పవృక్షైరత్యంతఫలదాయకైః ।
శ్రీచందనేక్షుమందారైః సంకులం మధుకాదిభిః ॥ 55

తస్మిన్ సరః స్వచ్ఛనీరం స్వర్ణసోపానమండితమ్ ।
నవరత్నాభకమలైః సువర్ణాభకుశేశయైః ॥ 56

పీతవర్ణైరుత్పలైశ్చ రక్తనీలోత్పలాంచితమ్ ।
మీనకచ్ఛపహంసాఢ్యం మత్తషట్పదనాదితమ్ ॥ 57

తత్ర రత్నమయం క్రీడామణ్డపం చాభవద్రమా।
దివ్యరత్నమయం తేజఃపుంజపీఠమభూన్ముదా॥ 58

తత్ర త్వామర్చయన్త్యంబా షోడశైరుపచారకైః।
పాయసాన్నం వ్యంజనాది పంచభక్ష్యామృతాని చ॥ 59

నూతనాని పవిత్రాణి నానారుచిఫలాని చ।
ఆర్ద్రికాదీని మూలాని స్వాదూదం స్వర్ణపాత్రకే॥ 60

నిత్యతృప్తాయార్పయన్తీ పూర్ణకామాయ చాదరాత్।
ఈరాంకసర్వసారాయ సర్వసారాత్మికా స్వయమ్॥ 61

ఉథాత్మానం కల్పయన్తీ డోలామంచం మనోహరమ్।
సువర్ణశృంఖలాలంబం సువిశాలం సులక్షణమ్॥ 62

ప్రవాళపాదసంయుక్తం సువజ్రఫలకైర్వృతమ్।
ఓతప్రోతైః స్వర్ణపట్టైః మాణిక్యస్తబకావృతమ్॥ 63

జాంబూనదవితానాఢ్యం ముక్తాస్తబకరంజితమ్।
భూరూపాఽభూత్ స్వయం శయ్యా శ్రీరూపా
సోపబర్హణమ్॥ 64

దుర్గాభూత్ పాదసేవార్థం తాంబూలం భోగసాధనమ్।
సువర్ణదండవ్యజనం విద్యుదాభే సుచామరే॥ 65

వైడూర్యస్తబకచ్ఛత్రం పాదుకే రత్నపీఠకే।
సర్వరాజోపచారాణి రాజచిహ్నాని యాని చ॥ 66

సర్వాణ్యభూద్రమాదేవీ దేవాయానన్తతేజసే।
భోగ్యవస్తుస్వరూపేణ తవ సేవాఽభిలాషిణీ॥ 67

మహానందాంబుధౌ మగ్నా రమతే సా రమా త్వయా।
రమసే రమయైవ త్వం వైకుంఠాదిషు ధామసు॥ 68

ప్రత్యేకావరణస్థైశ్చ మూర్తిభిర్బ్రహ్మపూర్వకైః ।
త్రిదశైర్దశదిక్పాలైః సేవితః పరమాసనే ॥ 69

శ్రీనివాస రమానాథ త్వన్నాభ్యబ్జే చతుర్ముఖమ్ ।
గిరీశమంతఃకరణే వ్యాంగేష్వింద్రాదిదేవతాః ॥ 70

ఋష్యాదీంశ్చ యథావత్త్వం సర్వజీవాంశ్చతుర్విధాన్ ।
సృష్ట్వా తేష్వంతరావిశ్య బహిః స్థిత్వాఽసి పాలకః ॥ 71

అత్యన్తభిన్నైస్తైః సర్వైః పృథక్ జీవజడాత్మకైః ।
పారతన్త్ర్యాదిదోషోజ్ఝః స్వాతన్త్ర్యాదిగుణోర్జితః ॥ 72

నిరపేక్షో నిత్యతృప్తః పూర్ణకామస్త్వమార్తిహృత్ ।
సత్యకృత్ సత్యసంకల్పో మాబ్రహ్మేశేన్ద్రవన్దితః ॥ 73

సర్వేషాం ప్రేరకస్త్వం హి ముక్తాముక్తనియామకః ।
అఘట్యఘటనే శక్తో హ్యగణ్యగుణమణ్డితః ॥ 74

అచిన్త్యాశ్చర్యచర్యస్త్వం బ్రహ్మాండాన్తర్బహిః స్థితః ।
అణోరణీయాన్ మహతో మహీయాన్ సర్వగోఽసమః ॥ 75

సర్వాధారః సర్వసాక్షీ సర్వాపేక్ష్యోఽతిసుందరః ।
సర్వోత్తమశ్చ సర్వజ్ఞః సర్వస్వామీ చ సర్వదః ॥ 76

సర్వశక్తోఽజ్ఞేయచర్యో వ్యక్తోఽవ్యక్తస్సనాతనః ।
శేషోఽశేషశ్చ నిర్లిప్తో బ్రహ్మణ్యః శాశ్వతః శుభః ॥ 77

చతుర్వర్గైస్సదా హీనః చతుర్ధర్మప్రదర్శకః ।
చతుఃపుమర్థదాతా చ చతుర్మోక్షప్రదః శ్రుతః ॥ 78

అధోక్షజోఽప్రాకృతస్త్వమనన్తమహిమా తవ ।
మూలరూపీ హ్యనన్తస్త్వమవతారాస్తథావిధాః ॥ 79

నామధేయాన్య (నామచర్యాణ్య) నంతాని
జ్ఞానానందాదయో గుణాః ।
అనన్తవేదవేద్యస్త్వం అవేద్యోఽనన్తసౌఖ్యదః ॥ 80

అహో భాగ్యమహో భాగ్యం రమేశ త్వత్పదాంబుజే ।
నివిష్టమనసాం సౌఖ్యమిహాముత్రాభివర్ధతే ॥ 81

తవ ప్రసాదలేశస్య లేశలేశాతిలేశతః ।
లవమాత్రం హియైస్తు లబ్ధం తైరలభ్యం న కించన ॥ 82

చరిత్రాణ్యతిచిత్రాణి మహాన్తి సుబహూన్యపి ।
తవ నానావతారేషు దర్శయస్యనువర్తినామ్ ॥ 83

కీటోఽపి త్వద్దయాలేశాత్ సామ్రాజ్యమనుభుక్తవాన్ ।
త్వత్పాదపద్మసంపర్క లేశలేశాతిలేశతః ॥ 84

దృషద్దివ్యాంగనాఽభూద్ధి చేతనానాం తు కిం బ్రువే ।
అత ఏవార్జునే సూతో బలేశ్చ ద్వారపోఽప్యభూః ॥ 85

ఇన్ద్రే త్వం దయయా చేలాం బలిం యాచితవానసి ।
గజేన్ద్రరక్షణే దూతాన్ ద్వారపాన్ వాఽప్యనాదిశన్ ॥ 86

అన్వధావః స్వయం శీఘ్రం క్షుద్రనక్రముముక్షయా ।
వైకుంఠం వా పరిత్యజ్య న భక్తాంస్త్యక్తుముత్సహే ॥ 87

మేఽతిప్రియా హి మద్భక్తా ఇతి సంకల్పవానసి ।
కామధేనుః కల్పవృక్షః చింతామణిరితి త్రయమ్ ॥ 88

వేంకటేశ త్వమేవాసి శేషాగే సర్వదానతః ।
దదాతి కామానన్నాదీన్ మణిర్ధేనుశ్చ పాదపః ॥ 89

న చాపవర్గం స్వర్గం వా తేషాం శక్తిశ్చ తాదృశీ ।
యది త్వం సుప్రసన్నోఽసి సర్వార్థాన్ సంప్రదాస్యసి ॥ 90

జాత్యన్ధానాం చ చక్షూంషి రాతి త్వన్మూర్తిదర్శనమ్।
బధిరాణాం చ శ్రోత్రాణి త్వత్కథాశ్రవణం పరమ్॥ 91

జడం మూకం చ వాచాలం కరోష్యధ్యయనాన్వితమ్।
మందబుద్ధిం ప్రాజ్ఞతమం సాంఖ్యయోగసమాధిగమ్॥ 92

అకరస్య కరౌ దత్త్వా కరోషి తవ పూజకమ్।
అపదస్య పదే దత్త్వా త్వత్తీర్థక్షేత్రగామినమ్॥ 93

యద్యద్దుఃఖం భవేద్భక్తే తత్తత్సద్యో హరిష్యసి।
కుబ్జత్వం కుష్ఠతాం నానారోగానప్యాభిచారికాన్॥ 94

హృత్వా దదాస్యంగదార్ఢ్యం సౌన్దర్యం త్వద్దయాఽద్భుతా।
శ్రీనివాస! బహూక్త్యా కిం భక్తసర్వార్తినాశనే॥ 95

సర్వార్థపూరణే చాపి త్వత్సమోఽన్యో న కుత్రచిత్।
ప్రసన్నో నీలమేఘస్త్వం శ్రీభూవిద్యుత్సమన్వితః॥ 96

హృద్వ్యోమగస్త్రితాపఘ్నో భక్తసర్వేష్టవార్షుకః।
అభీష్టాష్టమవారాశౌ నిమజ్యోన్మజ్జితం నిజమ్॥ 97

ఆనన్దాష్టమసుద్వీపే సంస్థాపయసి చాదరాత్।
సర్వసౌఖ్యమిహాముత్ర స్వర్మోక్షావానన్దవర్ధనః॥ 98

శ్రీ వేంకటేశ మాహాత్మ్యమునందలి 'భగవద్గుణ కథానువర్ణన'
మను ద్వితీయాధ్యాయము సమాప్తము.

# తృతీయాధ్యాయము

॥ అథ భగవతః నానావతారవర్ణన ప్రకారః ॥

దేవశర్మోవాచ –

అనన్తవేదసంవేద్య లక్ష్మీనాథాణ్డకారణ।
జ్ఞానానన్దైశ్వర్యపూర్ణ నమస్తే కరుణాకర॥ 1

నక్షత్రాణి చ గణ్యాన్తే పాంసవశ్చ తృణాదయః।
త్వద్వీర్యాణి న గణ్యన్తే బ్రహ్మణా రమయాఽపి వా॥ 2

తథాఽపి తే భక్తదాసదాసదాసో యథామతి।
స్తౌమి త్వాం వేంకటాధీశ త్వద్భక్తైః ప్రేరితస్త్వయా॥ 3

శ్రీవేంకటేశ మత్స్వామిన్ జ్ఞానానన్ద దయానిధే।
భక్తవత్సల భో విశ్వకుటుంబిన్మధునాఽవ మామ్॥ 4

సత్యేశం సత్యసంకల్పం సత్యం సత్యవ్రతం హరిమ్।
సత్యచర్యం సత్యయోనిం సత్యశీర్షమహం భజే॥ 5

శ్రవణాత్సర్వపాపఘ్నం మననాత్పుణ్యవర్ధనమ్।
స్వధ్యానాత్సిద్ధిదం విష్ణుం ప్రేక్షణాన్మోక్షదం భజే॥ 6

శ్రీవేంకటేశం లక్ష్మీశం అనిష్టఘ్నమభీష్టదమ్।
చతుర్ముఖేరతనయం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 7
(ద్వివారమ్)

యదపాంగలవేనైవ బ్రహ్మాద్యాః స్వపదం యయుః।
మహారాజాధిరాజానం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 8

అనంతవేదసంవేద్యం నిర్దోషం గుణసాగరమ్।
అతీన్ద్రియం నిత్యముక్తం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 9

స్మరణాత్సర్వపాపఘ్నం స్తవనాదిష్టవర్షిణమ్ ।
దర్శనాన్ముక్తిదం చేశం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 10

అశేషశయనం శేషశయనం శేషశాయినమ్ ।
శేషాద్రీశమశేషం చ శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 11

భక్తానుగ్రాహకం విష్ణుం సుశాన్తం గరుడధ్వజమ్ ।
ప్రసన్నవక్త్రనయనం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 12

భక్తభక్తిసుపాశేన బద్ధసత్పాదపంకజమ్ ।
సనకాదిధ్యానగమ్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 13

గంగాదితీర్థజనకపాదపద్మం సుతారకమ్ ।
శంఖచక్రాభయవరం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 14

సువర్ణముఖితీరస్థం సువర్ణేడ్యం సువర్ణదమ్ ।
సువర్ణాభం సువర్ణాంగం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 15

శ్రీవత్సవక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహమ్ ।
శ్రీమన్తం శ్రీనిధిం శ్రీద్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 16

వైకుంఠవాసం వైకుంఠత్యాగం వైకుంఠసోదరమ్ ।
వైకుంఠదం వికుంఠాజం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 17

వేదోద్ధారం మత్స్యరూపం స్వేచ్ఛాకారం యదృచ్ఛయా ।
సత్యవ్రతోద్ధరం సత్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 18

మహాగాధజలాధారం కచ్ఛపం మన్దరోద్ధరమ్ ।
సుందరాంగం చ గోవిన్దం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 19

వరం శ్వేతావరాహాఖ్యం సంహారం ధరణీధరమ్ ।
స్వదంష్ట్రాఖ్యాం ధరోద్ధారం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 20

ప్రహ్లాదాహ్లాదకం లక్ష్మీనృసింహం భక్తవత్సలమ్।
దైత్యమత్తేభదమనం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 21

వామనం వామనం పూర్ణకామం భామనమాణవమ్।
మాయినం బలిసంమోహం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 22

చంద్రాననం కున్దదన్తం కురాజఘ్నం కుఠారిణమ్।
సుకుమారం భృగుఋషేః శ్రీనివాసం భజేఽనిశమ్॥ 23

శ్రీరామం దశదిగ్వ్యాప్తం దశేన్ద్రియనియామకమ్।
దశాస్యఘ్నం దాశరథిం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 24

గోవర్ధనోద్ధరం బాలం వాసుదేవం యదూత్తమమ్।
దేవకీతనయం కృష్ణం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 25

నన్దనన్దనమానన్దం ఇన్ద్రనీలం నిరంజనమ్।
శ్రీయశోదాయశోదం చ శ్రీనివాసం భజేఽనిశమ్॥ 26

గోవృందావనగం బృన్దావనగం గోకులాధిపమ్।
ఉరుగాయం జగన్మోహం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 27

పారిజాతహరం పాపహరం గోపీమనోహరమ్।
గోపీవస్త్రహరం గోపం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 28

కంసాంతకం శంసనీయం సంశాంతం సంసృతిచ్ఛిదమ్।
సంశయచ్ఛేది సంవేద్యం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 29

కృష్ణాపతిం కృష్ణగురుం కృష్ణామిత్ర మభీష్టదమ్।
కృష్ణాత్మకం కృష్ణసఖం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 30

కృష్ణాఽహిమర్దనం గోపైః కృష్ణోపవన లోలుపమ్।
కృష్ణాతాతం మహోత్కృష్టం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 31

బుద్ధం సుబోధం దుర్బోధం బోధాత్మానం బుధప్రియమ్।
విబుధేశం బుధైర్బోధ్యం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 32

కల్కినం తురగారూఢం కలికల్మషనాశనమ్।
కల్యాణదం కలిఘ్నం చ శ్రీనివాసం భజేఽనిశమ్॥ 33

హరిం హంసం కృష్ణం నరహరి మనన్తం మధురిపుం
హృషీకేశం యజ్ఞం కపిలమృషభం వాజివదనమ్।
నరం వ్యాసం నారాయణమనఘమాత్మానమమృతం
దత్తం ధన్వన్తరిం పురుషమితరానూను మజితమ్॥ 34

అనంతరూపం స్వమనన్తచర్యం
అనన్తవేదై రనువర్ణనీయమ్।
అనంతనామానమనన్తదేవం (వేద్యం)
అనంతకల్యాణ గుణాభిరామమ్॥ 35

అనన్తశక్తీశమనన్తవిక్రమం
హ్యనన్తదేహే చ శయానమీశ్వరమ్।
అనన్తసౌభాగ్యమనన్తనేత్రకం
అనన్తపాదాదిమనన్తసౌఖ్యదమ్॥ 36

అసురాచలౌఘ హరచక్రధరం
దురితాచలౌఘ హరవజ్రధరమ్।
కరుణాచలౌఘభరచిత్త వరం
కనకాచలౌఘ ధరపద్మ కరమ్॥ 37

భువనేషు వేంకటేశ బహుపురుషార్థదాన నిపుణోఽసి।
నో చేద్వ్యక్తతయా త్వం బహూన్నతస్థానే కుతో వససి॥ 38

గుణౌఘైరపారం స్ఫురద్రత్నహారం
స్మరద్దోషహారం స్వభక్తేష్టపూరమ్।
భజే వేంకటేశం ఫణీశాద్రివాసం
సదా మందహాసం శ్రియా సద్విలాసమ్॥ 39

వేంకటేశ చరణే తవ వన్దే సర్వతీర్థశరణే శరణే మే।
మావిధీర శివవీశ ఫణీశేన్ద్రాగ్నిర్క సోమహుత భుజ్ముఖవన్ద్యే॥ 40

శ్రీనివాస చరణే తవ వన్దే లోకపావన సుకుంకుమవర్ణే।
శ్రీప్రదే కిల సురర్షి నరాణాం శ్రీఋుగాది నిగమాగమవేద్యే॥ 41

భజే భజకసౌఖ్యదం నిజకటాక్ష సంప్రేక్షణం
పరాత్ పరతరం ధరం దరమరిం గదామంబుజమ్।
చతుర్భుజమధోక్షజం కమలజేశ పూర్వార్చితం
వరోద్ధతఖలాన్ బహూన్ బహుజవేన సంహారిణమ్॥ 42

అజ్ఞాన సాగర సముత్తరణే ప్రశస్తం
సుజ్ఞాన సేతురచనే నిపుణం బుధేడ్యమ్।
లక్ష్మీపతిం సురవరార్చిత వేంకటేశం
దారిద్ర్య పూర్వదురితౌఘ నిశాచరఘ్నమ్॥ 43

లక్ష్మీనాథం కమలనయనం హారకేయూరభూషం
అణ్డవ్యాప్తం బహుగుణభరం దోషదూరం దయాబ్ధిమ్।
స్వానాం తాపత్రయహరమజం నిర్విశేషం విశేషం
లోకాతీతం పురుషమతులం భావయామీష్ట దేవమ్॥ 44

శ్రీమద్వేంకటనాథపాదజనితా గంగా జగత్పావనీ
యస్యాపాంగనిరీక్షణం విధిభవేన్ద్రాగ్న్యాదిసర్వేష్టదమ్।
యన్నామస్మరణం మహాఘహరణం స్వర్గ్యం చ మోక్షప్రదం
యత్పాదాంబుజయుగ్మసేవనరతో బ్రహ్మాదిభిః
పూజ్యతే॥ 45

సృ(దృ)ష్ట్యాద్యత్యన్తదూరం నిగమనిచయసంవేద్యమాహాత్మ్య
పూర్ణం
సర్వేషామాదిమిత్రం రవిశశినయనం పూర్ణకారుణ్యదేహమ్ ।
నిర్వాణం నిష్ప్రపంచం నిరవధికసమామ్నాయసంగైరసంగైః
గీర్వాణాద్యైరజస్రం స్తుతినతినియమైకాన్తభక్త్యాదిపూజ్యమ్ ॥ 46

కింకరశంకర బహుకరుణా తవ బహుచరితం చతుర్దశభువనేషు ।
జ్ఞాపయసి తవ భక్తవర్గేభ్యః ఫణిశుకపైలనారదప్రముఖైః ॥ 47

వేంకటేశమనుస్మృత్య య ఆస్తే
తస్య భూరి సుభగం దశదిశు ।
ఐహికం త్రిదివసౌఖ్యమతుల్యం
మోక్షమాశు లభతే గుణసామ్యమ్ ॥ 48

శ్రీనివాసమపహాతి మదాన్ధః
తస్య దుఃఖమసమం దశదిశు ।
ఐహికం నరకరౌరవకుంభీ-
పాకవహ్నిమహదన్ధతమాంసి ॥ 49

విపద్ఘ్నం శుభదోద్గారం భక్తానాం వశవర్తినమ్ ।
లోకపూజ్యం రమారామం భజేఽహం ప్రతిజన్మసు ॥ 50

భక్తౌఘానుగ్రహార్థాయ త్యక్త్వా వైకుణ్ఠముత్తమమ్ ।
ధరణ్యామవతీర్ణోఽసి వరేణ్యో వరదోఽర్చితః ॥ 51

అత్యల్పమాత్రం పరవస్తు లోకే
నైవాపహార్యం కిల సత్యసన్ధః ।
జనైరనేకైః బహుజన్మయత్నైః
ఆయాససాధ్యం బహుపాపసంచయమ్ ॥ 52

హారస్యశేషం స్మృతిమాత్రతస్త్వం
గోగోచరో దృష్టిపథాద్యగోచరః ।
విలక్షణం స్థావరజంగమాత్మకం
పశ్యే బహూపాయవిశారదం త్వామ్ ॥ 53

తవ రూపాణ్యనన్తాని చరిత్రాణి తథైవ చ ।
స్మరతాం భక్తిపూర్వం తు మహావిభవదాని చ ॥ 54

ఇహాముత్రాతుల్యసౌఖ్యప్రదాని మహతామపి ।
అల్పానాం కిము వక్తవ్యం స్వరూపోద్ధారకాణి చ ॥ 55

ప్రపద్యే పుణ్డరీకాక్షమీశం భక్తానుకంపినమ్ ।
లోకోత్తరం లోకనాథం పరాత్పరతరం విభుమ్ ॥ 56

పుణ్యాత్ త్వద్దయయా లబ్ధం విశేషాదకుతోభయమ్ ।
భగవంతం విశ్వవన్ద్యం భూతభవ్యభవత్ప్రభుమ్ ॥ 57

యతో భూతాని జాయన్తే యేన సర్వమిదం తతమ్ ।
యేన జాతాని జీవన్తి యం ప్రాప్స్యన్తి మహాలయే ॥ 58

దీపవిద్యుత్తారకాగ్ని చంద్రసూర్యాతిదీప్తిమాన్ ।
యోగాయోగైర్యోగ్యయోగైః దృశ్యోఽదృశ్యః శ్రుతోఽ
శ్రుతః ॥ 59

శ్రీ వేంకటేశ మాహాత్మ్యమునందలి 'నానావతారవర్ణన'
మను తృతీయాధ్యాయము సమాప్తము.



# చతుర్థాధ్యాయము

## ॥ అథ భగవతః విశ్వరూపాది వర్ణనమ్ ॥

దేవశర్మోవాచ —

శ్రీ వేంకటేశ! మత్స్వామిన్ ప్రణతార్తిప్రణాశన।
జ్ఞానానన్దదయాపూర్ణ! విజ్ఞాపనమిదం శృణు ॥ 1

యన్ముఖం బ్రహ్మజనకం యద్బాహూ క్షత్రకారణే।
యదూరుభ్యాం వైశ్యకులం పాదాభ్యాం సేవకోఽభవత్ ॥ 2

శిరసో ద్యౌరభూద్యస్య సహస్రాంశుశ్చ నేత్రజః।
ముఖాత్పురందరోఽగ్నిశ్చ దిగ్దేవాః శ్రోత్రతోఽభవన్ ॥ 3

శీతాంశుర్మనసో జాతః ప్రాణాద్వాయురజాయత।
అంతరిక్షం నాభితోఽభూత్ పద్భ్యాం భూమిరజాయత ॥ 4

యత్రోమలాంగైరభవన్ భువనాని చతుర్దశ।
రోమతే నాభికమలే బ్రహ్మాణ్డం బ్రహ్మాధిష్ఠితమ్ ॥ 5

శ్రియఃపతే కోఽపి జయేన్న మాయాం
యయా జనో ముహ్యతి వేదనార్థమ్।
తం నిర్జితాత్మానమనన్తమాయినం
మాయాపహం త్వాం శరణం ప్రపద్యే ॥ 6

నమోఽతర్క్యాయ తర్క్యాయ సగుణాయాగుణాయ చ।
నమోఽనన్తాయానన్తకాయ వేద్యావేద్యస్వరూపిణే ॥ 7

సిద్ధిప్రదస్త్వం కిల దేవవర్య త్వత్ప్రేరితోఽహం తవ పాదమాప్తః।
త్వత్పాదభక్తో బహిరన్తరాత్మన్ కిమస్తి విజ్ఞాప్యమశేషసాక్షిణః ॥ 8

సుఖం నృపాలాః సుర దేవముఖ్యాః
బ్రహ్మాదయస్తే పదపద్మసంశ్రితాః।
త్వత్కింకరాస్తేఽపి పృథక్ విభావితాః
కురుష్వ శం భో ఋషి దేవమిత్ర॥ 9

ఉత్పత్త్యధ్వన్యశరణ ఉరుక్లేశదుర్గాన్త కోగ్ర-
వ్యాళాక్రాన్తే విషయమృగతృష్ణాత్మగేహోరుభారః।
ద్వన్ద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞసార్థః
పాదౌ శస్తౌ శరణద కదా యామి కామోపసృష్టః॥ 10

భవాబ్ధితారం కటివర్తిహస్తం
స్వర్ణామ్బరం రత్న కిరీట కుణ్డలమ్।
ఆలమ్బిసూత్రోత్తమమాల్య భూషితం
నమామ్యహం వేంకటశైలనాయకమ్॥ 11

జామ్బూనదాభం గుణిభిర్వరేణ్యం
వక్షఃస్థలే దక్షకుచోర్ధ్వభాగే।
శ్రీవత్సలక్ష్మాంకిత దివ్యరూపం
శ్రీ వేంకటాధీశమహం ప్రపద్యే॥ 12

సంస్థితం సువిమానాన్తర్విరించాద్యైశ్చ సేవితమ్।
చామరైర్వ్యజనైశ్ఛత్త్రైః శరదిన్దుముఖం భజే॥ 13

భక్తానుకంపీ గరుడధ్వజస్తత్-
స్కన్ధం సమారుహ్య కిరీటకుణ్డలీ।
పీతామ్బరశ్చారు సుమన్దహాసః
శ్రీ కౌస్తుభశ్చక్ర వరాఽభయాంకితః॥ 14

సజయో విజయశ్చైవ దృశ్యోఽదృశ్యః శ్రుతోఽశ్రుతః।
సంభాషణోఽభాషణశ్చ వాచ్యోఽవాచ్యో వృషోఽవృషః॥ 15

త్వత్పాద పద్మయుగళం శ్రేయోనిస్సక్త మానసాః।
విసృజ్యోభయతః సంగం బ్రహ్మవిద్యాస్సముపాసతే॥ 16

మాహాత్మ్యం కేన సందృశ్యం
రమాయా రమణస్య తే।
యత్కించిత్ ద్రష్టుమిచ్ఛామి
మాయినోఽమాయినశ్శుభమ్॥ 17

సర్వప్రాణి హృదావాసం వాసుదేవం జగద్ధితమ్।
శరణ్యాగ్రం దేవదేవం ప్రధానపురుషం భజే॥ 18

నమోఽవ్యక్తాయ సూక్ష్మాయ పరాత్పరతరాయ చ।
జగత్కారణకర్త్రే చ సాక్షిణేఽక్షయమూర్తయే॥ 19

నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయ చ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ యోగిహృత్పద్మవాసినే॥ 20

పంచభూతవిసృష్టాయ పంచమాత్రాత్మకాయ చ।
జ్ఞానకర్మేంద్రియేశాయ హృషీకేశాయ తే నమః॥ 21

విష్ణవే వైష్ణవేశాయ జిష్ణవే జయదాయినే।
ఇష్టప్రదాయ చేష్టాయ కృష్ణాయోత్కృష్టకర్మణే॥ 22

క్షరాక్షరోత్తమాయాథ స్వక్షరేశాక్షరాయ చ।
కుక్షిస్థపక్షిసంఘాయ క్షయాక్షయకరాయ తే॥ 23

నమో భవాయ భావాయ ధీరాయ పరమేష్ఠినే।
వీరాయ వీరవపుషే ఋషయే పరమాత్మనే॥ 24

నమో నారాయణాయాథ సాధారణధరాయ చ।
నమః సమర్హణార్హాయ ధరణీధరరూపిణే॥ 25

అర్చ్యార్చ్యాయాచ్యుతాయాపి వన్ద్యావన్ద్యపదాయ చ।
హిరణ్యగర్భగర్భాయ నమః శివశివాయ చ॥ 26

స్కన్దాయ శిపివిష్టాయ సచ్చిదానన్దరూపిణే।
కర్మజ్ఞాననిరూప్యాయ శ్రుతిస్మృత్యాలయాయ తే॥ 27

యమాయ నియమాయాథ దానవ్రతకరాయ చ।
తపస్వినే చ తపస్యాయ తాపత్రయహరాయ చ॥ 28

యజ్ఞాయ విశ్వాయ సుమంగళాయ
సుతీర్థపాదాయ సుతారకాయ।
ప్రపన్నలోకానుగుణాయ శమ్భవే
శుద్ధాయ శశ్వద్గుణవర్ష్మణే నమః॥ 29

కర్మిణేఽకర్మలిప్తాయ జ్ఞానాయ జ్ఞానదాయినే।
నిత్యముక్తాయ హరయే నిత్యముక్తిప్రదాయినే॥ 30

శుద్ధం వపుః పరమయోగమతుల్యసౌఖ్యం
భూమిం ద్యులోకముత తత్త్వమతిం సుభక్తిమ్।
వైరాగ్యమన్యసుగుణాన్ భజకేషు దావ-
శీలం దయోదయమహం శరణం ప్రపద్యే॥ 31

సులభం దుర్లభం వన్దే భగవన్తం సనాతనమ్।
సదసత్ క్షేత్రగం విష్ణుం మూర్తామూర్తం శుభాశుభమ్॥ 32

గోవిన్దం గోగణాతీతం కల్మషఘ్నమకల్మషమ్।
ప్రతికల్పేఽకల్పకల్పతరుం సర్వార్థకల్పకమ్॥ 33

దుష్టభావః ప్రమత్తో వా నామాద్యుచ్చారకో హి యః।
బ్రహ్మహత్యాదిపాపాని దహత్యేవ న చాన్యథా॥ 34

అజ్ఞానా దథవా ధమ్మాత్ పుణ్యశ్లోకస్య నామ తే।
యో వదేత్ తాని నశ్యన్తి తూలరాశి ర్యథాఽనలాత్॥ 35

క్షుధితో దుఃఖితః శ్రాన్తః త్వన్నామ యది సంస్మరేత్।
తస్య దుఃఖాని సర్వాణి నశ్యన్తి క్షణమాత్రతః॥ 36

సర్వాణ్యశుభజాతాని దురితౌఘాని యాని చ।
తాని సర్వాణి లభతే మత్తస్త్వాం విస్మృతో యది॥ 37

న తీర్థయాత్రా న చ దానయజ్ఞా
వ్రతం తపో నార్చనమన్యదైవమ్।
యత్ శ్రీనివాసస్య చ నామకీర్తనం
తదేవ సర్వార్థసువృష్టి కారణమ్॥ 38

యాత్రా యజ్ఞా వ్రతా ధర్మా దానాన్యన్యా న్యసంఖ్యయా।
తవనామస్మృతే ర్భక్త్యా కలాం నార్హన్తి షోడశీమ్॥ 39

అహో భాగ్య మహో భాగ్యం విష్ణునామానువర్తినామ్।
తేషాం దూరో యామ్యలోకః స్వర్గో మోక్షశ్చ తత్ఫలమ్॥ 40

మాహాత్మ్యం విష్ణునామ్నో హి వర్ణితుం కేన శక్యతే।
అజామిళో మృత్యుపాశాత్ ముక్తో వైకుంఠగో యతః॥ 41

అయమేవ మహాధర్మో నరాణాం తారకః స్మృతః।
విష్ణౌ సదా భక్తియోగః తన్నామగ్రహణాదిభిః॥ 42

నైకోఽజామిళ ఏవ పాపజలధిం సన్తీర్ణవాన్ నామతః
ప్రహ్లాదోఽపి గజేన్ద్రపూర్వబహవో దుఃఖామ్బుధేస్తారితాః।
యన్నామ స్మరణాఽమృతాంబుధినిమగ్నో ఽద్యాపి గౌరీపతిః
యద్ధ్యానే నిరతాః ప్రజాపతిముఖాః ప్రాప్తామహావైభవమ్॥43

యన్నామ తే సర్వజగద్ధురన్త
దుష్కర్మశైలాంశ్చ బహూన్ భినత్తి।
స సర్వశక్తే స హి విశ్వరూప
ప్రసీద మామనిరుక్తాత్మశక్తే॥ 44

అనుగ్రహార్థం భజతాం పదాబ్జం
అనామరూపస్త్వ గుణో హ్యజన్మా।
నామాని రూపాణి గుణాన్ క్రియాశ్చ
జన్మాని గృహ్ణాసి స మాం ప్రసీద॥ 45

జన్మాదిభిర్జనే మోహోనుగ్రహోవధికారతః।
కరోషి సామ్ప్రతం భూయోఽనుగ్రహస్తు భవేన్మయి॥ 46

దయాపాంగలవో భూయాదిహోఽముత్రేష్ట వర్షణః।
అన్యథా నాత్ర సన్దేహ ఇతి చిత్తే సునిశ్చితమ్॥ 47

ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే।
మహానుభావాయ మహామాయినేఽమేయ కర్మణే॥ 48

నామ్నైవ భావ్యం ఖలు సర్వరక్షణం
మాయావినో విశ్వకుటుంబినస్తే।
స్థలేషు దుర్గేషు జలేషు ఖేషు
గర్భేష్వరణ్యేషు చ కైతవేషు॥ 49

మహావిపత్సు త్వన్నామస్మరణే తద్వినాశనమ్।
బహుసంపత్సు తే నామవిస్మృతౌ తద్వినాశనమ్॥ 50

తస్మాత్త్వన్నామసక్తోఽహం సర్వదా త్వదనుగ్రహాత్।
త్వత్ప్రేరిత స్త్వదీయత్వాత్ మత్పుణ్యాం త్వద్దయాబలాత్॥ 51

న కదాచిద్భయం మేఽస్తి దివ్యనామరతో యతః।
తథాఽపి తే కృపాఽపాంగలేశలేశోఽస్తు మయ్యహో॥ 52

శ్రీశ! చిత్రం చరిత్రం తే న జానే బహుదుష్కృతిః।
సర్వజ్ఞ మే కదా కిం వా వదే త్వాం కృపయాఽవ మామ్॥ 53

నామ్నా మహాఘౌఘహాని స్తేన దేహాహృదోః శుచిః।
తం దృష్ట్వా ప్రియసే విష్ణో తతః సత్కర్మసంగ్రహః॥ 54

కర్మణా జ్ఞానసిద్ధిశ్చ తేన ప్రీతిస్త్వదుద్భృతా।
అపరోక్షమగర్భశ్చ ముక్తిరానన్ద వర్ధనమ్॥ 55

గోదాన కన్యాదానాది పృథివీ రేణుసంఖ్యయా।
దుర్భిక్షే జాహ్నవీతీరే ప్రత్యహం కోటిభోజనమ్॥ 56

త్వన్నామస్మరణే తుల్యం నామమాహాత్మ్యమీదృశమ్।
తస్మాన్నామస్మృతిః శుద్ధా సులభా పురుషార్థదా॥ 57

లోకోత్తరస్త్వయం మార్గః ప్రజానామకుతోభయః।
యత్ర భక్తివశాద్విష్ణోః నామస్మృతిపరాయణాః॥ 58

యేనైకదా విష్ణుపదాబ్జయుగ్మే
సమర్పితం చిత్తమనన్యబుద్ధ్యా।
యమోఽపి తద్దూతగణాస్సపాశాః
పశ్యన్త్యఘౌఘాశ్రయమప్యహో న హి॥ 59

శ్రీ వేంకటేశ మాహాత్మ్యమునందలి "భగవద్గుణనామ మహిమా వర్ణన"
మను చతుర్థాధ్యాయము సమాప్తము

— —

## పంచమాధ్యాయము

॥ అథ దేవశర్మాణం ప్రతి స్తుతిప్రసన్న శ్రీనివాసకృత వరప్రదానాది వర్ణనమ్॥

దేవశర్మోవాచ —

సర్వలోక జననీ కమలా యా
దేశకాలవితతా రమణీ తే।
సాఽతిమృద్వ్రతసికాకుసుమాభో-
త్సంగగాఽపి తవ హృత్కమలస్థా॥

బ్రహ్మ శంకర పదార్పణదక్షా
సర్వలోకసుఖదార్ద్రవచిత్తా ।

యత్కటాక్షలవమాత్ర పదస్థాః
ప్రార్థయన్త్యజ శివేన్ద్రముఖా హి ॥ 2

భారతీప్రముఖసున్దరయోషిద్ –
గణమతీతబహుసున్దరరూపామ్ ।

ఆలిలింగసి చతుష్కరపద్మైః
మన్దహాసవదనాం సరసార్థమ్ ॥ 3

నిత్యముక్తా దోషదూరా త్వదూనాధికసద్గుణా ।
త్వత్పాదపూజనే నిత్యం బద్ధకంకణభూషితా ॥ 4

అభీష్టదానే భక్తానాం కల్పవృక్షాయితా రమా ।
చిన్తామణికామధేనుకరుణాసాగరాయితా ॥ 5

లక్ష్మీః పురస్తాత్పశ్చాచ్చ దక్షిణోత్తరతశ్చ యా ।
ఊర్ధ్వాధరాదిభాగస్థా జగత్సృజతి పాతి హి ॥ 6

గుణైస్తతా ప్రసవితృవరణీయగుణోర్జితా ।
ప్రకాశమతిమూర్తిశ్చ ధ్యేయా బుద్ధిప్రచోదికా ॥ 7

దురన్నాద్ దుర్గ్రిహాత్వాచ్చ పాతకాదుపపాతకాత్ ।
స్వగాయకత్రాణదక్షా గాయత్రీత్యుదితా రమా ॥ 8

సవితుర్ద్యోతకత్వాచ్చ భక్తేష్టప్రసవే రతా ।
చరాచరప్రసవితా సావిత్రీ కమలా స్మృతా ॥ 9

వాగీశత్వాత్ వచోదానాత్ కీర్తితా చ సరస్వతీ ।
కాన్తిరత్యాది దానాత్ సా భారతీత్యాదినామికా ॥ 10

గుణపూర్ణత్వ యోగేన బ్రహ్మ బ్రహ్మవశే స్థితా ।
బ్రహ్మాణ్డాన్తర్బహిర్వ్యాప్తా స్థూలా సూక్ష్మా చ మధ్యమా ॥ 11

కర్మణాం గుణరూపాణాం సర్వేషాం చ నియామికా ।
యద్దయాపాంగలేశేన త్వైహికీః సర్వసంపదః ॥ 12

స్వర్వైర క్తీశ సద్భక్తి జ్ఞప్తి ముక్తిర్వ్రిజన్ని హి।
లోకాతీతా లోకపూజ్యా తవాత్యన్తప్రియా మతా॥ 13

సర్వశక్తా సర్వసుఖా సర్వలక్షణ సంయుతా।
అనేకగుణసంపూర్ణా పూర్ణకామా చ సర్వదా॥ 14

అప్రమేయ ప్రమేయాఽపి సమస్త పురుషార్థదా।
మహైశ్వర్య సౌభాగ్యా తథాఽపి త్వాఽనువర్తినీ॥ 15

స్మరతి ధ్యాయతి స్తౌతి నమత్యర్చతి పశ్యతి।
తపతి త్వాం జపతి చ సేవతే త్వాం ప్రతీక్షతే॥ 16

నిత్యాఽవియోగినీ నమ్రా సంప్రార్థయతి సర్వదా।
కిముతాఽన్యేఽల్పజీవాశ్చ మాదృశా వృత్తివర్జితాః॥ 17

దరిద్రా బంధురహితా అనాథా జీవనార్థినః।
తేషాం త్వత్ప్రార్థనాకాంక్షా నాశ్చర్యం భువనత్రయే॥ 18

శ్రీ వేంకటేశ! మత్స్వామిన్! జ్ఞానానన్దదయానిధే।
శరణాగతసన్త్రాణ వరణాభీష్టవర్షణ॥ 19

శ్రీశ తే రూపకర్మాణి బ్రహ్మరుద్రాహిపాదిభిః।
అగణ్యాని హ్యవేద్యాని హ్యచిన్త్యాత్యద్భుతాని చ॥ 20

ఏవం పూర్ణే త్వన్మహిమ్ని నాఽహం శక్తోఽస్మి వర్ణనే।
కశ్చాహం కా చ మే శక్తిః కిమితి స్తౌమి మన్దధీః॥ 21

అలసోఽహమహంకారీ చాజ్ఞో మూర్ఖః శఠః ఖలః।
జ్ఞానశక్త్యాదిహీనశ్చ కామక్రోధాదిపూరితః॥ 22

మనోజయాదిహీనశ్చ సదా విషయలమ్పటః।
పాంసూనాం వృష్టిబిన్దూనాం మద్దోషాణాం మితిర్న హి॥ 23

గుణాస్త్వయి యథా పూర్ణాః దోషాః పూర్ణాస్తథా మయి।
అసత్త్వాదహంకారాత్ అజ్ఞానాల్లోభతో మయా॥ 24

దమ్భాత్ప్రమాదాద్ దాక్షిణ్యాత్
స్వభావాత్ సంగతః కృతాన్।
అపారానపరాధాన్ మే
హ్యగణేయాన్ క్షమస్వ మాం॥ 25

**పితా మాతా గురుర్భ్రాతా సఖా బన్ధుస్త్వమేవ మే।**
**విద్యా సత్కర్మ విత్తం చ పురః పృష్ఠే చ పార్శ్వయోః॥ 26**

మూర్ధ్ని హృత్కమలే మేఽన్తర్బహిర్జన్మని జన్మని।
కులస్వామీష్టదేవో నో వృతః పితృపితామహైః॥ 27

సర్వం త్వమేవ లక్ష్మీశ న జానే త్వాం వినా పరమ్।
దుస్స్మృతిం హర దూరాన్మే విస్మృతిం తే విలోపయ॥ 28

త్వత్స్మృతిం సంప్రదేహ్యాద్య త్వత్సమో నాస్తి మే ప్రియః।
త్వన్మనా స్త్వద్గత ప్రాణః త్వత్పాదాంబుజ సంశ్రితః॥ 29

తవ భక్తోఽస్మి దాసోఽస్మి శిష్యః పుత్రోఽస్మి కేవలమ్।
భర్తా త్వమేవ విశ్వస్య స్మరామి త్వామహర్నిశమ్॥ 30

శ్రీహరి ర్మమ హృత్పద్మ కర్ణికాస్థోఽతి సున్దరః।
పద్మాసన సమాసీన ఇన్ద్రనీల సమద్యుతిః॥ 31

కంజకోమల పాదాబ్జః కుంకుమాధిక వర్ణవాన్।
వజ్రాంకుశ ధ్వజాబ్జాంక పాదాబ్జ నఖరక్తవాన్॥ 32

క్వణన్నూపురసన్నాద వలయాఢ్య పదాంబుజః।
అతసీపుష్పసంకాశ తేజఃపుంజోరురంజితః॥ 33

నితంబే పీతవసన స్వర్ణకాంచ్యం చితోఽచ్యుతః।
విరించాధారసౌవర్ణ గంభీరాబ్జాభ నాభికః॥ 34

బ్రహ్మాండగూహకమృదు శ్లక్ష్ణరేఖాత్రయోదరః।
ధర్మస్తనోఽధర్మపృష్ఠః శ్లక్ష్ణసూక్ష్మతనూరుహః॥ 35

శ్రీవత్సాంకః కౌస్తుభాది వైజయన్తీహృదంబుజః।
ఉన్నతాంసో జానులంబి బాహ్వాభీతివరప్రదః॥ 33

కుంకుమాంకే కరతలే శంఖ చక్ర సులక్షణః।
కింకిణీకంకణలసద్వలయాంగద భూషితః॥ 37

కంబుగ్రీవః సుబింబోష్ఠః కుందకుడ్మలదన్తవాన్।
ఆదర్శవద్ దృశ్యసూక్ష్మ గణ్డయుగ్మసుమండితః॥ 38

సునాసోఽనిమిషః సుభ్రూః కరుణాపూర్ణలోచనః ।
శరత్పూర్ణేన్దువదనో నతనీలసుకున్తలః ॥ 39

అతుల్యతిలకోపేతో రత్నకుండలమణ్డితః ।
స్ఫురద్రత్నకిరీటీ చ సర్వలక్షణ సంయుతః ॥ 40

జగద్విలక్షణః శ్రీమాన్ మద్బింబో నిత్యచిత్సుఖః ।
సూర్యకోటిప్రతీకాశః చంద్రకోటిసుశీతలః ॥ 41

అనన్తవేదైర్బ్రహ్మాద్యైః అవేద్యోఽప్రాకృతో హరిః ।
శ్రీధరాభ్యాం సమాశ్లిష్టో బ్రహ్మరుద్రేన్ద్రై సేవితః ॥ 42

పూర్ణానన్దజ్ఞానదయామూర్తిః పరమమంగలః ।
మంగళాంగో మంగళాఙ్కో భక్తమంగళదాయకః ॥ 43

కరుణామృతపూర్ణాభ్యాం లోచనాభ్యాం సమీక్షతే ।
కా చిన్తా మ ఇహాముత్ర సర్వారిష్టం హరత్యసౌ ॥ 44

త్వత్పాదాంబుజవిశ్వాసః సర్వాభీష్టం దదాతి హి ।
ఇతి స్మరన్నహోరాత్రం త్వామహం శరణం గతః ॥ 45

భో స్వామిన్ పూర్ణకామస్త్వం సంపూర్ణైశ్వర్యవానపి ।
స్వప్రయోజనహీనోఽపి మాయయా బహురూపవాన్ ॥ 46

లోకోపకరణాయైవ త్వితరాఽసాధ్యకృత్యవాన్ ।
బహ్వాద్రిధారణం సేతో రనాయాసేన కల్పనమ్ ॥ 47

బ్రహ్మాండమద్భుతం స్థూలం క్షణేనోత్పాదితం త్వయా ।
వహసి త్వముపాయేన బహుసూక్ష్మమృదూదరే ॥ 48

ఏవం మహాభారవహస్య విశ్వ -
కుటుంబినః కరుణాపూర్ణసింధోః ।
మమ త్వదీయస్య సుసూక్ష్మలేశ
లవాత్మకస్యోద్ధరణం కియత్ తే ॥ 49

శ్రీవేంకటేశ మత్స్వామిన్ జ్ఞానానందదయానిధే ।
దుఃఖసాగరమగ్నం మాం స్వీయం నోద్ధరసే కుతః ॥ 50

శ్రీనివాస కృపాపూర్ణ భక్తపోషణ దీక్షిత।
సంసారారణ్యపతితం దయయా నేతుసే కుతః॥ 51

భక్తబన్ధో దయాసిన్ధో త్వత్పాదాబ్జే నమామ్యహమ్।
సూక్తాసూక్తమిదం సర్వమపరాధం క్షమస్వ మే॥ 52

వరం వరద మే దేహి భక్తిం త్వత్పాదయోః స్మృతిమ్।
సదా నామార్థ విజ్ఞానం దేహీహాఽముత్ర సౌఖ్యదమ్॥ 53

శ్రీస్వామితీర్థ దుగ్ధాబ్ధౌ శ్వేతద్వీపే సుమండపే।
శ్రీభూభ్యాం విహరన్ విష్ణో ముక్తిం భక్తాయ దేహి మే॥ 54

శ్రీ సూత ఉవాచ —

ఇత్థం స్తుత్వా వేంకటేశం రమేశం
తూష్ణీం భూతో దేవశర్మా సుభక్తః।
భక్తేభ్యోఽభీష్టార్థవర్ష ప్రబుద్ధం
సాష్టాంగం తం ప్రాణమత్స్వేష్టదేవమ్॥ 55

అథ స్తోత్రేణ సంతుష్టః శ్రీనివాసః సతాం గతిః।
మేఘగంభీరయా వాచా వరదాన మథాబ్రవీత్॥ 56

శ్రీ భగవానువాచ —

'ప్రీతోఽహం తే ద్విజశ్రేష్ఠ! మదుపాసనకర్మణా।
మహదైశ్వర్యసంసిద్ధికారణం స్తోత్రముత్తమమ్॥ 57

కృతవానసి తస్మాత్ త్వం మాభైష్టాత్ర పరత్ర హి।
మత్ప్రియప్రాణశిష్యస్య గురుపాదావలంబినః॥ 58

విపన్నాశస్సంపదాప్తిః భూయాత్ తే మదనుగ్రహాత్।
మమ భక్తస్య తే గేహే స్వర్ణవృష్టిర్దినే దినే॥ 59

అయుతాయుశ్చ తే దత్తం పుత్రపౌత్రాస్త్వదాయుషః।
శతపూరుషపర్యంతం భుక్త్వా భోగానసేకశః॥ 60

తతో మత్పదమాప్స్యసి' ఇత్యుక్త్వా తూష్ణీం బభూవ హ॥ 61

శ్రీ సూత ఉవాచ —

భోః శౌనకాద్యా మునయో నిస్సంగాశ్చ తపస్వినః।
భక్తవశ్యో వేంకటేశః ప్రసన్నో భవతి ధ్రువమ్॥ 62

యూయం గత్వా వేంకటేశం రమేశం
నత్వా స్తుత్వా వేదవేద్యం సుభక్త్యా।
భక్తేభ్యోఽభీష్టార్థవర్ష ప్రబుద్ధం
సంప్రీణీధ్వం తేన వోఽభీష్టసిద్ధిః॥ 63

శ్రీవేంకటేశస్య కథామృతం త్విదం
మాహాత్మ్యసారం సుతపస్విగమ్యమ్।
శ్రీవేంకటేశస్య మహాప్రియప్రియం
లోకోత్తరం దేవఋషిప్రియం చ॥ 64

సమస్త పాపౌఘ వినాశకారణం
సమస్త పుణ్యౌఘ సమృద్ధికారణమ్।
శ్రీవేంకటేశస్య పదారవిన్దయోః
సద్భక్తివృద్ధావసమాన కారణమ్॥ 65

వక్తుః శ్రోతుః పాఠకస్య పారాయణపరస్య చ।
పరాత్పరో వేంకటేశః ప్రసన్నో భవతి క్షణాత్॥ 66

స్తోత్రేణైవ హి సంతుష్టో వేంకటేశో రమాపతిః।
యాన్ యాన్ కామాన్ కామయంతే తాంస్తాన్
ముక్తిం దదాతి చ॥ 67

శ్రీ వేంకటేశ మాహాత్మ్యము నందలి 'సకలాభీష్ట వరప్రదాన మహిమా వర్ణన' మను పంచమాధ్యాయము సమాప్తము.

సమాప్తము

శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్।
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥
శ్రీ వేంకటాద్రినిలయః కమలాకాముకః పుమాన్।
అభంగుర విభూతిర్నస్తరంగయతు మంగళమ్॥

॥ శ్రీకృష్ణార్పణమస్తు ॥

శ్రీః

శ్రీమత్ ఆదిత్యపురాణాంతర్గత

# శ్రీ వేంకటేశ మాహాత్మ్యమ్

శ్రీశ్రీనివాస పరబ్రహ్మణే నమః । శ్రియై పద్మావత్యై నమః ।
శ్రీమతే వాయుదేవాయ నమః ।

శ్రీవేంకటలసచ్ఛైలవాసీ దాసీకృతామరః ।
ఛాయయా పాతు మాం నిత్యం శ్రీనివాస సురద్రుమః ॥
జయతి శ్రీరమాకాంతః జయతి శ్రీశ్చ తత్ప్రియా ।
శ్రీ శ్రీశభక్తో జయతి మధ్వో విధ్వస్త సాధ్వసః ॥
కరోతు మమ కల్యాణం హరిర్హయముఖాభిధః ।
గురుశ్చ మధ్వనామా మే వరదోఽస్తు నిరంతరమ్ ॥
నమస్తేగుణపూర్ణాయ దోషదూరాయ విష్ణవే ।
నమస్తే ప్రాణనాథాయ భక్తాభీష్ట ప్రదాయినే ॥



శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

అర్థము :— లక్ష్మీదేవికి ప్రియుడును, మంగళకరములైన గుణములకు ఆశ్రయుడును, ప్రార్థించువారికి ఇష్టార్థముల నిచ్చువాడును, శ్రీవేంకటగిరిపై వెలసిన (నివాసమేర్పరచు కొన్నవాడునగు) శ్రీ శ్రీనివాసునకు మంగళము.

విశేషార్థము :— (1) కాంతాయ = కస్య అంతః, యస్మాత్ = బ్రహ్మాదుల సుఖస్వరూపమును నిర్ణయించువాడు; (2) దైత్యాదుల సుఖమును అంతః = నాశము చేయువాడు; (3) కే అంతతీతి కాంతః = సముద్రములో సేతువును కట్టించినవాడు; (4) నిధీయతే హృది సజ్జనైరితి నిధిః = సజ్జనులచే హృదయమున ధరింపదగినవాడు.

శ్రీవేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసమ్ ।
శ్రితచేతనమందారం శ్రీనివాసమహం భజే ॥

అ:— శ్రీ వేంకటాద్రికి ప్రభువును, శ్రీదేవిని వక్షఃస్థలమున ధరించిన వాడును, ఆశ్రితజనులకు కల్పవృక్షమువంటివాడునగు శ్రీనివాసుని నేనెల్లప్పుడు సేవింతును.

విశేషార్థము:—

(1) గ్రంథము నిర్విఘ్నముగా సమాప్తినొందుటకు, ప్రసిద్ధి కలుగుటకు గ్రంథాదిలో ఇష్టదేవతా నమస్కార రూపమగు మంగళము అవశ్య కర్తవ్య మగుటంజేసి సాక్షాన్నారాయణావతారులును, పురాణకర్తయునగు శ్రీ వేదవ్యాస మహర్షులు తాను విఘ్నలేశమైనను లేని వారయ్యు. లోకమునందలి జనులు గ్రంథాదిలో మంగళమును తప్పక చేయవలెనని బోధించుటకై నమస్కారరూప మగు మంగళమును చేసియున్నారు.

(2) సకల వాఙ్మనస్సుల కధిదేవతయగు లక్ష్మీదేవికి నమ స్కరించుట అవశ్యకర్తవ్యమయినను 'క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసాం' అను ప్రమాణముచే ప్రత్యేక నమస్కారము దుఃఖదాయకమగుటం జేసి 'శ్రియఃకాంతాయ' అని లక్ష్మీదేవీ సహితముగా శ్రీమన్నారాయణుని నమ స్కరించి యున్నారు.

(3) 'యం యం యథోపాసతే తత్తదైవ భవతి' అన్నట్లు మంగళమును ప్రార్థించుటవలన సకలానిష్టముల నివృత్తి కలిగి ఇష్టప్రాప్తి రూపమగు మంగళము లభించునని చెప్పబడినది.

# ప్రథమాధ్యాయః

॥ అథ శౌనకాదీన్ ప్రతి సూతప్రోక్త శ్రీ శ్రీనివాస వైభవః ॥

అవ:— ఇక శౌనకాదిఋషులనుగురించి శ్రీ సూతపౌరాణికులు చెప్పిన శ్రీ శ్రీనివాసుని వైభవము నిరూపింపబడుచున్నది.

యది విద్యాచ్చతుర్వేదాన్ సాంగోపనిషదాన్ ద్విజః।
నచేత్పురాణం సంవిద్యాన్నైవ స స్యాద్విచక్షణః॥

అన్నట్లు ఋగాది సకల వేదములు, షడంగ సహితములగు ఉపనిషత్తులు, శాస్త్రములు వీనినన్నింటిని బాగుగా నెరింగియున్నను, పురాణములను బాగుగా నెరుంగకున్నచో అతడు పండితుడు కాజాలడు. అందుచే పురాణముల నవశ్యముగ తెలిసికొనవలెను.

హరిః ఓం। శ్రీ శౌనకాదయ ఊచుః

శ్రీ వేంకటేశమాహాత్మ్యం శ్రీనివాసప్రసాదతః ।
శ్రీప్రదం సర్వదా సూత దయయా ప్రోక్తవానసి ॥ 1

అ:— శ్రీ పరమాత్మతత్త్వవిషయకమైనట్టి జ్ఞానార్జనయందే నిరతులైన, అపరోక్షజ్ఞానులైన శ్రీ శౌనకాది మునులు ఒకానొకప్పుడు నైమిశారణ్యమునందు యాగాదులను చేయించు వారలై—

మంత్రమధ్యే క్రియామధ్యే విష్ణోః స్మరణపూర్వకమ్ ।
మంత్రతస్తంత్రతః ఛిద్రం దేశకాలార్హవస్తునః ॥
సర్వం కరోతు నిచ్ఛిద్రమనుసంకీర్తనం తవ ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్ ।

మంత్రతంత్రాదులను ఆచరించుటలో కలుగు లోపదోషములను, మధ్య మధ్య శ్రీ విష్ణుస్మరణ మాత్రముచే పోగొట్టుకొని, మంత్ర క్రియాదులను

సంపూర్ణముగా సాధించవచ్చును - అనుగ్రమాణము ననుసరించి అన్ని కొరతలను పోగొట్టునదియు, సకలపాపంబులను హరించునదియు, సర్వపుణ్యదాయకమును అగు శ్రీ వేంకటేశ మాహాత్మ్యమును వినవలెనని ఉత్సుకులైరి వారి సమక్షము నందే యున్నవాడును, సాక్షాన్నారాయణావతారుడగు శ్రీ వేదవ్యాసుల పర మానుగ్రహమునకు పాత్రుడును ఐన శ్రీ సూతమునిని తమ జ్ఞానాభివృద్ధికొరకు, లోక క్షేమముకొరకు ప్రశ్నించుచున్నారు.

పౌరాణికోత్తముడవైనసూతా! శ్రీశ్రీనివాసుని యనుగ్రహముచే వందరికిని మంగళకరమైనదియు, ముఖ్యముగా ఉత్తమ భక్తులకు ఋగ్యజుస్సామాథర్వణాది సకలవిద్యారూపమగు సకలసంపత్తులనొసంగుటద్వారా మోక్షదాయకమైనదియు, మధ్యమభక్తులకు ఆయురారోగ్య పుత్రమిత్రసామ్రాజ్యాది సకల భోగముల ప్రసాదించు నట్టిదియు నగు శ్రీ వేంకటేశ మాహాత్మ్యమును మాకిదివరకే చెప్పియున్నాడవు.

విశేషార్థము :—

(1) సూతః— 'షూఙ్ ప్రాణిప్రసవే' యను ధాతువునుండి పుట్టినదీ శబ్దము. 'పున్నామ్నో నరకాత్ త్రాతా పుత్ర ఇత్యభిధీయతే' అను వ్యుత్పత్తిమేరకు "పుత్" అనబడు నరకమునుండి రక్షించునట్టి జ్ఞాన భక్తి వైరాగ్యములనబడు పుత్రులను పురాణ శ్రవణమనబడు గర్భమునుండి పుట్టించుటవలన 'సూతు' డనబడెను.

(2) 'ఋచః సామాని యజూగ్ంషి సా హి శ్రీ రమృతాసతాం' అను ప్రమాణముచే ఉత్తమములగు ఋగాది వేదములు 'శ్రీః' అనబడును.

(3) మధ్యమ తరగతివారికి ఆయురారోగ్య కళత్ర పుత్రపౌత్ర సామ్రాజ్యాది సమస్త సంపదల నీయగలది శ్రీః అనబడును.

ఇతః పరం శ్రీనివాసః శ్రీపతిః సర్వశో హి నః ।
కథం ప్రీతో భవేత్సద్యో హ్యభీష్టాని ప్రవర్షయేత్ ॥ 2

అ:- శ్రీలక్ష్మీదేవికి మాత్రమేగాక, బ్రహ్మరుద్రాది దేవతలకును, మనకును, ఆశ్రయభూతుడు, స్వామియు అగు శ్రీ శ్రీనివాసుడు ఏ సాధనముచేత సంతుష్టుడై వెంటనే మనయొక్క సర్వాభీష్టములను అనుగ్రహించునో అట్టి అమృతతుల్యములైన శ్రీ శ్రీనివాసుని మహిమలను తెలుపుము.

తద్వదస్వ కృపాపూర్ణ వేంకటేశకథామృతమ్ ।
భగవన్ సర్వతత్త్వజ్ఞ దయాపాత్రం వయం తవ ॥ 3

అ:- సమస్తతత్త్వముల నెఱింగినవాడవు, దయాపూర్ణుడవు, మహాత్ముడవు, పూజ్యుడవునగు ఓ సూత మునీంద్రా! నీ కృపకు పాత్రులైయున్న మాకు ఇంకొకమారు ఆ మహిమలను వివరింప బ్రార్థించుచున్నాము. అప్పుడు శౌనకాది ఋషుల ప్రార్థనచే సంతుష్టులైన శ్రీ సూతమునులు ఈ విధముగా చెప్పిరి.

విశేషార్థము :—

(1) నీవు సకల తత్త్వముల నెఱిగినవాడవనుటచే ఎట్టి యుపాయముచే శ్రీహరి సంతుష్టుడై యభీష్టములనిచ్చునో అట్టిదానిని తెలియదని చెప్పవీలులేదు.

(2) దయాపాత్రులమనుటచే మాయందు మీకు మిక్కుటముగా దయయుండుటవలన తప్పక చెప్పెదరనియు సూచితమైనది.

(3) అమృతం - అనుటవలన అమృతపానముచేత మరణాదులు లేక ఎట్లు ముక్తి కలుగునో అట్లే శ్రీ శ్రీనివాసుని చరిత్ర విన్నవారికి మరణాదులు తొలగి ముక్తి లభించుననియు సూచింపబడినది.

(4) 'పూజ్యే తత్రభవా నత్రభవాన్ భవాంశ్చ భగవాన్ ఇతి' అను ప్రమాణముచే భగవచ్ఛబ్దము పూజ్యవాచకము.

శ్రీసూత ఉవాచ —

శృణుధ్వం మునయో దివ్యం సావధానతయా త్విదమ్ ।
యథా పృష్టం తథైవాహం వక్ష్యామి వచనం శుభమ్ ॥ 4

**అ :—** ఓమునులారా! అత్యంతశ్రద్ధాభక్తులతో ఏ దివ్యచరితమును వినవలయునవియు, భగవంతుని ప్రీతిపాత్రులము కావలయుననియు భావించుచున్నారో, అట్టి చరితమును మీరు కోరిన విధముగా చెప్పెదను.

అవతరణికా :— "కిమలభ్యం భగవతి ప్రసన్నే శ్రీనికేతనే" భగవంతుడు ప్రసన్నుడైనచో సర్వము లభ్యమగును. శ్రీహరిప్రసాదమో — ఆతని మాహాత్మ్యజ్ఞానముచేతనే కలుగును. శ్రీహరి ప్రకృతి వ్యాపకుడు, ప్రకృతి నియామకుడు, సర్వవ్యాపకుడు, సకల లోకములకు ప్రభువు, ముక్తవ్యాపకుడు, ముక్త నియామకుడు, నిర్దోషి, అనంత కల్యాణగుణములుకలవాడు - అని యాతని మహిమనిట్లు నిరూపించుచున్నాడు.

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥ 5

అ :— ఓ శౌనకాదులారా! బ్రహ్మాండమున శ్రీ వేంకటాచలమునకు సరియగు స్థానము ప్రస్తుతము లేదు. పూర్వమందును లేదు. ఇక ముందును నుండజాలదు. అట్లే స్మరణ మాత్రముచే సమస్త పాపములను నాశనము చేయునట్టి ఈ వేంకటాచలాధిష్ఠితుడగు శ్రీ శ్రీనివాసునితో సరిపోలెడి దైవము ప్రకృతమునందు లేదు. పూర్వమునందును లేదు. ఇకముందును నుండజాలదు.

అద్భుతం చాస్య చరితం వర్ణితుం కేన శక్యతే ।
తథాపి తారకం సర్వపాపఘ్నం పుణ్యవర్ధనమ్ ॥ 6

అ :— శ్రీశ్రీనివాసుని చరిత్రము అత్యాశ్చర్యకరమైనది. దానిని చెప్ప నెవరి తరము? చతుర్ముఖునికైనను పూర్ణముగా జెప్ప నలవికానిది! అయినను ఆ చరిత్రశ్రవణము జననమరణరూపమగు సంసారము నుండి విముక్తిని ప్రసాదించును. సర్వపాపములను పరిహరించును. ప్రత్యేకించి పుణ్యాభివృద్ధిని కలుగజేయును.

సువిచిత్రమపూర్వార్థం దేవర్ష్యాద్రిభిరాదృతమ్ ।
లోకోత్తరం మహాశ్చర్యం వక్ష్యే సర్వార్థసిద్ధిదమ్ ॥ 7

అ :— అతి చిత్రమయిన దగుటచే అన్నిటికంటె విలక్షణమైనది. అత్యంత విశేషార్థము కలది. బ్రహ్మాది దేవతలచేతను, నారదాది మహర్షులచేతను అత్యంతాదరణముతో కొనియాడబడినది. వినినంతటనే జ్ఞానము కల్గించున దగుటచే లోకమునందత్యుత్తమమైనది. అనగా లోకోత్తమమగు మోక్షము నిచ్చునది. మహానుభావులగు బ్రహ్మాదులకుకూడ నాశ్చర్యము గొలుపునది. అశ్వమేధ జ్యోతిష్టోమాది యజ్ఞములఫలమును, స్వర్గసుఖమును, ధర్మార్థకామాది పురుషార్థముల నిచ్చునది. మనోనిగ్రహాది సిద్ధులనిచ్చునది. ఇట్టి తారకత్వాది మహామహిమలు కలదగుటవలన అవశ్యజ్ఞాతవ్యమైనట్టి ఈ మాహాత్మ్యమును యథాశక్తిగా నేను చెప్పెదను.

శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే న తత్ క్వచిత్ ।
తద్గతశ్రీనివాసస్య మహిమానాన్యగః శుభః ॥ 8

అ :— ద్వాపరయుగమునందు శేషాచలమని పిలువబడిన ప్రసిద్ధమైన ఈ పర్వతమునం దేమహిమకలదో అట్టి మహిమ బ్రహ్మాండములోని ఏ యితర క్షేత్రమునకును లేదు. ఆయితర క్షేత్రములన్నింటియొక్క మహిమ ఇందు కలదు. ఇచట నెలకొనియున్న శ్రీ శ్రీనివాసుని శుభప్రదమైన మహిమ ఇతర క్షేత్రములందున్న అర్చారూపములందు కానరాదు.

విశేషార్థము :—

(1) అన్ని భగవద్రూపములు సర్వగుణపరిపూర్ణములగుటచే సమాన ములే. అయినను భూవైకుంఠమని ప్రసిద్ధికెందిన వేంకటాచలముపై నెలకొని యున్న శ్రీ శ్రీనివాసుడు భక్తులకు సర్వాభీష్టముల నిచ్చుచున్నాడు. అన్య క్షేత్రములందుగల భగవద్రూపములు సర్వగుణపరిపూర్ణములై, సర్వశక్తులు కలవై సమానములై యున్నప్పటికిని, అంతటిమహిమను కనబరచుటలేదు. 'మహిమా నాన్యగః'. అనుటలోని యభిప్రాయమిదే.

(2) ఇతర క్షేత్రములందు కానరాక శేషాచలమునందు మాత్ర ముండునట్టి మహిమ యేదనగా శ్రీ మద్వాదిరాజశ్రీమచ్చరణులచే సమర్పితమగు సాలగ్రామమాలికయు, 'ఆపాదలంబినీ మాలా వనమాలేతి చోచ్యతే' అన్నట్లు పాదములవరకు వ్రేలాడుచున్న నవరత్నఖచితమైన మాలయు నియతముగా నుండుట, ప్రతి గురువారమునాడు పుష్పకవచాలంకరణము, ప్రతి శుక్రవారము వేలరూపాయల విలువగల సుగంధద్రవ్యములతో అభిషేకము జరుగుట, శనివారములందు అనేకభక్తులు నిరాహార వ్రతము చేయుటయు,

ఆపత్కాలే జపేద్యస్తు శాంతి మాయాంత్యుపద్రవాః ।
రోగాః ప్రశమనం యాంతి త్రిజపాద్భానువాసరే ॥

అను వచనానుసారము ఆదివారమునాడు అనేకులు రోగాదుల పరిహారముకొరకు శ్రీవేంకటేశమంత్రమును జపించుట, భగవంతునకు సమర్పితమగు నైవేద్యమును స్వీకరించుట, నిరాహారులై సాష్టాంగ నమస్కారములను జేయుచు శ్రీవేంకటాద్రికి యాత్ర వెడలుట, శ్రీ శ్రీనివాసుని చరణారవిందములందు నూర్లు - వేలు - లక్షలకొలది ద్రవ్యముల సమర్పించుట, అకాలములయందు కూడ వివాహోపనయనాదుల జేయుట, పండ్రెండుపెలలందును ప్రజలు యాత్రకు పోవుచుండుట, ఇతర క్షేత్రములందువలె ఎప్పుడో కొద్దిదినములు మాత్రమే ఉత్సవాదులు జరుగునట్లుగాక, సంవత్సరము పొడవునను ఉత్సవములు జరుగుచుండుట. ఇంతియేగాక మిక్కిలి దూరదేశములనుండి వేలకొలది భక్తులు యాత్రకు వచ్చుచుండుట, భక్తులెల్లర మనోరథములు నెరవేరుచుండుటయు ఈ క్షేత్రమునకు గల మహిమలు. ఇట్టి మహిమలు మరొక క్షేత్రమున కానరావు. అందువలన ఇచ్చటి మాహాత్మ్యమును ఏమని వర్ణింపగలము?

**వేదేషు చ పురాణేషు వేంకటేశకథామృతం ।**
**వర్ణితం చేతిహాసేషు భారతాద్యాగమేషు చ ॥** 9

అ:— అందువలననే ఋగాది సర్వవేదములందును, పదునెనిమిది పురాణములందును, ఇతిహాసములందును, భారతాద్యాగమములయందును, మూల

రామాయణాదులలోను అమృతమువలె జరామరణములను పోగొట్టునట్టి శ్రీ శ్రీనివాసుని చరిత్రము చెప్పబడియున్నది.

విశేషార్థము :—

(1) 'వేదాశ్చ నిత్యవిన్నత్వాత్' ఇత్యాదులలో చెప్పబడినట్లుగా ఋగ్యజుస్సామాథర్వవేదములు అనాది నిత్యములు.

(2) ఋగ్యజుస్సామాథర్వాశ్చేతిహాసపురాణకాః ।
స్వాగమా ఇతి సంప్రోక్తాః మీమాంసా ధర్మ ఏవ చ ॥

పాద్మపురాణమున ఋగాదివేదములు, ఇతిహాస పురాణములు, ఉత్తర మీమాంసా ధర్మశాస్త్రములు సదాగమములు (సత్ + ఆగమములు) అని పేర్కొనబడినవి.

(3) పాంచరాత్రం భారతం చ మూలరామాయణం తథా ।
ఇతిహాస ఇతి ప్రోక్తః బ్రాహ్మాద్యం చ పురాణకమ్ ॥

అని ప్రకాశ సంహిత.

(4) వేదాశ్చేతిహాసాశ్చ పురాణం భాగవతం తథా ।
మూలప్రమాణ ముద్దిష్టం మీమాంసా చ తథోత్తరా ॥
ఏతేషామవిరోధే తు మానమన్యదుదీరితమ్ ।
ఏతేషాం తు విరుద్ధం యదప్రమాణం విదో విదుః ॥

అని వ్యాసస్మృతి.

(5) విష్ణోః సర్వోత్తమత్వం చ తద్భక్త్యా మోక్ష ఏవ చ ।
శాస్త్రార్థ ఇతి నిర్దిష్టః సర్వశాస్త్రార్థనిర్ణయాత్ ॥

విష్ణువే సర్వోత్తముడు, విష్ణుభక్తిచేతనే మోక్షము, ఇదియే సర్వశాస్త్రార్థము, సర్వశాస్త్రార్థ నిర్ణయసారము అని పాద్మ పురాణము చెప్పుచున్నది.

(6) 'భారతః పంచమః వేదానాం వేదః' అను ప్రమాణముచే భారతము ఐదవ వేదము.

మహత్త్వాద్భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే ।
భారతం సర్వశాస్త్రేషు భారతే గీతికా వరా ॥
విష్ణోః సహస్రనామాపి జ్ఞేయం పాఠ్యం చ తద్ద్వయమ్ ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్ ॥

ఏ ప్రమేయములు భారతమునందు కలవో అవియే మిగత శాస్త్రములందున్నవి. భారతమునందు లేనిది ఎచ్చటనులేదు. అందుచే భారతము సర్వశాస్త్రోత్తమము.

(7) పాద్మపురాణమునందు పదునెనిమిది పురాణములు చెప్పబడినవి:

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా ।
తథాన్యన్నారదీయం చ మార్కండేయం చ సప్తమమ్ ॥
ఆగ్నేయమష్టమం ప్రోక్తం భవిష్యం నవమం తథా ।
దశమం బ్రహ్మవైవర్తం లైంగమేకాదశం తథా ॥
వారాహం ద్వాదశం ప్రోక్తం స్కాందంచాత్ర త్రయోదశమ్ ।
చతుర్దశం వామనం తు కౌర్మం పంచదశం తథా ॥
మాత్స్యం చ గారుడం చైవ బ్రహ్మాండం చ తతః పరమ్ ।
అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీ సుతః ॥

(8) ఈ పదునెనిమిది పురాణములందు —

వైష్ణవం నారదీయం చ తథా భాగవతం వరమ్ ।
గారుడం చ తథా పాద్మం వారాహం శోభనం స్మృతమ్ ॥
ఇవియారు సాత్త్విక పురాణములు.

(9) బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం మార్కండేయం తథైవ చ ।
భవిష్యద్వామనం బ్రాహ్మం రాజసాని నిబోధ మే ॥
ఇవియారు రాజస పురాణములు.

(10) శైవమాగ్నేయకం చైవ లైంగం స్కాందం తథైవ చ ।
కౌర్మం చైవ తథా మాత్స్యం తామసాని ప్రచక్షతే ॥
ఇవియారు తామస పురాణములు.

(11) వానియందు 'షట్కాంతు విష్ణువిషయం సాత్వికం మోక్షదం కిల' అను సూక్తి ననుసరించి, విష్ణుసర్వోత్తమత్వ ప్రతిపాదకములైన ఆఱు సాత్విక పురాణములు మోక్షమును ఇయ్యగలవి.

ఈ క్రింది పదునెనిమిది ఉపపురాణములు :

విష్ణుధర్మోత్తరం చైవ తంత్రభాగవతం తథా ।
తత్త్వసారం నారసింహం వాయుప్రోక్తం తథైవ చ ॥

తథా హంసపురాణం చ షడేతాని మునీశ్వరాః ।
సాత్వికాన్యేవ జానీధ్వం ॥ గారుడ, అ. 1, శ్లో॥ 57, 58.

భవిష్యోత్తర పురాణం చ బృహన్నారదమేవ చ ।
యమనారదసంవాదం లఘునారదమేవ చ ॥

వినాయకపురాణం చ బృహద్బ్రహ్మాండమేవ చ ।
ఏతాని రాజసాన్యాహుః ॥ గారుడ, 1, 51, 60.

పురాణం భగవతీ శైవం నందిప్రోక్తం తథైవ చ ।
పాశుపతం రేణుకాం చ భైరవీం చ తథైవ చ ॥
ఏతాని తామసాన్యాహుః ॥ గారుడ, 1, 61, 62.

సర్వేష్వపి పురాణేషు, శ్రేష్ఠం భాగవతం స్మృతమ్
వేదతుల్యసమంప్రోక్తే గారుడ, అ. 1, శ్లో॥ 64.

(12) 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అను ప్రమాణము ననుసరించి ఇతిహాస పురాణాదులచేతనే వేదార్థమును నిర్ణయింపవలెను.

(13) వేదే రామాయణేచైవ పురాణే భారతే తథా ।
ఆదావంతే చ మధ్యే చ విష్ణుః సర్వత్ర గీయతే ॥

వేదపురాణేతిహాసాదులయందు సర్వే సర్వత్ర విష్ణువే ప్రతిపాద్యుడు. కనుక భక్తిపూర్వకమైన విష్ణుసర్వోత్తమత్వజ్ఞానముచేతనే మోక్షము లభించును.

మనోహరం తు సంశ్రావ్య మిహాముత్రేష్టదాయకమ్ ।
జ్ఞానప్రదం విశేషేణ మహదైశ్వర్యకారణమ్ ॥ 10
వైరాగ్యభక్తిసత్వాదిప్రదేంద్రియవశప్రదమ్ ।
వేంకటాగే శుచిక్షేత్రేఽశుచిదోషో న విద్యతే ॥ 11

అ:— సంసారమున కోరిన ఐహిక సుఖములనిచ్చునది, స్వర్గమునకు, మోక్షమునకు ఉపయుక్తమగు వేదాంతాది శాస్త్రజన్యజ్ఞానమునిచ్చునది, భక్తుల ఐశ్వర్యమునకు కారణమైనది, మనస్సునకు అధికమైన సంతుష్టిని అహ్లాదమును కలుగజేయునది, వైరాగ్యము, భక్తి, సత్వము మున్నగు సర్వ గుణముల నిచ్చునది చిత్తాది సర్వేంద్రియస్వాధీనత నొసంగునది యయిన శ్రీ శ్రీనివాసుని దివ్యచరిత్రమును చెప్పెదను.

సజ్జనుల ఉద్ధరణార్థము శ్రీహరి వైకుంఠమును వదలి ఈ క్షేత్రము నందు వసించుటచేత స్పర్శాది దోషరహితమైన ఈ వేంకటాచలము అత్యంత శుచియైన క్షేత్రము. ఆసన శయనాదులద్వారా నిరంతరము శ్రీ శ్రీని వాసుని సంపర్కముచే పరమపరిశుద్ధుడైన దేవోత్తముడగు శేషుని శరీరమైనది. మరియు 'స్మరణమాత్రేణ ముచ్యంతే తే అంహసోఽఖిలాత్' అను గజేంద్ర మోక్షమునందలి వాక్యము ప్రకారము శేషాదులను స్మరించినంత మాత్రమున పాపమునుండి విముక్తులగుదురని చెప్పబడుటవలన, శేషుడే ఈ కొండకు అభిమాని యగుటవలన ఈ క్షేత్రమునకు అశుచిదోషము ఎట్లు సంభవింపగలదు?

విశేషార్థము :—

సంసారమునందు నానావిధములగు దుఃఖములు సంభవించుట వలనను, సజ్జనుల సాంగత్యము వలనను, ఐహికాముష్మిక ఫలముల ననుభ వించువిషయమున వైరాగ్యము కలుగును. అనగా సుఖముల ననుభవింపవలెనను కోరికను పూర్తిగా విడిచిపెట్టును. 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్' అని శ్రుతి కలదు. అట్టి వైరాగ్యము మోక్షసాధకమగు అపరోక్ష జ్ఞానమునకు సాధనము.

అరాగా దైహికా త్యాగాత్ ఇత్యేతైరేవ సంయుతైః ।
అపరోక్షదర్శనం విష్ణోర్జాయతే నాన్యథా క్వచిత్ ॥

అని గీతా తాత్పర్యమునందు చెప్పిబడినట్లుగా వైరాగ్యమే మోక్షసాధనము.

యావద్రాగవినాశః స్యాద్విరక్తో భక్తిసంయుతః ।
సర్వదైవాప్రమత్తశ్చ పశ్యేదేవ హరిం పరమ్ ॥

అని ఛాందోగ్య భాష్యము. ఎప్పుడు భోగసాధనములందు అనురాగము నశించి విరక్తుడై భక్తుడగుచున్నాడో అప్పుడే భగవంతుని చూచును. అట్టి వైరాగ్యము చేతనే దృఢమగుభక్తి కలుగును. 'వైరాగ్యతో భక్తిదార్ఢ్యం' అన్నారు కదా!

సర్వస్మాదుత్తమ ఇతి సమ్యక్ స్నేహయుతా మతిః ।
సుస్థిరా భక్తిరుద్దిష్టా తయా మోక్షో న చాన్యతః ॥
మాహాత్మ్య జ్ఞాన పూర్వస్తు సుదృఢః సర్వతోఽధికః ।
స్నేహో భక్తిరితి ప్రోక్తః

అనగా నిరవధికానంత కల్యాణగుణములుగల భగవంతుని తమ పుత్ర మిత్రకళత్రాదులకంటె నధికగుణములుకలవాడని తెలిసికొని, అట్టి భగవంతుని యెడల పలువిధములైన విఘ్నములుకలిగినను చెడని స్నేహ ప్రవాహము కల్గియుండుటయే పరమభక్తియనబడును. భగవంతునియెడ మాత్రమే ఇట్టి పరమభక్తి కలిగియుండవలెను.

విషయద్రవణాత్తేషామింద్రియత్వముదాహృతమ్। ఇదముద్దిశ్య ద్రుతేః తమ తమ విషయవాంఛలకడకు పరిగెడు శక్తికలది ఇంద్రియము.

తస్మాద్వేంకటనాథస్య నైవేద్యం గ్రాహ్యముత్తమమ్ ।
తేన క్షేమం ప్రజానాం హి విపరీతే విపర్యయః ॥ 12

అ:— అందుచే అత్యుత్తమములైన శ్రీ శ్రీనివాసుని తీర్థప్రసాదములు తప్పక స్వీకరింపవలయును. వాటిని స్వీకరించినవారికి క్షేమము కలుగును. అట్లుగాక గర్వముతో నిరాకరించినయెడల అనిష్టఫలము కలిగి, దుఃఖమునకు పాత్రులగుదురు.

విశేషార్థము :—

'అప్రాప్తప్రాప్తిర్యోగః । స్థితస్య పరిపాలనం క్షేమః' ఇదివరకు దొరకనిది క్రొత్తగా దొరుకుట యోగము. ఉన్నదానిని రక్షించుకొనుట క్షేమము.

కర్తా హి సృష్టిస్థితిసంయమాదేర్ధర్తా రజస్సత్త్వతమాంస్యనర్హః ।
అనాద్యనంతో వచసాఽవిముక్తః సదాశ్రయో దేవవరో వరేణ్యః ॥ 13

అ:—చేతనాచేతన జగత్తునకు యథాయోగ్యముగా సృష్టిస్థితి సంహార, ప్రేరణ, జ్ఞాన, అజ్ఞాన, బంధ, మోక్షములను కలుగజేయువాడు. వాని వాని యోగ్యతానుసారముగా నాయాగుణములను కలిగించుటకై సత్వరజస్తమోగుణములను ధరించినవాడు. సత్వాది గుణములకు ఆశ్రయుడైనను తత్సంబంధరహితుఁడు. సృష్ట్యాదులు లేనివాడు. అనగా అనాదికాలము నుండి నాశాదులు లేకుండుటచే సంసారబంధము లేనివాడు. అనంతవేదములచే సంపూర్ణముగా తెలిసికొన వీలుకాని వాడు. సజ్జనులకు ఆశ్రయుడు. మరియు సర్వదా అందరికిని ఆశ్రయుడు. బ్రహ్మాదిదేవతలకంటె శ్రేష్ఠుడు. అనగా వారికి కూడ సత్య లోకాధిపత్యాది పదవులనిచ్చువాడు. అందువలననే ఈతడు సర్వశ్రేష్ఠుడగు దేవుడు.

విశేషార్థము :—

దేవశబ్దము "దివ" ధాతువునుండి పుట్టినది. "దివ" ధాతువునకు "దివుక్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాంతి గతిషు" అను ధాతువివరణమునననుసరించి యనేకార్థములుండుటచేత, ద్యుతి = ప్రకాశరూపుడు, మోద = ఆనందస్వరూపుడు, కాంతి = కాంతిస్వరూపుడు, గతి = జ్ఞానస్వరూపుడు — అగుటచే 'దేవు' డనిపించుకొనెను. సర్వోత్తము డగుటచే 'దేవవరు' డనుపించుకొనెను. అట్టి 'దేవవరు' డైన శ్రీ శ్రీనివాసుడు విశేషముగా ఆరాధింపదగినవాడు. ఇట్టి గుణములన్నింటిని అనంత వేదములుకూడ నిర్వచింపజాలవు

శ్రీహరియే సృష్ట్యాదులను చేయువమటకు 'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతీతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి'। అను శ్రుతి ప్రమాణము.

సృష్టిరక్షాహృతి జ్ఞాన నియత్యజ్ఞానబంధనాన్ ।
మోక్షం చ విష్ణుతస్త్వేవ జ్ఞాత్వా ముక్తిర్నచాన్యథా ॥

ఈ శ్లోకమున శ్రీ హరియే 'సృష్ట్యాద్యష్టకర్త' యని చెప్పబడెను. 'చతుర్భిః పాకం వవతిం చ నామభిః' అనుదానిచే నియమము చెప్పబడినది. 'త్వం ముక్తిదో బంధదోఽతో మతో నః । త్వం జ్ఞానదోఽజ్ఞానదశ్చాపి విష్ణో' అను శ్రుతిచే జ్ఞాన, అజ్ఞాన, బంధ మోక్షములను ఇచ్చువాడు విష్ణువే యని చెప్పబడెను. 'యోగుణైః సర్వతో హీనః । శుద్ధః కేవలో నిర్గుణశ్చ । సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ।' ఇత్యాది శ్రుతులచే శ్రీ హరికి సత్వాదిగుణములు లేవని చెప్పబడినది. 'అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తే' ఇత్యాది శ్రుతులచే సంపూర్ణముగా చూచుటకుగాని నిర్వచించుటకుగాని సాధ్యముకాదని చెప్పబడినది.

నిత్యం బ్రహ్మ శివః శేష గరుడేంద్రాదయోఽమరాః ।
పూజయంతి మహాభక్త్యా వేంకటేశం శ్రియా సహ ॥ 14

అ:— బ్రహ్మ, రుద్రుడు, శేషుడు, గరుత్మంతుడు మరియు ఇంద్రుడు మొదలగు ఉత్తమదేవతలు లక్ష్మీదేవి సహితుడైన శ్రీ శ్రీనివాసుని నిత్యము మహాభక్తితో పూజించుచున్నారు. వారివలెనే లక్ష్మీదేవి కూడ శ్రీ హరిని పూజించుచున్నది. వీరందరికంటె ఉత్తముడైనందువలననే శ్రీ హరి పూజింపబడుచున్నాడు.

అవ:— శ్రీహరిని పూజించుట మాత్రమే కాదు. బహుభంగుల భజింపవలెనని కూడ చెప్పుచున్నాడు.

చరాచరగురుర్దేవః సర్వసాక్షీ మహేశ్వరః ।
జిజ్ఞాస్యోఽర్చనీయశ్చ స్మర్యో ధ్యేయోఽఖిలైరపి ॥ 15

అ:— చలనముగల మనుష్యాది జీవులకు జ్ఞానోపదేశకుడును, చలనము లేని వృక్షాదులకు కర్తయును, సర్వమునకు సాక్షిభూతుడును (అనగా ప్రత్యక్ష ముగా సకల వస్తువులను చూచుచున్నవాడును). దేవశ్రేష్ఠుడును, రమాబ్రహ్మాదు లకు స్వామియును అయిన శ్రీశ్రీనివాసుడు పూర్వము అందరిచేతను పూజింప బడి స్మరింపబడి ధ్యానింపబడినవాడు ఇప్పుడును ఇకముందును అర్చన స్మరణ ధ్యానాదులకు అర్హుడు.

విశేషార్థము :—

'జప్యతే ఇతి జపః । జపమానసే' లేక 'జప అవ్యక్తే శబ్దే' అని జపమునకర్థము. 'సద్వైవాఖండితం ధ్యానం తప ఇత్యుచ్యతే బుధైః' అని తపశ్శబ్దార్థము. సర్వకాలములందు అఖండితముగా ధ్యానించుటయే తపస్సు. శ్రవణ మననాదులచే నేర్పడిన సంస్కారబలముతో ఎల్లప్పుడును మనస్సులో పరమాత్మని చింతించుటయే ధ్యానము.

అవ:— ఇది వరకు చెప్పిన భజనాదులయందు శక్తిలేనివారికి భగవ న్నామ స్మరణము చాలును. అదియే సులభము - అను భావముతో భగవన్నామ మాహాత్మ్యమును ప్రతిపాదించుచున్నారు.

తన్మనాస్తద్గతప్రాణో భక్త్యా తన్నామ సంస్మరేత్ ।
గోదానాన్యశ్వమేధాద్యాః కన్యాదానాన్యసంఖ్యయా ॥ 16
అసంఖ్యమేరుసౌవర్ణ దానాన్యన్యాన్యనేకశః ।
తన్నామస్మృత్యతుల్యాని మాహాత్మ్యం కిముతాద్భుతమ్ ॥ 17

అ:— పరమాత్మునియందే దృఢమైన చిత్తమును, ప్రాణమును నిల్పిన వారలై, ఆతని మాహాత్మ్య మందలి జ్ఞానముతో ఆతని రూపములను భక్తితో స్మరింపవలెను. అసంఖ్యాక గోదానములు, అశ్వమేధ జ్యోతిష్టోమాది యాగ ములు, అసంఖ్యాక కన్యాదానములు, మేరుపర్వత సదృశమైన సువర్ణ దాన ములు — ఇట్టి అనేకవిధ దానములు కేవలము ఒక్క శ్రీనివాసుని నామ స్మరణ ముతో సరితూగజాలవు. ఇట్లుండగా శ్రీ శ్రీనివాసుని మాహాత్మ్యము అత్యద్భుత మని వేరుగా చెప్పవలెనా?

అవ:— ఇట్టి మాహాత్మ్యము నెవరు చెప్పినారనగా —

ఇతి శేషేణ కథితం కపిలాయ మహాత్మనే ।
కపిలాఖ్యమహాయోగి సకాశాత్తు మయా శ్రుతమ్ ॥ 18

అ:— ఇట్టి మహిమను మహానుభావుడును, నా గురువును అయిన కపిల మునికి శ్రీ ఆదిశేషుడు చెప్పెను. మహాయోగులైన శ్రీ కపిలముని వలన నేను వింటిని.

అవ:— భగవంతుడెట్లు సంతుష్టుడై అభీష్టముల నిచ్చును ? అను ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పుచున్నాడు.

తదుక్తం భవతామద్య సద్యః ప్రీతికరం హరేః ।
అతో వో మంగలార్థం చ శృణుధ్వం యన్మయోచ్యతే ॥ 19

అ:— కపిలమునివలన నేను వినిన దానిని మీ కిపుడు చెప్పెదను. ఏ ప్రమేయములతో తత్క్షణమే శ్రీ శ్రీనివాసుని కృపకలుగునో, సకలాభీష్టములు నేరవేరునో అటువంటి మంగళప్రదమైన శ్రీహరియొక్క మాహాత్మ్యమును శ్రద్ధతో నాలకింపుడు.

శ్రీవేంకటేశయాత్రార్థం గచ్ఛధ్వం సుదృఢవ్రతాః ।
విష్ణుసందర్శనం కృత్వా భక్తిమంతో జితేంద్రియాః ॥ 20

అ:— మీరు సుదృఢమైన నియమములు గలవారై అనగా పాదచారులై, ఎల్లప్పుడు శ్రీ పరమాత్మునియందే మనస్సునుంచినవారై శ్రీ వేంకటేశుని యాత్రకు వెళ్ళుడు. శ్రవణ, మనన, ధ్యానానుష్ఠానాది నియమాదులతో ఇంద్రియములను తమ వశమందుంచుకొన్నవారై, పరమ భక్తిగలవారలై సర్వాంతర్యామియైన, సర్వనియామకుడైన ఆ విష్ణుమూర్తిని బాగుగా దర్శింపుడు.

స్తోత్రం కురుధ్వం బహుధా భగవద్గుణవర్ణనైః ।
స్వగుణోత్కర్ష విజ్ఞానాద్యథా ప్రీతిర్భవేద్ధరేః ॥ 21

అ:— స్వీయగుణోత్కర్షజ్ఞానముతో కూడిన అచంచల భక్తితో నెట్లు

స్తోత్రము చేసిన తన భక్తులకు శ్రీనివాసుడు ప్రీతుడగునో అట్లే ఆ దేవదేవుని గుణములను విశేషజ్ఞానముతో భక్తియుతులై అనేకవిధములుగా వర్ణన చేయుడు.

న తాదృశీ ప్రీతిరస్తి హ్యజ్ఞానాదన్యథామతౌ ।
భక్త్యా స్తోత్రేణ సంతుష్టః సర్వేష్టాని ప్రవర్షతి ॥ 22

అ:— శ్రీ విష్ణుసూక్త, పురుషసూక్తాదులందు ప్రతిపాదితములైన భగవద్గుణపూర్వక స్తోత్రాదులచేతనే శ్రీహరి మిగుల సంతుష్టుడగును. అట్లుగాక అజ్ఞానముతో భగవన్మాహాత్మ్యజ్ఞానము లేకుండ, భగవద్గుణోత్కర్షజ్ఞానములేక, భక్తిలేక చేసిన స్తోత్రములచే భగవంతుడు ఎన్నటికిని సంతుష్టుడు కాజాలడు. భక్తిపూర్వకముగాచేసిన స్తోత్రాదులవలన సంతుష్టుడైన శ్రీహరి సకలాభీష్టముల నిచ్చును.

విశేషార్థము :—

న తాదృశీ ప్రీతిరీడ్యస్య విష్ణోః
గుణోత్కర్షజ్ఞాతరి యాదృశీ స్యాత్ ।
తత్ప్రీణనాన్మోక్షమాప్నోతి సర్వః
తతో వేదాస్తత్పరాస్సర్వ ఏవ ॥

ఇత్యాది ప్రమాణములనుబట్టి భక్తిపూర్వకముగానే స్తోత్రాదులను చేయవలెనని తెలియదగినది

భక్తిస్తోత్రాదిహీనేషు దయాపాంగో న సర్వథా ।
అత్ర వః కథయామీష్టమితిహాసం పురాతనమ్ ॥ 23

అ:— భక్తి, స్తోత్రము మున్నగునవి యే మాత్రము లేనివారియందు పరమాత్మని కృపాకటాక్షము (సర్వప్రకారముగా) కలుగదు. ఈ విషయమై మనస్సునకు ఇంపైన యొక ప్రాచీనకథను తెల్పెదను.

యస్య స్మరణమాత్రేణ భక్తిర్విష్ణుపదాంబుజే ।
వాయుశిష్యో దేవశర్మా విష్ణుభక్తో జితేంద్రియః ॥ 24

అ:— ఎవరియొక్క (ఏ యితిహాసముయొక్క) శ్రవణముచేతనే శ్రీపరమాత్ముని పాదారవిందములయందు భక్తి కలుగునో అట్టి పరమభక్తునియొక్క యితిహాసము మీకొరకు చెప్పుచున్నాను. వాయుదేవునకు శిష్యుడగు 'దేవశర్మ' యను భక్తుడుండెను. అతడు విష్ణుభక్తుడును, జితేంద్రియుడునై యుండెను.

తపస్వీ బహునిష్ఠావాన్ సర్వదా విష్ణుచింతనే ।
మమతాహంకారవర్జ్యో విషయేషు విరాగవాన్ ॥ 25

అ:— అతడు ఎల్లప్పుడు భగవంతునకు సంబంధించిన వేదశాస్త్రాదుల యొక్క స్వాధ్యాయప్రవచనరూపమైన తపమాచరించువాడు.

'తప-ఆలోచనే' అను ధాతువుననుసరించి భగవన్మాహాత్మ్య విషయమై వేదశాస్త్రార్థముల నాలోచించువాడని యర్థము. ఇందుకు 'స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః । తద్ధి తపః తద్ధి తపః' అను ఉపనిషద్వాక్యము ప్రమాణము. ఆ దేవశర్మ సర్వదా విష్ణుచింతన చేయుటలో అధికమైన ఆస్తిక్యబుద్ధి కలవాడు, శ్రీహరియే రక్షకుడు—అను నిశ్చితబుద్ధి కలవాడు, అహంకార మమకారములు లేనివాడు (అనగా మనోనిగ్రహము కలవాడు), స్రక్చందనవనితాదిసుఖభోగములందు విరక్తి కలవాడు, రాగద్వేష రహితుడు.

షట్ఛత్రువిజయీ శాంతః షట్తరంగనుభంగకృత్ ।
కుటుంబే న మనఃకారీ దారిద్ర్యాత్పీడితోఽపి చ ॥ 26

అ:— అరిషడ్వర్గములు (కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యములు) అను శత్రువులారింటిని జయించినవాడు. సుఖదుఃఖములు భగవదనుగ్రహముతో ప్రాప్తమైనవని తెలిసికొని శమమను గుణము కలవాడు. (అనగా 'శమో మన్నిష్ఠతా బుద్ధేః' అను ప్రమాణముచే భగవదాసక్తమైన బుద్ధి కలవాడని యర్థము.) ఆహారేచ్ఛ, పానేచ్ఛ మొదలుగుగాగల ఆరు తరంగములకు నాశకుడు. దారిద్ర్యముచే మిక్కిలి పీడితుడయ్యును కుటుంబ రక్షణవిషయమున చిత్తము నుంచనివాడు.

విశేషార్థము :—

లోకములో దుఃఖతరంగ జాతులనేకములుండగా, 'యోఽశనాయా పిపాసే శోకం మోహం జరామృత్యుమత్యేతి' అను శ్రుతినిబట్టి పెద్దలు అశనాయ - పిపాస - మొదలగు ఆరింటిని ప్రధానముగా దుఃఖతరంగములని నిశ్చయించిరి. అశనాయా = భోజనేచ్ఛ, పిపాసా=పానేచ్ఛ.

ఉత్పత్తి రస్తి వృద్ధిశ్చ పరిణామ అపక్షయః ।
వినాశ ఇతి షడ్భావాః న సంతి పరమాత్మనః ॥

1. ఉత్పత్తిః = గర్భమునుండి పుట్టుక; 2. అస్తి = భూమిపై జీవించుట; 3. వృద్ధిః = అభివృద్ధి; 4. పరిణామః = బాల్యవార్ధక్యాది మార్పుల నొందుట; 5. అపక్షయః = వృద్ధాప్యదశలో దినదినము క్షీణించుట; 6. వినాశః = దేహనాశము—అనునవి షడ్భావములు. ఇవిపరమాత్మకు ఉండవు.

భార్యయా ప్రార్థితో నిత్యం దారిద్ర్యాపగమేచ్ఛయా ।
భో నాథ! హే పతే! స్వామిన్! ప్రసీద కరుణాకర! ॥ 27

అ :— పతివ్రతయగు అతని భార్య, 'ఓ పతిదేవుడా! తపోబల సంపన్నుడా! కృపాళుడవగు నా స్వామీ! బీదరికమును తొలగించుట కొఱకు మాయందు దయ చూపుమా' అని ప్రతిదినము అతనిని ప్రార్థించుచుండినది.

క్షుధయా పీడితా బాలాస్తవ పుత్రాశ్చ కేవలమ్ ।
న శక్తాఽహమరణ్యేషు కందమూలార్జనాదిషు ॥ 28

అ :— కేవలము తమ బిడ్డలైన బాలురు మితిమీఱిన యాకలిచే మిగుల పీడింపబడుచున్నారు. నేను అడవికివెళ్ళి కందమూలాదులను సంపాదించు శక్తి లేనిదాననై యున్నాను.

రక్షకో మమ నాన్యోఽస్తి శిశూనాం పాలనేఽపి చ ।
కృపాం కురుష్వ శిశుషు మద్విజ్ఞాపనమాశృణు ॥ 29

అ:— నాకు రక్షకుడు మరియొకడులేడు. శిశువులను రక్షించుటకును మరెవ్వడు లేడు. బిడ్డలయందు దయచూపుము. నా మనవి నాలకింపుము.

కులస్వామీష్టదేవో నో జగద్రక్షణదీక్షితః ।
శరణాగతసంత్రాణః శ్రీనివాసస్సతాంగతిః ॥ 30
పాలకో హి బహూనాం చ భక్తానాం భక్తవత్సలః ।

అ:— పూర్వమునుండి మనకు కులస్వామియు, ఇష్టదేవుడును, లోకరక్షాకంకణబద్ధుడును, శరణాగతులను రక్షించువాడును, సజ్జనుల కాశ్రయుడును, భక్తవత్సలుడునగు శ్రీ శ్రీనివాసుడు బహుసంఖ్యాకులైన భక్తులకు పాలకుడని ప్రసిద్ధి కలదు.

విశేషార్థము :—

(1) శరణాగతి యనగా -
సర్వోత్తమత్వ విజ్ఞానపూర్వం తత్ర మనస్సదా !
సర్వాధికప్రేమయుక్తం సర్వస్యాత్ర సమర్పణమ్ ॥
అఖండా త్రివిధా పూజా తద్రత్యైవ స్వభావతః ।
రక్షతీత్యేవ విశ్వాసః తదీయోఽహమితి స్మృతిః ॥
శరణాగతిరేషా స్యాత్ విష్ణో మోక్షఫలప్రదా ॥

శ్రీహరియొక్కడే సర్వోత్తముడను జ్ఞానముకలిగి, హరియందే చిత్తమునుంచి, పరమస్నేహపూర్వకముగా సర్వమును సమర్పించి, నిశ్చయముగ నతడే రక్షించును, నే నతని భృత్యుడను, భక్తుడను- అను తలంపుగల్గియుండుటే 'శరణాగతి' యనబడును. ఈ నిశ్చయజ్ఞానముచే ముక్తి లభించును.

(2) 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని గీతయు, 'భవ మమశరణం' అనియు, రక్షింపవలెనని పెక్కుచోట్ల ప్రార్థన కలదు.

తల్లక్ష్మీపతిపాదాబ్జం గత్వా తత్ప్రార్థనాం కురు ॥ 31

అ:— బహుసంఖ్యాకులైన తన భక్తులను రక్షించువాడును, భక్తులందు

మిక్కిలి ప్రీతికలవాడును, లక్ష్మీపతియునగు శ్రీ వేంకటేశుని పాదపద్మములను పొంది యాతనిని ప్రార్థనచేయుము.

తేన ప్రీతో భవేత్సద్యః తతోఽస్మజ్జీవనం భవేత్ ।
ప్రసీద త్వం దయాసింధో దయాం కురు దయాం కురు ॥ 32

అ:— ఆ ప్రార్థనచే శ్రీహరి వెంటనే సంతుష్టుడగును. అటుపై నాతని దయవలన మన జీవనము బాగుపడును. దయాసింధుడవగు నో పతిదేవా! ప్రసన్నుడవగుమా! దయచూపుమా! దయచూపుమా! (రెండు మారులు పలుకుటలో ఆదరము వ్యక్తమగుచున్నది)

ఇతిదైన్యేన మహతా ప్రార్థితోఽహర్నిశం తయా ।
న స్వీచకార తద్వాక్యం తపోవిఘ్నభయాత్తదా ॥ 33

అ:- ఈ రీతిగా తన భార్యచే మహాదైన్యముతో రాత్రింబవళ్ళు ప్రార్థింప బడుచున్నను, తన సచ్ఛాస్త్రప్రవచన, స్వాధ్యాయరూపమైన తపస్సునకు ఆటంకము కలుగునను భీతితో ఆమె మాటల నాతడు స్వీకరింపడయ్యెను.

దిష్ట్యా చాదృష్టపాకేన తద్గురు ర్వాయు రాగమత్ ।
పతివ్రతాయాం శిశుషు ప్రసన్నః కరుణానిధిః ॥ 34

అ:- దైవవశమున అదే సమయమునందు వారి దారిద్ర్యదశ పరిపక్వమై యుండుటవలన (దారిద్ర్యదుఃఖ పరిహారకాలము దాపురించెను గనుక), తన శిష్యుని ఇల్లాలు మహాపతివ్రత యగుటవలన ఆమెయందును, ఆమె బిడ్డల యందును మిక్కిలి దయగలవాడై, ప్రసన్నుడైన గురువగు వాయుదేవుడు అచటికి వచ్చెను. ('కృషితో నాస్తి దుర్భిక్షం, జపతో నాస్తి పాతకం' అను స్మృతి మేరకు దేవశర్మ జపాదులను ఆచరించుచుండుటవలన అతని దుష్కర్మము నశించు కాలమాసన్నమైవదని భావము)

**తపోఽవసానే సంప్రాప్తం స్వగురుం జగతాం గురుమ్ ।**
**దృష్ట్వా ముదా దేవశర్మా సహసోత్థాయ చాదరాత్ ॥ 35**

సాష్టాంగం తం ప్రణమ్యాథ బద్ధాంజలిపుటోఽభవత్ ।
తతో వాయుః ప్రాహ శిష్యం మధురం వచనం హితమ్ ॥ 36

అ:- తపస్సమాప్తి సమయములో విచ్చేసిన, తనకును, రుద్రాది దేవతలకును గురువగు వాయుదేవుని చూచి దేవశర్మ సంతోషముతో (అనగా ఇష్టప్రాప్తియు, అనిష్టపరిహారము అగునను ఆనందముతో) తత్క్షణమే లేచి నిలువబడి, ఆదరపూర్వకమగు పరమభక్తితో సాష్టాంగ ప్రణామములాచరించి, మిక్కిలి భక్తితో అర్చించి బద్ధాంజలియై నిలుచుండెను. శిష్యుడు ప్రార్థించిన పిదప, వాయుదేవుడు దేవశర్మనుగూర్చి శాశ్వతమైన శ్రేయస్సునకు కారణములగు ప్రియమధుర వచనములను పలికెను.

శ్రీమద్వేంకటనాథస్య యాత్రార్థం గచ్ఛ మా చిరమ్ ।
తేనేహాముత్ర తేఽభీష్టసిద్ధిర్భవతి నాన్యథా ॥ 37

అ:- ఓ ప్రియశిష్యుడా! శ్రీ వేంకటాచలమునకు అధిపతియైన శ్రీ లక్ష్మీ వేంకటేశుని యాత్రకు త్వరగా వెళ్ళుము. ఆలస్యము తగదు. ఆ యాత్ర వలన నీకు ఈ లోకమునందును, ఈ సంసారమునందును, స్వర్గమోక్షములందును ఇష్టసిద్ధి కలుగును. సందేహము వలదు. లేనియెడల అభీష్టసిద్ధి కలుగనేరదు.

అవ:- ఇష్టసిద్ధిని సూచించు విశేషణముల చెప్పుచున్నాడు.

లక్ష్మీపతే ర్దయాసింధోః బ్రహ్మాదివరదాయినః ।
యాత్రాయాం మాస్తు సందేహః శీఘ్రం గచ్ఛ సుభక్తిమన్ ॥ 38

అ:- ఐశ్వర్యాభిమానియైన శ్రీలక్ష్మీదేవికి పతియు, దయాసాగరుడును, బ్రహ్మాదిదేవతలకు వరములనిచ్చువాడునగు శ్రీ వేంకటేశ్వరుని యాత్రా విషయములో ఎట్టి సందేహమును అక్కరలేదు. కావున అత్యంత శ్రద్ధాభక్తియుతుడవై త్వరగా వెళ్ళుము.

ఇతి దేవాద్యుత్తమేన గురుణా వాయునేరితః ।
ముహుర్ముహుర్నోదితోఽథ విష్ణుయాత్రామహాదరః ॥ 39

గురూక్తమర్థం జగ్రాహ గురువాక్యే సదా రతః ।
గురూపదేశో బలవాన్ గురోరాజ్ఞాం న లంఘయేత్ ॥ 40
ఇత్యర్థమనుసంధాయ ప్రతస్థే శేషపర్వతమ్ ।
తత్ర శ్రీవేంకటేశస్య సందర్శనమహాదరః ॥ 41

అ :- ఈ విధముగ రుద్రాది దేవతలకంటె ఉత్తముడును, జగద్గురువును, స్వగురువునగు వాయుదేవునిచే ప్రేరేపింపబడెను. (అంతఃప్రేరకుడగు భగవంతుని చేతను ప్రేరేపింపబడెను). అట్లు మఱల మఱల బోధింపబడినవాడై శ్రీ శ్రీనివాసుని యాత్రావిషయమై గురువాక్యమునందు మిక్కిలి శ్రద్ధాసక్తులు కలవాడైన దేవశర్మ ఆ వాయుదేవునిచే చెప్పబడిన యుపదేశమును స్వీకరించెను. (అనగా ఆ యాత్రవలన తనకు శుభము కలుగునని తెలిసికొనెను)

గురూపదేశము ఇష్టసాధకమైనది, గుర్వాజ్ఞ మీఱకూడదు. 'సమాశ్రయేద్గురుం భక్త్యా గురోః శ్రీ పాదపంకజే' అనుస్మృత్యర్థమును అనుసంధానము చేసికొని 'తేనేహాముత్ర తేఽభీష్టసిద్ధిః' అని 37 వ శ్లోకములో చెప్పిన గురువాక్యమును, దానియర్థమును మనస్సునకు తెచ్చుకొని, శేషగిరివాసియగు శ్రీ శ్రీనివాసుని దర్శింపవలెనను కుతూహలముకలవాడై, తదేకధ్యానముతో శ్రీ వేంకటేశుని సందర్శనభాగ్యముచే భగవంతుని కృపయు, అపరోక్షజ్ఞానము కలుగునను ఉత్సాహముతో శ్రీ వేంకటాచలమునకు వెళ్ళెను.

విశేషార్థము :—

(1) మతి - శ్రుతి - ధ్యాన - కాల - విశేషం గురురుత్తమః ।
వేత్తి తస్యోక్తిమార్గేణ కుర్వతః స్యాద్ధి దర్శనం ।

అని బ్రహ్మసూత్ర భాష్య వ్యాఖ్యానము. శ్రవణ మనన ధ్యానాదుల కాల విశేషమును ఉత్తమ గురువులు తెలిసికొనియుండెదరు.

(2) 'గురూపదేశో బలవాన్ న తస్మాద్బలవత్తరమ్' గురూపదేశముకంటె ప్రబలమైనది మఱొకటి లేదు. దాని మేరకు వర్తించువారికి భగవద్దర్శనము కలుగును.

(3) యయా యస్య విముక్తిః స్యాత్ తద్దాతా ముఖ్యతో గురుః ।
ఏకదేశ గురుత్వంస్యాదవ్యవిద్యాప్రదస్య తు ॥ — బృహద్భాష్యము

ముక్తిని కలిగించు విద్యమపదేశించువాడు ముఖ్యగురువు. ఇతర విద్యలమవదేశించువాడు అముఖ్య గురువు.

(4) 'మహత్సేవాం ద్వారమాహుః విముక్తేః తమోద్వారం యోషితాం సంగిసంగం' - ఉత్తముల సేవచేత మోక్షము కలుగును—
— భాగ. స్కంధ. 5

(5) 'సమ్యక్ గురుప్రసాదశ్చ ముఖ్యతో దృష్టికారణమ్' ।
గురువుల అనుగ్రహముచే అవరోక్షజ్ఞానము కలుగును.

(6) గురుప్రసాదో బలవాన్ నతస్మాద్బలవత్తరమ్ ।
సర్వలక్షణ నంపన్నః యద్దద్యాత్సుప్రసన్నధీః ॥
శిష్యాయ సత్యం భవతి తత్సర్వం నాత్ర సంశయః ॥

గురువులు సంతుష్టులై యువదేశించినప్పుడే ఆయుపదేశము సార్థకమగును.

(7) 'ఆచార్యాద్ధ్యేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపయతి'
గురూవదేశము లేకుండ కేవలము పుస్తకములచే సాధించిన జ్ఞానము మోక్షసాధనము కాజాలదు.

(8) అప్రసాదాద్గురోర్విద్యాః నయథోక్త వలప్రదాః ।
విద్యాః కర్మాణి చ సదా గురోః ప్రోక్తాః వలప్రదాః ॥

గురువుల యమగ్రహము లేకున్నయెడల విద్య వలములను ఇవ్వజాలదు. గురూపదిష్టవిద్యలు, గురూపదిష్ట కర్మములు ఉక్తఫలముల నిచ్చును.

(9) భక్త్యా జ్ఞానాన్ నిషిద్ధానాం త్యాగాన్నిత్యం హరిస్మృతేః ।
అపరోక్షదర్శనం విష్ణోర్జాయతే నాన్యథా క్వచిత్ ॥

భక్తి, జ్ఞానము, నిషిద్ధకర్మ వరిత్యాగము, ఎల్లప్పుడు హరిస్మరణ-వీటిచే అవరోక్షజ్ఞానము కలుగును.

ఆనందజ్ఞానదం విష్ణుం ఆనందమయనామకమ్ ।
ఆనందేన దదర్శాథ ఆనందనిలయాలయే ॥ 42

అ:– ఆయురారోగ్యములను, పుత్ర, మిత్ర, కళత్రాదులతో కూడిన ఐహికానందమును, ధనధాన్యరూపమైన సంపత్తును, పారత్రికమైన స్వర్గమును మోక్షమునందు కలుగు పారలౌకికమగు ఆనందమును, మోక్షోపయుక్తమగు వేదశాస్త్రార్థతత్త్వజ్ఞానమును మఱియు అపరోక్షజ్ఞానమును కలిగించువాడును ('నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనం। అనువ్రజామ్యహం ।' అను భాగవతోక్తిచే భక్తపరాధీనుడైన వాడును), 'అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయా మే శుధ్యంతాం' అని యుపనిషత్తులందు చెప్పబడిన రీతిని ఆనందమయ నామధేయుడును, 'తాదాత్మ్యార్థే వికారార్థే ప్రాచుర్యార్థే మయట్ త్రిధా' అను ఉక్తి ననుసరించి పూర్ణానంద స్వరూపుడగుటచే ఆనందపదబోధ్యుడును, 'ఆనందనిలయ' మని పిలువబడు మందిరమునందు వసించువాడును, సర్వవ్యాపియునైన శ్రీవిష్ణ్వభిన్న శ్రీ శ్రీ వేంకటేశుని ఆదేవశర్మ ఆనందముగా సందర్శించెను.

విహరంతం శ్రీధరాభ్యాం నానాలీలావిలాసినమ్ ।
భక్తదర్శనమాత్రేణ ప్రసన్నం మందహాసినమ్ ।
శ్రీ వేంకటేశం సందృష్ట్వా భక్త్యా నత్వాఽథసంస్తువన్ ॥ 43

అ:– అచ్చట శ్రీదేవి, భూదేవి యనబడు లక్ష్మీరూపములతో విహరించుచున్నవాడును, అనేక లీలావిలాసములు కలవాడును, తన భక్తులను చూచినంత మాత్రమున ప్రసన్నుడై మందహాసములు చిందించుచున్నవాడును అగు శ్రీ శ్రీ వేంకటేశుని చిద్రూపమును ప్రత్యక్షముగా చూచి, మిక్కిలిభక్తితో నమస్కరించి యిట్లు స్తోత్రము చేసెను:

అవ:- అటుపైని దేవశర్మ శ్రీవేంకటేశ్వరుని స్తుతించిన రీతిని చెప్పుచున్నారు.

దేవశర్మోఽవాచ–

దయానిధే దయానిధే దయానిధే దయానిధే ।
నమో నమో, నమో నమో, నమో నమో, నమో నమః ॥ 44

(1) దయానిధే — ఓ దయాపూర్ణుడా!

(2) దయానిధే — పాపముల పరిహరించుట, మోక్షసాధనముల నిచ్చుట అను రెండుగుణములకు నిధియగువాడా!

విశేషార్థము :—

'దో అవఖండనే' అను ధాతువునుండి నిష్పన్నమై, సమస్త పాపములను నాశముచేయుటచే 'దః' అనబడుచున్నది. అనగా సమస్త పాపపరిహారకుడు. 'సర్వపాపాని వేం ప్రాహుః కటః తద్దాహ ఉరితః' అని స్మృతివచనము. భక్తుల సమస్తపాపములను దహించుటచే శ్రీనివాసుడు 'వేంకటు' డనబడు చున్నాడు. 'యా ప్రాపణే' అను ధాతువునుండి పుట్టినది 'యా' శబ్దము. శ్రీనివాసుడు మోక్షాది సకలైశ్వర్యములను ఇచ్చుటచే 'యా' అనిపించు కొనెను. 'వకారోఽమృతబీజం స్యాదైశ్వర్యం కట ఉచ్యతే' అమృతమునకు కారణమైన ఐశ్వర్యము 'వేంకట' యనబడుచున్నది. 'తథాచ దశ్చ యాచ దయే, దయాభ్యాం నిధిః దయానిధిః' సమస్తపాపముల దహించుట, మోక్షము నిచ్చుట యను ఐశ్వర్యములచే పరిపూర్ణుడు.

(3) దయానిధే = దైత్యాది దుష్టులను సంహరించుట, మఱియు వారికి 'అంధతమ' స్సనబడు శాశ్వత నరకదుఃఖము నిచ్చుట అను రెండు గుణములతో పరిపూర్ణుడైనవాడా!

విశేషార్థము :—

దైత్యాదులను సంహరించుటచే 'దః' అని పిలువబడుచున్నాడు. అంధతమస్సను నరకము నిచ్చుటచే 'యా' అని చెప్పబడెను. 'దయాభ్యాం నిధిః దయానిధిః' దైత్యాదులను సంహరించుట, అంధతమస్సను నరకముల నిచ్చునవి అను రెండు గుణములు.

(4) దయానిధే = భక్తులకు కోరినదాని నిచ్చుట, వైకుంఠాది లోకములకు కొనిపోవుట యను రెండు గుణములతో పూర్ణుడవగు ఓ భగవంతుడా! నీకు పలుమార్లు నమస్కరించెదను.

విశేషార్థము :—

'డుదాఞ్ దానే' అను ధాతువు ననుసరించి దదాతీతి = దః దాన స్వభావము గలవాడని యర్థము.

భక్తులను తనస్థానమైన వైకుంఠాది లోకములకు తీసికొని వెళ్ళుటచే 'యా' అని పిలువబడుచున్నాడు. ఈ రెండు గుణములచే నిధే = పూర్ణుడ వగు శ్రీ శ్రీనివాసా! నీకు నమస్కారములు.

దేవశర్మ అష్టైశ్వర్యములను, అష్టపుత్రుల నియ్యవలెనను ఉద్దేశ్యముతో ఎనిమిది మార్లు 'నమః' శబ్దము నుచ్చరించెను. అతడు భగవత్ప్రేరణా నుసారము అట్లు నుడివెను. అదేరీతిని అష్టైశ్వర్యముల నిచ్చెనని 5అధ్యా. 59-60 శ్లో. వలన తెలియుచున్నది.

అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా ।
ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్ట సిద్ధయః ॥
ఈ యెనిమిది సిద్ధులు అష్టైశ్వర్యములని చెప్పబడినవి.

అవ:- పద్మమునందు శ్రీ మహాలక్ష్మియొక్క విశేష సన్నిధానమున్నందు వలన స్వామివారిని మంగళకరములగు 'పద్మ' పదములతోనుతించుచున్నాడు.

శ్రీ పద్మనాభ పద్మేశ పద్మజేశేంద్రవందిత ।
పద్మమాలిన్ పద్మనేత్ర పద్మాభయదరారిభృత్ ॥ 45

అ :— ఓ స్వామీ! నాభిపద్మమునందు బ్రహ్మను సృష్టించిన పద్మనాభా! శ్రీలక్ష్మీదేవికి ప్రభువైనవాడా! పద్మమునందు జన్మించిన బ్రహ్మ, శివ, దేవేంద్రాది దేవతలచే వందితుడా! పాదపర్యంతము వ్రేలాడుచున్న పద్మమాలిక కలవాడా! కమలదళములవంటి విశాలనేత్రములు కలవాడా! నాలుగుచేతు లందును పద్మ - అభయముద్ర - శంఖ - చక్రములను ధరించినవాడా!

విశేషార్థము :—

లక్ష్మ్యైవోదకరూపేణ శయ్యా రూపేణ చాండజః ।
ఆసీద్గర్భోదకే చేత్థం నావ్యదాసీత్కథంచన ॥

తన్యనాభే రభూత్పద్మం సౌవర్ణం భువనాశ్రయమ్ ।
తత్ప్రాకృతం చ విజ్ఞేయం భూదేవీ అభిమానినీ ॥
పద్మాద్ధిరణ్మయాజ్జాతో బ్రహ్మాతు చతురాననః ॥

గారుడ అ. 11—20; 49.

లక్ష్మీదేవి భగవంతుని సేవకురాలై ఉదకరూపముతో నుండెను. పరమాత్మునినాభినుండి సువర్ణకమలము జనించెను. అందులోనుండి బ్రహ్మ పుట్టెను.

పద్మపాణే పద్మపాద సర్వహృత్పద్మసంస్థిత ।
త్వత్పాదపద్మయుగలం ప్రణమామ్యతిసుందరమ్ ॥ 46

అ :— కమలమువలె కోమలమైన, సుందరమైన చేతులుకలవాడా! కమలము వలె సుందరమగు పాదములు కలవాడా! సకలజనుల హృదయకమలములందు వసించువాడా! ఓ శ్రీనివాసా! అతిసుందరములగు నీపాదపద్మములకు భక్తిపూర్వకముగా నమస్కరించుచున్నాను.

విశేషార్థము :—

స్వాత్మానందః సముద్దిష్టః వరితి జ్ఞానముచ్యతే ।
ముక్తిదానేన తద్దానాత్సువరస్య పదద్వయమ్ ॥

భగవంతుని కుడిపాదము 'సు' అనియు, ఎడమపాదము 'వర్' అనియు చెప్పబడును. 'యం యం యథోపాసతే తత్తథైవ భవతి' అను వచనానుసారముగ జ్ఞాన, ఆనంద స్వరూపములగు రెండుపాదములకు మ్రొక్కిన ఆ రెండిటిరూపమగు మోక్షము లభించును. కనుకనే రెండుపాదములకు నమస్కరించుట.

అవ :— నీపాదపద్మములమహిమ కొంత తెలిసినంత మాత్రమున నీ మహిమ ఇంత యని చెప్పనెవరికిని సాధ్యముకాదని నుడువుచున్నాడు.

త్వత్పాదపద్మ మాహాత్మ్యమప్యనంతం త్రివిక్రమమ్ ।
యత్కనిష్ఠాంగుళినఖమణ్యగ్ర గుణసంగతాన్ ॥ 47

అనంతాన్ మవిశేషాంశ్చ పశ్యంతి శ్రీర్నిరంతరమ్ ।
స్తోతుకామాశ్రీఇదీశా హర్షాదాశ్చర్యసాగరే ॥ 48
గహనే గాహమానాభూదవంత శ్రుత్యగోచరే ।

అ:— ఓ స్వామీ! పద్మములవంటి నీపాదములమహిమ అపరిమితము. త్రివిక్రమావతార సమయమున నీవు ఒక్కపాదముచేతనే పదునాలుగులోకముల నాక్రమించి బ్రహ్మాండ కటాహమును చీల్చి గంగను రప్పించినట్టి వాడవు. అట్టి నీ పాదపద్మములమహిమ అనంతము, సర్వవ్యాప్తము, సర్వతోధికము. నీ పాదమందు మాణిక్యమణివలె ప్రకాశించుచున్న నీ చిటికనవ్రేలి గోటికొన భాగమునకుగల ఆనందాది విశేషగుణములను, వాటిలో ఒక్కొక్క గుణమునకు గల మహిమావిశేషములను ఎల్లకాలములందును, ఏమాత్రము శ్రద్ధకుంటుపడక స్తోత్రము గావించు జ్ఞానస్వరూపిణియగు శ్రీలక్ష్మీదేవికూడ సంపూర్ణవిశేషముల నెరుగనిదై, అనంత వేదములకుకూడ గోచరముకానట్టి నీ పాదపద్మములమహిమను అతి సంతోషమువలన స్తోత్రముచేయుటకు అశక్తురాలై అగాధాశ్చర్య సాగరములో మునిగిపోయియున్నది.

విశేషార్థము :—

త్రివిక్రమ న విక్రమం గణయితుం ఫణీ శక్నుతే ।
తవేశ నతవేపథుప్రశమనం పరే కిం పునః ॥
అజాండఘనభాండఖండనపటీయసీ యన్నృదు
ప్రదీప్తనిగమోక్తవన్నఖశిఖా జగద్వ్యాపినీ ॥

అను తీర్థప్రబంధవచనానుసారము ఓ త్రివిక్రముడా! భక్తులభయాదులను నాశ మొందించు నీ పరాక్రమమును సహస్రవదనుడైన ఆదిశేషుడుగూడ లెక్కించు టకు సమర్థుడుకాడు. ఇతరులు సమర్థులు కాజాలరని ప్రత్యేకించి చెప్పనవ సరములేదు. ఎందుచేతననగా బ్రహ్మాండమునంతటిని వ్యాపించుకొనియున్న 'త్రీణిపదావిచక్రమే'; 'విచక్రమే పృథివీ మేష ఏతాం' ఇత్యాది వేదోక్త ప్రామాణ్యము ననుసరించి నీ పాదముయొక్క చిటికెన వ్రేలి గోటికొనభాగము బ్రహ్మాండకటాహమునే చీల్చుటకు సమర్థమైయున్నది - అని భావము. అందుచే

త్రివిక్రముని పరాక్రమమును చెప్పుటకు ఎవరును సమర్థులుకారని నిరూపింప బడినది.

2. 'అభేదేఽపి భేదకార్య నిర్వాహకో విశేషః'

భగవంతునకు ఆయనయొక్క గుణములకు ఆ గుణములలో ఒకదానితో మఱియొకటికి భేదము లేనప్పటికిని ఆ పరమాత్మని గుణములు జ్ఞానము, ఆనందము - ఇత్యాది కార్యభేదములను నిర్వహించుట విశేషము.

3. శ్రీ విష్ణువుయొక్క ఒకపాదమునందున్న - చిటికనవ్రేలి గోటి కొన భాగమునందలి ఒక్కగుణమునకున్న ఒక్క మహిమ అనంతవేదములను కూడ గోచరము కాలేదన్నప్పుడు, జ్ఞానస్వరూపురాలైనప్పటికిని శ్రీలక్ష్మీదేవి శ్రీహరి యొక్క అనంత మహిమావిశేషగుణముల నెరుగనిదై, ఆశ్చర్యసాగరములో మునిగియున్నదన్నచో, ఇక అజ్ఞులకు ఆశ్చర్యమగుననుటలో సందేహమేల?

4. 'త్రయః విక్రమాః యస్య సః' మూడు పాదవిక్షేపములుకలవాడు లేక, త్రి = ముల్లోకములలో, వి = గరుడునిచే, క్రమః = పాదవిక్షేపముకలవాడు లేక త్రిన్ = మూడువేదములను, కాలములను, గుణములను, లోకములను. దేవ మానవదానవులను, చేతనములను, అచేతనములను, మిశ్రమములను పాదము చేతనే ఆక్రమించినవాడు. ఈ ప్రమేయము ఋగ్భాష్యమునందు చెప్పబడినది.

వేదాన్, కాలాన్, గుణాన్, లోకాన్, దేవమానుష దానవాన్ ।
చేతనాచేతనాన్ మిశ్రాన్ త్రీణిపదా విచక్రమే ॥

అవ:— ఈ విషయములో బ్రహ్మదేవుని ప్రయత్నమును చెప్పుచున్నాడు

త్వయోపదిష్టో యః పుత్రవాత్సల్యాచ్చతురాననః । 49
త్వద్గుణానాం చ గణనాత్ ఆనందమతులం భజన్ ।
నాద్యాపి విరరామాసౌ గణనాద్దేవరాడపి । 50

అ:— పుత్రవాత్సల్యముతో స్వయముగనీచే (నీమహిమలు) బ్రహ్మకు ఉపదేశింపబడియున్నప్పటికిని, దేవోత్తముడైన బ్రహ్మదేవుడు నాలుగు ముఖ

ములు గలవాడయ్యును నీ పాదముయొక్క చిటికనవ్రేలి గోటికొన భాగము నందలి మహిమలను లెక్కించుటయందు అసమర్థుడై, ఇంకను అమితానందముతో నీ గుణగణనమును చేయుచునేయున్నాడు. ఇప్పటికిని ఆ ప్రయత్నము నుండి విరమించుట ఆతనికి సాధ్యపడలేదు.

అవ :— ఆదిశేషుని ప్రయత్నము చెప్పుచున్నాడు.

సహస్రవదనః శేషోఽశేషవేదార్థకోవిదః ।
నాహం జానే ఇతి బ్రూతే యన్నఖాగ్రాగ్ర్యవైభవమ్ ॥ 51

అ :- సకల వేదార్థముల నెఱిగి, వేయిముఖములు కలవాడైన ఆదిశేషుడుకూడ నీపాద నఖాగ్రవైభవమును నే నెఱుగ ననుచున్నాడు. సహస్రముఖములతో ఎల్లప్పుడు భగవద్గుణములను చింతించుచున్న శేషుడే చెప్పలేకున్నచో నీ పాదనఖాగ్రమహిమ నెఱిగిన వారెవరు?

అనంత వేదాః భాషంతే హ్యన్యోన్యం ప్రవిచార్య చ ॥ 52

అ :- అనంత వేదములకు అభిమానులైన దేవతలు పరస్పరము బాగుగా విచారించియు, భగవద్గుణైశ్వర్యము చెప్ప నలవికానిదగుటచే శ్రీహరి పాద నఖాగ్రవైభవము నెఱుగకున్నామనిరి.

ఏకైకస్మిన్నధికారే నియుక్తాః ఏకైకశో బ్రహ్మపూర్వాశ్చ విష్ణోః ।
సర్వే దేవాః స్వాధికారే నియుక్తాః సత్యాదిలోకేషు యథాక్రమేణ ॥ 53

అ :— బ్రహ్మాది దేవతలు వారి వారికి తగిన అధికారబలములతో ఒక్కొక్కరు ఒక్కొక్క పదవియందు శ్రీహరిచేత నియమింపబడియున్నారు. వారు సత్యలోకము, స్వర్గలోకము, సూర్యలోకము, చంద్రలోకము మొదలైన సమస్తలోకములందు తమ తమ భోగముల ననుభవించుచున్నారు.

భుజంతి చేష్టాని మహాదరేణ భజంతి శేషాచలగం రమేశమ్ ।
వయం త్వనంతా హరిణా నియుక్తా వేదాః స్తుతౌ స్వస్య గుణానుభావమ్ ॥ 54

అ :— ఆ బ్రహ్మాదిదేవతలు ఆధిపత్యానుసారము ప్రాప్తమైన సకలభోగైశ్వర్యములను అనుభవించుచున్నను, శేషగిరియందున్న లక్ష్మీపతిని మహాభక్తి

గలిగి సర్వదా సేవించుచున్నారు. వేదములమైన (వేదాభిమానదేవతలమైన) మేము అనంతముగా నున్నను శ్రీనివాసుని గుణమాహాత్మ్యమును వర్ణించు వ్యాపారములో శ్రీహరిచేతనే నియమితులమై యున్నాము.

గుణాస్త్వనంతాః పరమాత్మనో యత్ పదోనఖాగ్రస్థ గుణైకదేశమ్ ।
స్తుతా మిలిత్వా వయమప్యశక్తాః వేదాస్త్వనంతా జనితాస్తదర్థమ్ ॥ 55

అ :— ఏకారణమువలన పరమాత్ముని గుణములు అనంతములై యున్నవో, ఆ కారణము వలననే మేము (వేదములు) కూడ అనంతములమైయున్నారము. అనేకులమైన మేమందఅము కలసి స్తుతించినను శ్రీహరియొక్క అనంతగుణములను వర్ణింప లేకున్నాము. శ్రీహరియొక్క పాదనఖాగ్ర గుణమహిమలందు ఏకదేశమును వర్ణించుటకు మాత్రమే మేము తగుదుము. గుణ లేశమును చెప్పుటకే మేము జన్మించియున్నారము.

ఏవం సునిశ్చిత్య గుణైకదేశ
మాహాత్మ్యమేతే త్వవిజానమానాః ।
ఉప (అప) క్రాన్తాః స్తోతుమథో గుణైక
దేశోఽప్యనంతాత్మతయాఽభివృద్ధః । 56

అ :— 'నఖాగ్రభాగమునకు గల గుణైకదేశము కూడ అనంతానంత రూపములతో నభివృద్ధి యగుచుండగా స్తోత్రము చేయుటకు వీలుగాకున్నది.' అని వేదములు (వేదాభిమానదేవతలు) నిశ్చయించుకొని గుణైకదేశమహిమను కూడ నెరుగనివారై తెలిసినంతమాత్రమునే వర్ణించుట కుపక్రమించిరి. 'అపక్రాంతాః' అని పాఠమైనచో, ఏకదేశమునుకూడ వర్ణింపనలవిగాక నివృత్తులైరి అని యర్థము. అనగా భగవద్గుణములను సంపూర్ణముగా తెలిసికొనుట సాధ్యము కాదని, సంపూర్ణ స్తోత్రము చేయుట మానుకొనిరి. అనగా సంపూర్ణముగా స్తోత్రము చేయుటకు అశక్తులైరి. ఇట్లుండగా గుణమహిమలను సంపూర్ణముగా వర్ణింప నెవరితరము?

తం వీక్ష్య తేఽన్యోన్యమథోచురేకం గుణం వదామో విసృజామ శేషాన్ ।
ఆరేభిరే పూర్వవదేవ తేఽపి గుణా హ్యనంతాః ఫలదాస్త్వవృతాశ్చ ॥ 57

అ :— అభివృద్ధి యగుచున్న గుణైకదేశమును చూచి అనంత వేదాభిమాన దేవతలు పరస్పరము మాటలాడుకొని, అభివృద్ధి యగుచున్న గుణైకదేశమునే మనము వర్ణింతము. మిగిలిన వానిని వదలివేయుదము - అని దానినే పొగడనారంభించిరి. మునుపటివలెనే ఒక్కొక్కగుణము అనంతపరివారముగా పెరిగి ఫలప్రదమై విస్తరించెను. ఒకే గుణము శాఖోపశాఖలుగా పెరిగి రాశిగా మారిపోయెనని భావము.

గుణైస్సమంతాత్ శుభదైరనంతైః ప్రత్యేకశః కిరణానీవ పూష్ణః ।
విదిక్షు దిక్షూర్ధ్వమధశ్చదేవాః దృష్ట్వా గుణానద్భుతానిత్యవోచన్ ॥ 58

అ :— సూర్యుని కిరణము లెట్లు సర్వదిక్కులందు వ్యాపించుచున్నవో వానికంటె నధికముగా బ్రహ్మలోకపర్యంతము పై భాగమునందును, పాతాళలోకపర్యంతము క్రింది భాగమునందును వ్యాపించియున్న అత్యాశ్చర్యకరములగు భగవద్గుణగణములను చూచి, ఒక్కొక్క గుణము ఆవరణరూపమై, సర్వశుభప్రదమై అనంతానంతముగా నభివృద్ధి నొందియున్నదని ఆ వేదములు (వేదాభిమాన దేవతలు) పరస్పరము చెప్పుకొనుచు మోహితులైరి.

ద్రష్టుం శ్రోతుం కీర్తితుం వాపి బోద్ధుం అశక్యం నః కిముత స్తోతుమేతాన్ ।
అస్మానతీతాన్ వయమల్పసారాః కిం వర్ణయామోఽలమలం ప్రశంసయా॥59

అ :— ఈ గుణములను కంటితో చూచుటకు, చెవితో వినుటకు, మాటలతో చెప్పుటకు, మనస్సుతో తెలిసికొనుటకు మనకు సాధ్యము కాలేదన్నప్పుడు, మన శక్తి నిమీరి అగోచరములైయున్న గుణములను వర్ణించుటకు సాధ్యముకాదని వేరుగా చెప్పవలెనా? అందువలన అల్పజ్ఞులమగు మనము ఏమని వర్ణింపగలము? కనుక మనము ప్రశంసలమమాని, ఆ దేవుని గుణము [illegible] ప్రశంసింతము.

ఇత్యుక్తవంతః స్వమనోఽనుసారాత్ గుణానేతాన్ వర్ణయామాసు రంజసా ।
తథాపి తే పాదనఖాగ్రగేషు గుణేష్వనంతేషు విభాజితస్య ॥ 60

గుణైకదేశస్య గుణైకదేశః ప్రవర్ణితోఽంశా బహవో న వర్ణితాః ।
ఏవం రమాజాహిపవేదముఖ్యాః శక్తా నాసన్ వర్ణనే త్వద్గుణానామ్ ॥ 61

అ:— ఇట్లు వేదములు (వేదాభిమాన దేవతలు) మనఃపూర్తిగా తమ శక్త్యనుసారము పరమాత్ముని గుణములను మిక్కిలిభక్తితో మఱల వర్ణించుటకు మొదలిడిరి. అందునను శ్రీహరియొక్క పాదకమలములందుండు నఖాగ్రమునకు గల అనంత గుణములలో ఒకగుణమును అనంత భాగములుగా చేసి, అందుండి యొకభాగమును మఱల అనంతభాగములుగ చేయగా వేర్పడిన గుణముయొక్క అనంతానంతాంశములో అనంతాంశభాగమును మాత్రము భక్తితో వర్ణించిరి. అప్పటికిని సాకల్యముగా కాదు. అనేకగుణములు వర్ణింపబడనేలేదు. శ్రీలక్ష్మీదేవి, బ్రహ్మ, రుద్ర, శేషాదులు, వేదాభిమాన దేవతలు కూడ నీ గుణములను తెలిసికొనుటయందును, చూచుటయందును లెక్కించి వర్ణించుటయందును సమర్థులు కాలేకపోయిరి. ఇక ఇతరు లెంతమాత్రము?

అవ :— పాదమహిమను చెప్పి ముగించుచున్నాడు.

యత్సమస్తగుణాన్విష్ణోః వర్ణనే శక్తివర్జితాః ।
అనంతవేదాస్తద్బ్రూమన్ గుణమాహాత్మ్యమీదృశమ్ ॥ 62

విశేషార్థము :—

1. విష్ణుః 'ష్ణు - ప్రస్రవణే' అనుధాతువు నుండి 'విగతః స్నుః యస్య' అనగా నద్యాదులవలె ప్రవహించువాడు కాడు.

2. లేక 'విశేషేణ ష్ణుః యస్మాత్' అను వ్యుత్పత్తిచే విశేషముగా గంగాది నద్యాదులను ప్రవాహరూపముగా ప్రవహించునట్లు చేయువాడు.

3. విష్ల్-వ్యాప్తౌ అను ధాతువు ననుసరించి విష్ణువు సమస్తమును వ్యాపించి యున్నవాడు.

4. 'విశ - ప్రవేశనే' అను ధాతువు ననుసరించి సమస్తమును అంతర్యామిగా ప్రవేశించియున్నవాడు

5. త్రివిక్రమరూపమున మూడుఅడుగులతో విశ్వమునంతటిని ఆక్రమించి యున్నాడు.

6. విష్ణు నామ్ని 'ణ' శబ్దేన విష్ణోః బలముదీర్యతే.
'విష్ణువు' అను శబ్దమునందుండు 'ణ' శబ్దమునకు బలమని అర్థము.

'ణ' ఇత్యాక్రియమాణత్వాత్ ణకారో ఽ స్యబలం మతమ్ ।
విష్ణునామ్ని షకారేణ రమాబ్రహ్మేశపూర్విణః ॥
ప్రణేతృతాఽఖిలస్యైవ విష్ణోరుక్తాఽత్మతా తథా ।
షకారమునకు రమా బ్రహ్మేశాదినిఖిలజగత్తును ప్రేరేపించువాడు — అని యర్థము.

ఆత తత్త్వం సర్వగుణైః దేశతః, కాలతః తథా ।
ఆత్మశబ్దోదితం తచ్చ షశబ్దేనాభిధీయతే ।
ఆత్మశబ్దమే విష్ణు శబ్దార్థము. 'ణ' అనగా పూర్ణుడని యర్థము.

'ష' ఇత్యాక్రియమాణత్వం ప్రణేతృత్వం చ పూర్ణతా
'ష' అనగా ప్రేరకత్వమని యర్థము.

విష్ణోః షకార ఇత్యుక్తో వీత్యుక్తస్య విశిష్టతా ।
అంత్యస్థిత ఉకారస్తు తాచ్ఛీల్యాద్ధరేర్వదేత్ ।
ఏవం విశిష్టప్రాణత్వం అనంతత్వం చ సర్వతః ।
విశిష్టం చ బలం విష్ణోః సర్వస్మాచ్ఛీలమిత్యపి ।
ఉదితం విష్ణుశబ్దేన తస్మాదృక్సంహితామమ ।
వర్ణద్వయ సమాయోగే 'ష్ణు' శబ్దస్యార్థమేవ తు ।
విష్ణోః ప్రాణత్వమాత్మత్వం బలం చైవాత్ర వేత్తి యః ।

స ఏవ విష్ణోః బలవిత్తథా ప్రాణత్వవిద్భవేత్ ।
స ఏవ ముక్తః సంసారాత్ నిత్యాయుష్మాన్ భవిష్యతి ।

అని ఐతరేయ భాష్యమునందు చెప్పబడినది. ఈ ప్రకారము విష్ణు శబ్దమున అనేకార్థము లిమిడియున్నవి.

**ఇతి ఆదిత్య పురాణాంతర్గత శ్రీ వేంకటేశమాహాత్మ్యమునందు**
పాదవజ్రాగ్రమహిమావర్ణనపరమగు ప్రథమాధ్యాయము సమాప్తము.

# అథ ద్వితీయాధ్యాయః

॥ అథ శ్రీశ్రీనివాసదివ్యమంగళవిగ్రహసౌందర్యాదివర్ణనమ్ ॥

అవ :— ఇదివఱకు భగవంతుని పాదనఖాగ్ర మహిమను వర్ణించి, పిదప పాదముల సౌందర్యమును, పాదరేఖలను, దివ్యమంగళదేహ సౌందర్యాదులను స్తుతించు చున్నాడు.

దేవశర్మోవాచ :—

ఇతోఽప్యథ త్వత్పాదాబ్జగతసౌన్దర్యమద్భుతమ్ ।
స్వామింస్త్వయా ప్రేరితశ్చేత్ యథామత్యనువాదయే ॥ 1

అ :— మంగళకరమైన సర్వకార్యములకును ప్రేరకుడవగు నో స్వామీ! నీ పాదనఖాగ్రముల గుణమాహాత్మ్యము, నీ పాదకమల సౌన్దర్యము, వర్ణింప నలవికానివి, ఆశ్చర్యకరమైనవి. అయినను నీచే ప్రేరితుడవైతినేని నా బుద్ధ్యనుసారముగా అనువదింప గలవాడను.

వక్షఃస్థాపి రమాదేవీ తవ పాదాంబుజే స్థితమ్ ।
సౌన్దర్యమద్భుతం దృష్ట్వా సున్దరీ మోహితాఽభవత్ ॥ 2

అ :— ఓ స్వామీ! శ్రీలక్ష్మీదేవి నీ వక్షఃస్థలమునందు నిరంతరము వసించుచున్నదైనను, స్వయముగ అతిసుందరియైనను, తన సౌన్దర్యమున కంటె అత్యుత్కృష్టము, అత్యద్భుతమునగు నీ పాదకమల సౌన్దర్యమును చూచి ముగ్ధురాలయ్యెను.

విస్మితా ద్రష్టుకామాద్ధి స్వస్య నేత్రద్వయేనవై ।
అశక్యం దర్శనం మత్వా త్రిరూపా చాభవత్తదా ॥ 3

అ :— అత్యధికాశ్చర్యముకల శ్రీ లక్ష్మీదేవి తన రెండు నేత్రములతో నీ సౌందర్యమును చూచుట అసాధ్యమని తలచి అట్టి సౌందర్యమునవలోకింప నపేక్షించినదై మూడురూపములను ధరించినదాయెను.

హర్షాత్ శ్రీరూపిణీ వామే భూరూపా దక్షిణే స్థితా ।
దుర్గారూపాగ్రభాగస్థా త్రిరూపా నేత్రషట్కతః ॥ 4

అ:— లక్ష్మీదేవి అత్యుత్సాహముతో నీ యెడమవైపున శ్రీరూపము నొంది నదియు, కుడివైపున భూరూపము దాల్చినదియు, ఎదుట దుర్గారూపమును ధరించినదియువై ఆరు కన్నులతో భగవత్ సౌన్దర్యమును చూచుచున్నది.

పశ్యన్త్యనన్యమనసా సౌన్దర్యాఖ్యరసాయనమ్ ।
పిబన్త్యప్యద్యహం నాపి నివృత్తా తృష్ణయాఽధునా ॥ 5

అ:— శ్రీలక్ష్మీదేవి అన్యవిషయములపై ఆసక్తిలేని మనస్సుతో ఎల్లప్పుడును చూచుచు, నీ సౌన్దర్యమనే రసాయనమును పానము చేయుచున్నను తనివి తీరనందున ఆమె ఈనాటికిని ఆ ప్రయత్నమునుండి విరమింపలేదు. అనగా అమృతపానమునకన్న అత్యధికమగు ఆనందమును అనుభవించుచున్నదని భావము.

విశేషార్థము :—

'అథావరణ పూజాయాం లక్ష్మీం వామేహరేర్యజేత్ । ధరాన్తు దక్షిణేపార్శ్వే' — ఎడమవైపున లక్ష్మీదేవిని కుడివైపున భూదేవిని పూజింపవలెను - అని శ్రీ జయతీర్థులు (టీకాచార్యులు) వ్రాసిన పద్యమాలికలో చెప్పబడినది.

అవ:— చతుర్ముఖబ్రహ్మ చేసెడిపనిని చెప్పుచున్నాడు.

శ్రీ సున్దర శ్రీనివాస నాభిస్థశ్చతురాననః ।
తవ పాదాంబుజే రమ్యే సౌన్దర్యే లగ్నమానసః ॥ 6

అ:— అతిలోకసుందరుడవగు నో శ్రీనివాసా! చతుర్ముఖుడు ఉత్తమ స్థానమగు నీ నాభికమలమున నున్నవాడైనను, అతిమనోహరమైన నీ పాద సౌన్దర్యమునే చూడదలచి, దానియందే మనస్సుమంచి తదేకదీక్షతో చూచు చున్నాడు.

విశేషార్థము :—

1. శ్రీః నివసతి అస్మిన్నితి శ్రీనివాసః = లక్ష్మీదేవి ఇతనియందే నివాసము చేయుచుండును.

2. శ్రియం నయతీతి శ్రీనిః = లక్ష్మీప్రేరకుడు, ('వామనిర్భామనిః' ఇత్యా[illegible] 'శ్రీనిః' అను పదము). వస్తే = ఆచ్ఛాదయతి సర్వం ఇతి వాసః, లోకే వాసయతీతి వాసః, లోకే వసతి సర్వత్రేతి వాసః అని 'వాస' శబ్దార్థము. 'శ్రీనిశ్చాసౌ వాసశ్చ శ్రీనివాసః' అను వ్యుత్పత్తి వలన శ్రీనివాస శబ్దముచే లక్ష్మీప్రేరకుడును సర్వాంతర్యామియునైన పరమాత్ముడు పిలువబడుచున్నాడు.

3. శ్రియాం నివసతి అంతర్యామితయా = లక్ష్మీదేవియందు అంతర్యామిగా నుండుటచేత శ్రీనివాసుడనబడును.

4. తస్య నాభౌరభూత్పద్మం సౌవర్ణం భువనాశ్రయమ్ ।
పద్మాద్ధిరణ్మయాజ్జాతో బ్రహ్మా తు చతురాననః ।

(గారుడ అ. 20, 49)

— శ్రీహరియొక్క నాభినుండి సువర్ణకమలము జనించెను. అందులో నుండి చతుర్ముఖుడు జన్మించెను.

అష్టనేత్ర్యా దివారాత్రం పశ్యన్ సౌన్దర్యమద్భుతమ్ ।
నాలం నేత్రాష్టకమితి బహురూపీ తదాఽభవత్ ॥ 7

అ :— చతుర్ముఖుడు రేయింబవళ్ళు ఎనిమిది కన్నులతో అత్యాశ్చర్యకరమగు నీ సౌన్దర్యమును చూచుచున్నవాడయ్యు, తనకు ఆ యెనిమిదికన్నులు చాలవనితలచి యనేకరూపములు కలవాడాయెను

కంఠే చ కౌస్తుభం నాభౌ వైకుంఠాదిత్రిధామసు ।
సత్యలోకే చ మేర్వాదౌ సర్వత్ర చతురాననః ॥ 8

అ :— చతుర్ముఖుడు పరమాత్ముని కంఠమున కౌస్తుభమణి రూపము తోడను, నాభికమలమునను, శ్వేతద్వీపము, అనంతాసనము, వైకుంఠము-

అనబడు మూడు స్థానములయందును, సత్యలోకమున, మేరు పర్వతము మొదలగు అన్ని స్థలములయందును ఒక్కొక్క రూపముతో నున్నాడు.

విశేషార్థము :—

1. 'అనంతాసన వైకుంఠ నారాయణ పురాణి తు ।

త్రీణి ధామాని వై విష్ణోః' - శ్వేతద్వీపము, అనంతాసనము, వైకుంఠము అను ఈ మూడును శ్రీమహావిష్ణువుయొక్క మందిరములు. బ్రహ్మాండముయొక్క పగటు విస్తారము ఏబదికోటి యోజనములు.

2. మధ్యభాగే తస్య మేరుః లక్షయోజనముచ్ఛ్రితః —

దాని మధ్య భాగమునందుండు మేరుపర్వతము లక్షయోజనముల పొడవు కలది.

జంబూద్వీపోఽభితో మేరోః పంచాయుతమితః స్మృతః ।

లక్షయోజనవిస్తార ఏవం ద్వీపోఽయముచ్యతే ॥

3. ప్లక్షాది ద్వీపషట్కంతు క్రమాద్ద్విగుణితం మతమ్ ।

పరితో వలయాకారాః సప్తానాం సప్తసిన్ధవః ॥

జంబూద్వీపము లక్షయోజనముల విస్తీర్ణము కలది. ప్లక్షాదులగు ఆరు ద్వీపములు క్రమముగ రెట్టింపు విస్తారము కలవి. ఏడుద్వీపములు లవణాది సప్తసముద్రములు చుట్టుకొనియున్నవి.

4. శ్వేతద్వీపము :—

తత్ర క్షీరాబ్ధిమధ్యే తు ద్వాత్రింశల్లక్షయోజనే ।

శ్వేతద్వీపో హరేర్లోకో ద్విశతాయుతయోజనః ।

శాకద్వీపం సమారభ్య పరితో వలయాకృతిః ॥

ముప్పదిరెండులక్షల యోజనముల విస్తీర్ణముగల క్షీరసాగరముయొక్క మధ్యభాగమున శ్వేతద్వీపమను భగవల్లోకము కలదు. అది శాకద్వీపము నారంభించి చుట్టును వలయాకారముగ యిరువదిలక్షల యోజనముల విస్తీర్ణము కలదైయున్నది.

5. అనంతాసనము :—

పరతోద్విగుణం తస్మాత్ ఘనోదకమితి స్మృతమ్ ।
దధ్యాకారం జలం తత్తు నానాద్వీప సమాకులమ్ ॥

యేషాం మణిప్రకాశేన తమసో నాస్తి సంభవః ।
తత్పరో ఖర్పరం యావత్ అనంతాసనముచ్యతే ॥

లక్షత్రయం యోజనానాం విస్తృతం వలయాకృతిః ।
శ్రీభూదుర్గాత్మకా భాగాః తత్రాపి పరతఃస్థితాః ॥

ఏవం స్థానద్వయం విష్ణోః భూమిష్ఠమివ దృశ్యతే ।
అధస్తాత్ భూమినాశేఽపి తదనైశ్వర్ధి తిష్ఠతి ॥

భూదుర్గాభాగయోస్తత్ర భూమినాశే ప్రణశ్యతి ।
శ్రీభాగో నిత్యఏవాస్తి ముక్తైరేవ నిషేవితః ॥

తమస్సుకంటె రెట్టింపుకలది ఘనోదకము. అందలి నీరు పెరుగుఆకారముతో నుండును. అచ్చటి మణిప్రకాశమువలన చీకటికి అవకాశమే యుండదు. దాని కటువైపున ఖర్పర పర్యంతము అనంతాసనము. మూడు లక్షలయోజనముల విస్తీర్ణము గలిగి వలయాకారముగ నుండును. దానిలో శ్రీభాగము, భూభాగము, దుర్గాభాగమని మూడు భాగములు కలవు. శ్వేతద్వీపము, అనంతాసనము అను రెండు విష్ణుమూర్తి స్థానములు భూమిపైనున్నట్లే కనిపించును. క్రిందనున్న భూమి నశించినప్పటికిని, శ్రీభాగము నశింపదు. భూభాగ, దుర్గాభాగములు భూమి నాశమగునేని నశించును. శ్రీభాగము శాశ్వతముగ నుండును. అది ముక్తులచేతనే సేవింపదగినది. పృథ్వీలోకము నుండి దిగువగా బ్రహ్మాండఖర్పర పర్యంతము ఇరువదియైదుకోట్ల యోజనముల దూరము కలదు.

కోటియోజన గంభీరం తత్రైవ చ ఘనోదకమ్ ।
ఘనోదకాదధస్తాత్తు భూతలం కోటియోజనమ్ ॥

కోటాకోటౌ తతోఽధస్తాత్ జ్ఞేయం పాతాలసప్తకమ్ ।
తతోఽప్యధస్తాత్ సప్తాపి నరకాః రౌరవాదికాః ॥

మనోదకము ఒకకోటియోజనముల లోతుకలది. మనోదకముకంటె క్రింద భూమితలము కోటియోజనముల లోతుకలది. దానికి దిగువన పాతాళలోకము లేడు కలవు. అవి యొక్కొక్కటి కోటియోజనముల లోతుకలవి. వానికన్న క్రిందుగా రౌరవాది నరకలోకము లేడున్నవి. 'భూలోకామూర్ధ్వతో మేరుః ఛత్రాకారస్సురాలయః' భూలోకమునకు పై భాగమున మేరువర్వతమున్నది. అది ఛత్రాకారముగ నుండి దేవతల నివాసమైయున్నది.

6. వైకుంఠము :—

భువర్లోకస్తు భూలోకాదూర్ధ్వతో లక్షయోజనః ।
మహేన్ద్రనగరీ తస్మాత్పంచాశల్లక్షయోజనా ।
తదధ్యర్ధో స్వర్గలోకః తతోధ్యర్ధాః పరేస్మృతాః ॥
మహర్జన స్తపశ్చేతి సప్తలోకా స్త దూర్ధ్వతః ।
భూలోకాత్తు తపో యావద్వైకుంఠం సప్తతః పరమ్ ॥
యావదండకటాహం తదూర్ధ్వమూర్ధ్వవ్యవస్థితమ్ ।
మధ్యభాగః శ్రియస్తత్ర సతులోకః సనాతనః ॥
ముక్తాఏవ రమంతేఽత్ర పునరావృత్తివర్జితాః ।
భూదుర్గా భాగకౌ తత్ర దక్షిణోత్తరతః స్థితౌ ॥
ఆరాధితోఽస్తియైర్విష్ణుః నానాపుణ్యోచ్చయైర్నరైః ।

(విష్ణురహస్యము అ. 39)

భూలోకమునుండి పైనుండు భువర్లోకము ఒకలక్షయోజనములవిస్తీర్ణము కలది. దేవేంద్రనగరము అంతకంటె వేబదిలక్షలయోజనముల విస్తీర్ణమైనది. దానికంటె అర్ధభాగమధికమైనది స్వర్గలోకము. ఇట్లే పై పై లోకములు. మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము - ఇత్యాదులు ఏడు. ఈ యేడు లోకములకంటె పై భాగమున వైకుంఠమున్నది. ఇది భూలోకము

మండి సత్యలోకము వరకున్నంత విస్తీర్ణము కలది. ఇది అండకటాహావర్యం తము వ్యాపించియున్నది. అన్నిలోకములు నొకదానిపై నొకటిగా నున్నవి. పునరావృత్తిలేని ముక్తులు మాత్రమే అక్కడ విహరించుచుందురు. భూభాగ దుర్గాభాగములు దక్షిణోత్తరములందు గలవు. అచ్చటగూడ శ్రీమహావిష్ణువు మహాపుణ్యవంతులచే నారాధింపబడుచుండును. 'అరణ్యాఖ్యౌ సుధాసింధూ విష్ణోర్లోకత్రయేఽపి హి' శ్రీవిష్ణుమూర్తి యొక్క వైకుంఠాది మూడులోకములందును 'అర' 'ణ్య' అనబడు రెండు అమృతసముద్రములున్నవి.

వైజయన్తే సమాసీనమేకాన్తే చతురాననమ్ ।
విష్ణోర్విపిదుమస్తత్వం పర్యపృచ్ఛత్సదాశివః ॥

అను ప్రమాణముచే 'జయన్తం త్వన్తరిక్షగః' అన్నట్లు సదాశివుడు అంతరిక్ష లోకమునందుండు చతుర్ముఖుని తత్త్వముల నడుగుచున్నాడు. ఆ కారణము వలన చతుర్ముఖునికి కూడ జయంతలోకము, సత్యలోకము మరియు మేరు పర్వతము - అను మూడు మందిరములున్నట్లు తెలియుచున్నది. వానిలో మేరుపర్వతము పంచాయతి కోర్టు. అందుండియే బ్రహ్మ ఈ యీ విధముగ మీరు భూమిపై నవతరింపవలెనని ఆజ్ఞాపించుచుండును.

తతః పాదాబ్జసౌన్దర్యరసం చామృతధిక్కరమ్ ।
ప్రీత్యా పాతుమహోరాత్రం అస్వాద్య సుఖభోగినః ॥ 9
తృష్ణా శాన్తాఽధునా నాపి పాదసౌన్దర్యమీదృశమ్ ।

అ :– అమృతమును గూడ ధిక్కరించునట్టి నీ పాదకమలముల సౌన్దర్యమును రేయింబవళ్ళు ఆస్వాదించుచున్నను, బహురూపములను బడసిన తరువాత కూడ బ్రహ్మకు నేటికిని తృప్తి కలుగలేదు. అందలి యభిలాష తీరలేదు. ఇంకను ఎక్కువగుచునేయున్నది. నీ పాద సౌన్దర్యమింతటి మహిమ కలిగినది.

శయ్యాసనాఽఽతపత్రాదిరూపీ త్వత్పాదసేవకః ॥ 10

శేషో బహుసహస్రాక్షః సదాఽనన్తోఽప్యచిన్తయత్ ।
అస్మత్స్వామ్యంఘ్రిసౌన్దర్యం విచిత్రం సుమనోహరమ్ ॥ 11

అదృష్టశ్రుతపూర్వం చ మహాగాఢం విలక్షణమ్ ।
సులక్షణం చ సన్దృశ్యం జగన్మోహనమోహకమ్ ॥ 12

అ :— శయనము (పడక), ఆసనము, ఛత్రము, పాదుకలు ఇత్యాద్య నేక రూపములతో సర్వదా నీ పాదములనే సేవించుచున్న ఆదిశేషుడు అనేక సహస్రనేత్రములతో నీ సమీపమునందే యుండినను మనస్సులో నిట్లుతలచెను. 'మన స్వామియగు శ్రీశ్రీనివాసుని పాదసౌందర్యము అత్యాశ్చర్యకరమైనది, అతిచిత్రమైనది, అతిమనోహరమైనది, ఎచ్చటను కనివిని యెరుగనిది, అతి గంభీరమైనది. అది అసదృశము, అతిగోప్యము, అతిపూజ్యము, జగద్వి లక్షణము, శాస్త్రోక్త సకల లక్షణ సంపన్నము — కావున పరమభక్తితో చూడ దగినది. ప్రపంచమంతటికిని మోహము కలిగించునట్టి మోహనాకృతి గల శ్రీనివాసునకే మోహమును కల్గించునది'.

విశేషార్థము :—

'పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్' అనగా శ్రీరామచంద్రుని, శ్రీకృష్ణుని చూచిన పురుషులు ముగ్ధులై స్తబ్ధులయ్యెడి వారట. పరమశివుడు, మన్మథుడు జగన్మోహకులని ప్రసిద్ధి. వారుకూడ ముగ్ధులై చకి తులై చలితులైనారని గాథలున్నవి.

బహూని మమ నేత్రాణి సమీపే సర్వదా హరేః ।
వాసశ్చేశప్రసాదేన త్వేవం భాగ్యమభూన్మమ ॥ 13

అ :— ఓ స్వామీ! నీ యనుగ్రహముచే సర్వదా నీ సమీపముననేయుండి నీ పాదకమలముల సౌందర్యరాశిని నా యనేక నేత్రములతో చూచుట నా మహా భాగ్యము.

విశేషార్థము :—

ఈ=లక్ష్మీదేవికి, శం=సుఖము, ఆనందము ఎవనివలన కలుగునో అతడు ఈశుడు. అనగా లక్ష్మీదేవికి ఆనందప్రదుడు.

ఇతి సంభ్రమసంయుక్తః సర్వదాఽతిప్రియో హరేః ।
నేత్రైర్బహుసహస్రైశ్చ లక్ష్మీపతిపదాంబుజే ॥ 14
అనఘం చిత్రసౌన్దర్యం దృష్ట్వా దృష్ట్వా పునః పునః ।
మహానన్దామ్బుధౌ మగ్న ఏవం మేనే ఫణీ తదా ॥ 15

అ :— సర్వదా శ్రీహరికి అతిప్రియుడైన శేషుడు మిగుల సంతోషముతో గూడిన త్వరతో లక్ష్మీపతియగు శ్రీ శ్రీనివాసుని పాదకమలముల సాటిలేని విచిత్ర సౌన్దర్యమును అనేక వేల కన్నులతో మరల మరల చూచుచు, మహానన్దసాగరములో మునిగి యీ విధముగా తలంచెను.

వసామ్యహం సదైవాత్ర పాదమూలే చ మత్పతేః ।
వైకుంఠం వా న గచ్ఛామి త్యక్త్వా విష్ణుపదాంబుజే ॥ 16

అ :— నేను నా స్వామియగు శ్రీ శ్రీనివాసుని పాదకమలములను విడిచి వైకుంఠమునకైనను వెళ్ళను. ఇచ్చట శ్రీ వేంకటేశుని పాదమూలమందే ఆసనరూపముగను, శయనరూపముగను, పాదుకారూపముగను మరియు పర్వతాకారముగను శ్రీశుని వాసస్థానముగ నివసించుచుందును.

విశేషార్థము :

'అత్రపాదమూలే' అనుచోట 'అః ఇతిబ్రహ్మ' అని శ్రుతి. 'అకారో వాసుదేవే స్యాత్' అని కోశము. అః=అనగా పరబ్రహ్మ. 'త్రైఙ్ రక్షణే' అను ధాతువననుసరించి త్ర=అనగా సర్వరక్షకుడు. ఈ విధముగా అత్ర=పరబ్రహ్మ స్వరూపుడు సర్వరక్షకుడునగు శ్రీ శ్రీనివాసుని పాదమూలమునందు అని యర్థమేర్పడుచున్నది.

యస్యానన్దో భవేన్నిత్యం పాదసౌన్దర్యదర్శనాత్ ।
వైకుంఠ ఈదృశానన్దః కైవల్యేఽపి న విద్యతే ॥ 17

అ:— నీ పాద సౌన్దర్యదర్శనమువలన నిత్యము నాకు ఏ విధమైన ఆనందానుభవము కలుగుచున్నదో అట్టి సుఖము ఏ కొరతలేని యానంద పరిపూర్ణమైన వైకుంఠమునందు కూడ కలుగదు.

అవ:— శ్రీహరిపాదముల నెప్పుడును విడువకున్నచో శేషునికి పాతాళాధిపత్యము ఎట్లు కుదురును? అని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

పాతాలమాత్రం గన్తవ్యం పాదమూలం యతో హరేః ।
న స్థాస్యామి క్షణమపి యత్సౌన్దర్యామృతం వినా ॥ 18

అ:— పాతాళము శ్రీహరి పాదముల క్రింది భాగము గావున పాతాళ లోకమునకు వెళ్ళినప్పటికిని శ్రీహరి పాదసౌన్దర్యమును గ్రోలెదనుగాని హరిపాదములను విడిచి క్షణకాలమైనను ఉండలేను. 'పాతాలమేతస్య హి పాదమూలమ్' అని ప్రమాణము.

ఇతి నిశ్చిత్య నాగేన్ద్రః పాదసౌన్దర్యమోహితః ।
యత్ర యత్రేన్దిరేశస్య పాదమూలం ప్రవర్తతే ॥ 19
తత్ర తత్ర సదా పాదసౌన్దర్యామృతపాయ్యభూత్ ।

అ:— ఇట్లని నిశ్చయించి నాగులకధిపతియగు శేషుడు పాదముల యొక్క సౌన్దర్యముచే మోహితుడై ఎక్కడెక్కడ రమాపతి పాదమూలము ప్రవృత్తమగుచుండునో (కానబడుచుండునో) అక్కడక్కడే తిరుగుచు, ఎల్లప్పుడు పాదసౌన్దర్యామృతపానముచేయువాడయ్యెను.

అవ:— పాదసౌన్దర్యమును శివుడు భావనచేసిన విషయ మిక చెప్పబడుచున్నది.

అథాచిన్తయదేవం హి శంకరో లోకశంకరః ॥ 20

అ:— శ్రీ శ్రీనివాసుని పరమమంగళరూపమగు పాదసౌన్దర్యమును గురించి లోకశంకరుడైన శంకరుడీ క్రింది రీతిగా నాలోచించెను.

విశేషార్థము:—

యద్ద్వారి మత్తమాతంగాః వాయువేగాస్తురంగమాః ।
పూర్ణేందువదనాః నార్యః శివపూజావిధేః ఫలమ్ ।

ఇత్యాది ప్రమాణములవలన శివపూజవలననే సర్వేష్టసిద్ధులగుచుండగా శివుడు శ్రీమన్నారాయణుని గుణమహిమావర్ణనమును భక్తితో చేయుచున్నా డనగా నదియెంత విశిష్టమైనదో వినుడు.

శేషస్య కిమహో భాగ్యం శేషాగేశప్రసాదజమ్ ।
బహునేత్రాభి ర్యత్పాదసౌన్దర్యామృతసేవనమ్ ॥ 21

అ:— శేషపర్వతాధీశుడైన శ్రీ శ్రీనివాసునియనుగ్రహముచే ఆ భగవంతుని సమీపముననే యుండి అనంత నేత్రములతో ఆ దేవదేవుని పాద సౌందర్యామృతమును సేవించుచున్న శేషదేవుని భాగ్యము ఎంత గొప్పది!

విశేషార్థము:—

'న గచ్ఛతీతి అగః' చలనములేని పర్వతము (శేషపర్వతము).

ఏతద్ద్వయం దుర్లభం మే త్రినేత్రత్వాదహో బత ।
భావిజన్మని శేషత్వప్రాప్త్యర్థం వా మహత్తపః ॥ 22
కరోమీత్యతివైరాగ్యాత్ శంభుః కైలాసగోఽభవత్ ।

అ:— 'నాకు మూడే నేత్రములుండుట వలనను, వేంకటేశునికి దూరముగా కైలాసమున నుండుటచేతను, ఆదిశేషునకు గల అనంత నేత్రత్వము, శ్రీ స్వామివారి సమక్షమందే యుండుట — అనెడు రెండు భాగ్యములు దుర్లభములైనవి. ఎంతటి కష్టము! అందుచే రాబోవు జన్మలోనైనను నాకు శేషపదవి లభింపవలయునని గొప్పతపస్సు చేయుదును' అని తలంచి అతి వైరాగ్యముతో రుద్రుడు కైలాసమున కేగెను.

అవ:— పాదసౌందర్యమును ఇంద్రుడు భావనచేసిన విషయము —

శ్రీవేంకటేశేన్ద్రిరేశ జిష్ణుస్తవ ముఖాంబుజాత్ ॥ 23
జాతస్సహస్రనయనోఽప్యేవం తవ పదాంబుజే ।
అదృశ్యాశ్చర్యసౌందర్యం సంపశ్యన్నప్యహర్నిశమ్ ॥ 24

ఇత్యచింతయదత్యన్తం పాదసౌందర్యమోహితః ।
అమృతస్య పురా పానే మే నాభూదీదృశం సుఖమ్ ॥ 25

అ :— వేంకటాచలాధిపతియు, లక్ష్మీపతియునగు శ్రీ వేంకటేశా! సర్వ వ్యాప్తమైన నీ ముఖకమలమునుండి పుట్టిన దేవేంద్రుడు వేయికన్నులు కలవాడయ్యును, చూచుటకు దుర్లభము, అత్యాశ్చర్యకరమునగు నీ పాద కమలముల సౌందర్యమును రేయింబవళ్ళు చూచుచున్నను, ఆ సౌందర్యముచే మిక్కిలి మోహితుడై 'పూర్వము అమృతపానము చేసినప్పుడుకూడ నాకిట్టి సుఖము కలిగియుండలే' దని తలంచెను.

విశేషార్థము :—

'జిష్ణుర్లేఖర్షభః' అను కోశమును బట్టి సర్వత్ర జయశీలుడైన దేవేంద్రుడు 'జిష్ణు'వనబడును. తన రూపబలైశ్వర్యములచే నందరిని జయించువాడని అర్థము. అట్టి వాడు 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చ' అను శ్రుతిచే 'భగవన్ముఖము నుండి పుట్టె' నని చెప్పబడెను. అంతటి యింద్రుడు సైతము భగవంతుని పాదసౌందర్యముచే ఆకర్షితుడై ముగ్ధుడాయెనని భావము.

సౌందర్యమతిసామీప్యదోషాత్ సమ్యఙ్ న దృశ్యతే ।
ఇతోఽప్యతిశయానందః కించిద్వ్యవహితే భవేత్ ॥ 26

అ :— కనుబొమ్మలు కంటికి అతిసమీపమున నుండినను ఎట్లు కనిపించవో అట్లే అతిసామీప్యమను దోషమువలన పాదసౌందర్య దర్శనము సుఖముగా కలుగదు. అంతకంటె కొంతదూరమున నుండినచో అధికానందము కలుగును.

అతః స్వర్గస్థోఽనిమిషస్తావన్నేత్రై రహర్నిశమ్ ।
వీక్ష్య యావదలంబుద్ధిః తతో మత్స్థానమావ్రజేః ॥ 27

అ :— ఇట్లనుకొని అత్యాదరముతో ఇంద్రుడు స్వర్గలోకములో నుండు కొని అహర్నిశలు రెప్పపాటు లేకుండ నీ పాదసౌందర్యమును వేయికన్నులతో

చూచుచు 'ఇకచాలు ననిపించువరకు చూచెదను. అటు పిమ్మట నా స్థాన మగు స్వర్గలోకమునకు వెళ్ళెదను' అని తలచెను

**విశేషార్థము :—**

'అనిమిషా వై దేవాః' అను శ్రుతివలన దేవతలకు రెప్పపాటులేదని తెలియుచున్నది.

ఇతి స్వర్గగతస్యాపి యావన్నేత్రైః శ్రియఃపతే।
త్వత్తేజఃపుంజపాదాబ్జ సౌన్దర్యామృతపాయినః॥ 28
తృష్ణా శాన్తాఽధునా నాపి తస్మాత్ స్వర్గే స్థిరా స్థితిః।

అ :— లక్ష్మీపతియగు వేంకటేశా! స్వర్గలోకమునకు వచ్చి వేయి కన్నులతో నిత్యము తేజోవంతమైన నీ పాదసౌందర్యామృతపానము చేయు చుండినను, ఇప్పటికిని నా యభిలాష తీరనందున, ఇచ్చటనే యున్నాను. ఈ కారణముచే నాకు స్వర్గమే స్థిరనివాస మైనది.

శ్రీశ తే పాదసౌందర్యం లేఖానాం మహతామపి॥ 29
యద్యేవం దుర్లభమభూత్ ఇతరేషాం తు కా కథా।

అ :— ఓ లక్ష్మీపతీ! నీ పాదసౌందర్యము ఉత్తమాధికారులైన ఇంద్రాది దేవతలకే యింత దుర్లభమైనచో తదితర దేవతలకును, నావంటి సామాన్యు లకును దుర్లభమని (తెలియ నలవికానిదని) చెప్పవలెనా!

విశేషార్థము :—

1. శ్రియః శం యస్మాత్ శ్రీశః = లక్ష్మీదేవికి సుఖప్రదుడు. మరియు శ్రియః ఈశః = లక్ష్మీపతి అని యర్థము.

2. 'ఆదితేయా దివిషదో లేఖా అదితినందనాః' అని కోశము. లేఖాః = దేవతలు.

అవ :— పాదములయందుండు రేఖల మహిమలను చెప్పుచున్నాడు.

**విష్ణో తే పాదరేఖాణాం మాహాత్మ్యం లోకపావనమ్ ॥ 30**
**విజ్ఞాపనం కరిష్యామి హ్యపరాధం క్షమస్వ మే।**

**అ :—** ఓ విష్ణుమూర్తీ ! నీ పాదరేఖలమహిమ అన్నిలోకములను పావనము చేయగలిగినది. ఆ విషయమును కొంత విన్నవించుకొనెదను. నా అపరాధమును క్షమింపుము.

విశేషార్థము :—

1. 'విష్ వ్యాప్తౌ' అను ధాతువునుండి విష్ణుశబ్దము పుట్టినది. సర్వమును వ్యాపించియున్నందున 'విష్ణు' వనబడెను.

2. 'విశ ప్రవేశనే' అను ధాతువు ననుసరించి సర్వమును వ్యాపించినవాడనియర్థము. అనగా త్రివిక్రమరూపముతో మూడడుగులచే సర్వజగత్తును ఆక్రమించుకొనెనని భావము.

అవ : శ్రవణ - మనన - ధ్యాన క్రమములో శాస్త్రశ్రవణజన్యఫలమును ఇయ్యగల్గిన చక్రరేఖా మాహాత్మ్యమును చెప్పుచున్నాడు.

పాదమాహాత్మ్యశ్రోతౄణాం భక్తానాం భక్తవత్సల ॥ 31
మహాఽజ్ఞానతమో భిత్త్వా కృత్వా జ్ఞానప్రకాశనమ్।
త్వన్మార్గదర్శనార్థాయ చక్రరేఖాం పదేఽధరః ॥ 32

అ :— భక్తవత్సలుడవగు నో శ్రీనివాసమూర్తీ! నీ పాదమహిమను విను భక్తులకు గొప్ప అజ్ఞానమను అంధకారమును పోగొట్టి, జ్ఞానమనబడు ప్రకాశమును కల్పించి, నిన్ను చేరుటకు మార్గమైన వైకుంఠమును చూపుటకు లేక బ్రహ్మజ్ఞానము నొసంగుటకు పాదములందు చక్రరేఖను ధరించియున్నాడవు.

విశేషార్థము :—

1. 'భక్తం అన్నం యేషామస్తీతి భక్తవంతః,
భక్తవతః సలతీతి భక్తవత్సలః'

యజ్ఞములను చేయగలవారి ననుగ్రహించుటకొరకు వారల సమీపమునకుపోవువాడగుటవలన భక్తవత్సలుడనబడును. భక్తులందు విశేష ప్రీతిగలవాడు.

2. భక్తా ఏవ వత్సాః తాన్ లాతి = భక్తులవబడు బిడ్డలను వ్యకీయులనుగా స్వీకరించువాడు.

3. సుదర్శనమహాజ్వాల కోటిసూర్యసమప్రభ ।
అజ్ఞానాంధస్య మే నిత్యం విష్ణోర్మార్గం ప్రదర్శయ ॥
అను స్మృతి ఇందులకు ప్రమాణముగా నున్నది.

అవ :— మననజన్య ఫలము నిచ్చునట్టి శంఖరేఖామహిమను చెప్పుచున్నారు.

పాదమాహాత్మ్య మన్త్రాణాం సాంగవేదచతుష్టయమ్ ।
ఇతిహాసపురాణాని మంత్రోపనిషదాత్మకాః ॥ 33
సర్వవిద్యా దదామీతి దరరేఖాం వదేఽధరః ।

అ :— నీ పాదమహిమలను మననము (ఎల్లప్పుడు స్మరించుట) చేయువారికి షడంగసహితములగు నాలుగువేదములను, శిక్ష - వ్యాకరణము - ఛన్దస్సు - నిరుక్తము - కల్పము - జ్యోతిషము అనెడు ఆరు వేదాంగములను, భారతాది ఇతిహాసములను, అష్టాదశ పురాణములను, మహామంత్రములను మరియు ఉపనిషత్తులను మున్నగు సమస్తవిద్యలను అనుగ్రహించెదనని తెల్పు నిమిత్తము పాదములో శంఖరేఖను ధరించియున్నావు.

విశేషార్థము :—

1. 'శిక్షా కల్పో నిరుక్తం చ ఛందో వ్యాకరణం తథా జ్యోతిషమ్ '- ఇతి షడంగాని.

2. ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వంచార్థశాస్త్రకమ్ ॥
చతుర్ణాముపవేదాంశ్చ - అను నాలుగు ఉపవేదములు.

3. పూర్వము వివరింపబడిన బ్రాహ్మాది పదునెనిమిది పురాణములు.

4. బ్రాహ్మణములు, ఉపనిషత్తులు - అనునవి మంత్రభేదములు.
'వేదశిరోఽఖిలా ' అని స్మృతి.

5. శ్రీహరిని కీర్తింపవలెనను కోరికగల—అజ్ఞానియగు ధ్రువబాలకుని కపోలమునందు శంఖముతో స్పృశించినంతనే తత్క్షణము మహాజ్ఞానియై ధ్రువుడు స్తోత్రము చేయగలిగెను - అని భాగవతము చతుర్థస్కంధమున చెప్పినరీతినను సరించి శంఖమునకు స్తోత్రేచ్ఛా దాతృత్వము ప్రసిద్ధముగా నున్నది.

6. సత్యాయుషి శరీరస్య నానారోగనివృత్తయే ।
ఆయుర్వేదం వితేనే నః హ్యగ్నివేశ్యాదిభిర్భువి ।
నానాశస్త్రైః యుద్ధసిద్ధ్యై ధనుర్వేదమనాతనోత్ ।
రాజ్ఞాం చ ధనికానాం చ మనోరంజనసిద్ధయే ।
గాంధర్వం వ్యతనోద్యత్ర గీతం వాద్యం చ నర్తనమ్ ।
పాకక్రియా గజాశ్వాది నానాకర్మ ప్రసిద్ధయే ।
లోకానాం వ్యవహారాయ నానాశిల్పప్రసిద్ధయే ।
రాజనీత్యై దండనీత్యై అర్థశాస్త్రమిహాతనోత్ ।

విష్ణురహస్యము, అధ్యా. 35, శ్లో. 38-41

అవ :— ధ్యానఫలము నిచ్చు గదారేఖను వర్ణించుచున్నాడు.

పాదమాహాత్మ్యధ్యాతౄణాం ఉపద్రవకరాన్ ఖలాన్ । 34
దైత్యరక్షఃపిశాచాదీన్ కూష్మాండబ్రహ్మరాక్షసాన్ ।
సంచూర్ణయామీతి హరే గదారేఖాం పదేఽధరః 35

అ :— భక్తుల సర్వారిష్టములను హరించునట్టి యో శ్రీహరీ! నీ పాద మాహాత్మ్యమును ధ్యానించువారికి ఉపద్రవము కలిగించునట్టి అతిదుష్టులైన దైత్యులను, రాక్షసులను, పిశాచములను, కూష్మాండులను మరియు బ్రహ్మ రాక్షసులను బాగుగ చూర్ణముచేయుదునని (నాశనము చేయుదునని) తెలియ జేయుటకై పాదములో గదారేఖను ధరించియున్నారవు.

విశేషార్థము :—

1. గదేఽశని స్వర్ణన విస్ఫులింగే
నిష్పింఢి నిష్పింధ్యజితప్రియాసి ।

కూష్మాండ వైనాయక యక్ష రక్షో
భూతగ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్ ॥
భాగవతము స్కం.6, అధ్యా. 8, శ్లో 24

ఈ భాగవత శ్లోకము పైన జెప్పబడిన మూలశ్లోకము ననుసరించి యున్నది.

2. 'హరతీతి హరిః' - పాపములను హరించువాడు. దుష్టులైన దైత్యాదులను సంహరించువాడు.

3. పిశాచ భూత కూష్మాండాః ప్రేతాశ్చాండాల జాతయః ।
ఘంటాకర్ణః పిశాచేశో భూతేశో భైరవః స్మృతః ॥
కూష్మాండేశో భృంగిరుక్మి ప్రేతాధీశః తథోల్ముకః ।
బ్రహ్మరాక్షసవేతాళాః నానాజాత్యాః ప్రకీర్తితాః ॥
క్రవ్యాదాః శోణితాऽऽహారాః యాతుధానాః తథాऽపరే ।
మాతరః పూతనాద్యాశ్చ శాకిన్యో డాకినీగణాః ।
మలరక్తసురాపాశ్చ నానాజాత్యాః ప్రకీర్తితాః ॥
విష్ణురహస్యము, అధ్యా 35, శ్లో. 19,22,27,28.

అవ :- ప్రవచన ఫలమునిచ్చు పద్మరేఖను ఎర్షించుచున్నారు.

పాదమాహాత్మ్యవక్తౄణాం ఉత్తమే మందిరే సదా ।
పద్మయా భార్యయా సాకం పద్మజేన సుతేన చ ॥ 36
కుటుంబీ పద్మనాభోऽహం వసామీత్యేవ సూచయన్ ।
పద్మరేఖాం పాదపద్మే పద్మేశ త్వం ధరన్నసి ॥ 37

అ:— ఓ లక్ష్మీపతీ! పద్మనాభుడవగు నీవు నీ ప్రియురాలగు లక్ష్మీదేవితోను, నీ పుత్రుడగు పద్మగర్భుడైన బ్రహ్మతోను, వాయుదేవునితోనుకూడి సకుటుంబముగా 'నా పాదమాహాత్మ్యమును వచించువారి యుత్తమమైన మందిరములలో నివసించెదను' అని సూచించుటకొరకై నీ పాదపద్మములో పద్మరేఖలను దాల్చియున్నాడవు.

విశేషార్థము :—

1. 'పద్మం నాభౌ యస్య' పద్మనాభః = నాభిలో పద్మముకలవాడు.

2. పదయోర్మా యస్య పద్మః = పాదములో లక్ష్మిని కలవాడు.

న విద్యతే అభా యస్య నాభః = అప్రకాశమనునది లేనివాడు.

పద్మశ్చాసౌ నాభశ్చ, పద్మనాభః

3. పద్మం నయతీతి పద్మనః = కమలములను వికసింపజేయు సూర్యుడు.

పద్మనస్య ఆభేవ ఆభా యస్య సః = సూర్యుని కాంతి వంటి కాంతి గలవాడు.

4. వద్మం నాభౌ యస్య = నాభిలో చతుర్ముఖాసనమగు వద్మముకలవాడు.

5. పదం మన్యత ఇతి వద్మనాః = భగవత్ స్వరూపమును తెలిసికొనిన భగవద్భక్తులు. తాన్ ప్రతి ఆభాతి = వారికి తనస్వరూపమును చూపించువాడు.

6. 'లక్ష్మీః పద్మాలయా పద్మా' అనుకోశమునుబట్టి వద్మా = లక్ష్మీదేవి.

అవ:— మరొకరీతిని వద్మరేఖను వర్ణించుచున్నాడు.

విరజా మానససరో ధనుష్కోటీ మహాఘహృత్ ।
గంగాదిసర్వతీర్థాని త్వత్పాదాబ్జే వసంతి హి ॥ 38

అ :— మహాపాపములను వరిహరించునట్టి విరజాతీర్థము, మానస సరోవరము, ధనుష్కోటి మరియు గంగాది సకలతీర్థములు నీ పాదపద్మములో నివసించు చున్నవి—అని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి.

సహస్రపత్రపూర్వాణి జాయన్తే తేషు నిత్యశః ।
ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నసి ॥ 39

అ :— ఆ తీర్థములలో నిత్యము వేయిరేకులుగల ఎఱ్ఱతామరలు, కలువలు మొదలగు వుష్పములు పుట్టుచున్నవని సూచించుటకు నీవు పాదమువందు పద్మరేఖను ధరించియున్నావు

అవ: పద్మములో లక్ష్మీదేవియొక్క సన్నిధానముండుటవలన దేవశర్మ లక్ష్మీదేవిచే ప్రేరితుడై పద్మమహిమను చెప్పుచున్నారు.

పద్మా హృత్పద్మసంస్థాఽపి పాదపద్మస్య మూలగా ।
పశ్యంతీ నేత్రపద్మాభ్యాం త్వత్సౌందర్యమలౌకికమ్ ॥ 40

ధ్యాయంతీ చ స్వహృత్పద్మే త్వన్మాహాత్మ్యం శ్రుతీరితమ్ ।
భజంతీ కరపద్మాభ్యాం స్వాంకేఽర్పవకరీ సదా ॥ 41

ఇతి సూచయితుం పాదే పద్మరేఖాం ధరన్నపి ।

అ:— ఓస్వామీ! నీవక్షఃస్థలమువందే యుందునట్టి పద్మరూపము, పద్మనామకురాలును అయిన శ్రీలక్ష్మీదేవి నీ పాదపద్మములందు పద్మాత్మకురాలై లోకవిలక్షణమైన నీపాదసౌందర్యమును తననేత్రపద్మములతో ఎల్లప్పుడు చూచుచున్నది. శ్రుత్యాదులచే ప్రతిపాదింపబడిన నీ పాదమాహాత్మ్యమును తనహృదయములో ఎల్లప్పుడును ధ్యానించుచున్నది. తనతొడలపై నీ పాదములనుంచుకొని తన కరపద్మములచేత సదాపూజించు చున్నది. ఈ విషయమును సూచించుటకే పాదములో పద్మరేఖను ధరించియున్నావు.

అవ: పాదమహిమను వ్రాసి ఆ పుస్తకమును దానమిచ్చినవారికి ఫలమునిచ్చునట్టి వజ్రరేఖను వర్ణించుచున్నారు.

పాదపంకజమాహాత్మ్యం లిఖిత్వైవ స్వహస్తతః 42

దాతౄణాం వైష్ణవాగ్ర్యేభ్యో మహాఘౌఘాద్రిభేదనమ్ ।
కరోమీతి జ్ఞాపనాయ వజ్రరేఖాం పదేఽధరః ॥ 42

అ:— 'పాదపద్మముల మాహాత్మ్యమును తమ చేతులతోనే వ్రాసి ఆ పుస్తకమును విష్ణుభక్తోత్తమత్వజ్ఞానివరేణ్యులైన హరిభక్తులకు దానముచేసిన వారియొక్క బ్రహ్మహత్యాదిమహాపాపములరాశియనబడు పర్వతములను భేదింపగలను'— అని సూచించుటకే పాదములో వజ్రరేఖను ధరించియున్నావు.

విశేషార్థము :—

బ్రహ్మహత్యాదిపాపములు అతిసూక్ష్మములు కావు. పెద్ద కొండల వంటివి. ఇంద్రుడు తన వజ్రాయుధముచే అనేక పర్వతముల రెక్కలను ఛేదించెను. అందువలన కొండలను వజ్రముతోనే ఛేదింపదగును. వేరొక దానితో కాదు. ఎన్నోకొండలతో సమానములైన బ్రహ్మహత్యాదిపాపములను చేసియుండినను భగవంతునిపాదమహిమలుగల పుస్తకమును తనచేతుల తోవ్రాసి దానమిచ్చిన, అంతటిమహాపాపములనుండి విముక్తికలుగును.

అవ: అర్చనకు ఫలమునిచ్చునట్టి అంకుశరేఖను వర్ణించుచున్నాడు.

మాహాత్మ్యమర్చకానాం తు గజాన్ కామాదిసంజ్ఞితాన్ ।
అదమ్యాన్ దమయామీతి హ్యంకుశాఖ్యాం పదేఽధరః ॥ 44

అ:— నీపాదములను పూజించునట్టి భక్తులకు, నిగ్రహించుటకు సాధ్యము కాని కామక్రోధాదులనబడు మదోన్మత్తములైన గజములను నిగ్రహించుదును — అని తెలుపుటకై పాదములో అంకుశరేఖను ధరించియున్నావు.

విశేషార్థము :—

శిక్షించుటకు, నిగ్రహించుటకు, అశక్యములగు మదపుటేనుగులు అంకుశములకును, దండములకును లొంగిపోగలవు. అటులనే మనకు కామ-క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యములు విడిచిపెట్టుట కసాధ్యములు. అయితే శ్రద్ధాభక్తులతో భగవంతుని నర్చించువారియందీ దోషములు వాటంతట అవే స్వయముగా నశించిపోవును.

అవ:— పాదమహిమను ఆసక్తితో విని సంతోషించు వారలకు ఫలమునిచ్చు ధ్వజరేఖను వర్ణించుచున్నాడు

శ్రుత్వాఽఽదరేణ సంతుష్టాన్ భక్తాన్ ధ్వజవదుచ్ఛ్రితాన్ ।
కరోమీతి జ్ఞాపనాయ ధ్వజరేఖాం పదేఽధరః ॥ 45

అ:— నీ పాదమహిమలను శ్రద్ధాసక్తులతో విని సంతోషించు భక్తులను

'ధ్వజస్తంభమువలె మన్నతస్థితికి తేగలవ' ని సూచించుటకై పాదములో ధ్వజ రేఖలను ధరించియున్నావు.

విశేషార్థము :—

జాతి - గోత్ర - ద్రవ్య - పుత్ర - మిత్ర - కళత్రాదులతో, సమానులగు జనులలో నధికునిగాను, భగవత్ప్రసాద విషయములో ఉత్తమునిగాను - అనగా అందరికంటె వెక్కువగా భగవదనుగ్రహమునకు పాత్రుడగువట్లు చేయునని భావము.

అవ : అనంతములగు వేదములకైనను వర్ణింపనలవికాని శ్రీనివాసుని పాదముల మహిమను ఎంతని చెప్పనగును? ఎవరికిని సాధ్యము కాదు గనుక యథాశక్తిగ వచించి యుపసంహరించుచున్నాడు :—

అబగ్నీరనభోఽహం కృన్మహత్తత్త్వగుణత్రయైః ।
క్రమాద్దశగుణైరండమావృతం పరమాద్భుతమ్ ॥ 46
యన్నఖాగ్రాద్వినిర్భిన్నం త్వత్పాదం కోఽనువర్ణయేత్ ।

అ :— గోళాకారముగా నుండు బ్రహ్మాండమునకు వెలుపలి భాగమునందు జల - అగ్ని - వాయు - ఆకాశ - అహంకారతత్త్వ - మహత్తత్త్వాద్యావరణములు, సత్త్వ - రజ - స్తమో గుణావరణములు - అని తొమ్మిదియావరణములు కలవు. ఈ యావరణములు ఒకదానికంటె నొకటి పదిరెట్లు అధికవైశాల్యము కలవి. ఓ శ్రీహరీ! ఇంత దృఢమైన బ్రహ్మాండకటాహము కేవలము నీ కాలివ్రేలి కొనగోటి స్పర్శమాత్రము చేతనే బీటలువారినది! అంతటి మహిమగల నీ పాదమును ఎవడు వర్ణింపగలడు!

విశేషార్థము :—

1. ఏబదికోట్ల విస్తీర్ణముకలది భూమండలము. దానికంటె పదిరెట్లు అధికమైనది జలావరణము. దానికంటె పదిరెట్లు గుణాధిక్యము కలది తేజస్సు ఆవరణము. దానికంటె పదిరెట్లు గుణాధికము వాయ్వావరణము. దానికంటె పదిరెట్లు ఆకాశావరణము. దానికంటె పదిరెట్లు మహత్తత్త్వము.

దానికంటె పదిరెట్లు సత్త్వగుణము. దానికంటె పదిరెట్లు రజోగుణము. దానికంటె పదిరెట్లు తమోగుణావరణము. ఇట్లు క్రమ క్రమముగా ఒకదాని కంటె నొకటి పది పది రెట్లు గుణాధికమైయున్నవి. బ్రహ్మాండము ఈవిధమగు ఆవరణములచే చుట్టబడియున్నది. ఈవిషయము భాగవతాదులలో విశదముగా వర్ణితమైనది. (అయిదవ స్కంధము)

2\. పూర్వఖర్పరతః ప్రత్యక్ ఖర్పరాంతం తథోత్తరాత్ ।
ఖర్పరాద్దక్షిణాంతం చ మండలాకారతః స్థితమ్ ॥
ఘనోదకం స్యాత్ విస్తావత్ సముద్రైవ సంశ్రితమ్ ।
తదంతర్మండలాకారం తమశ్చ సముదీరితమ్ ।
ద్విస్తావత్ పృథివీత్యుక్తం పృథుత్వాత్ శ్రుతిమస్తకే ॥
తదంతర్మండలాకారం భూశ్చైవం సముదీరితా ।
పృథివీ సముద్రపత్యన్తేత్యుక్తా యా విప్రమండలే ।
మధ్యే సౌవర్ణగిరిణా మేరుణా సప్తభిః క్రమాత్ ॥
ద్వీపైః సముద్రైశ్చయుతా మండలాకారతః స్థితైః ।
పంచాశత్కోటి విస్తీర్ణం మిలిత్వైతత్ త్రయం కిల ॥

(ఈ శ్లోకములు శ్రీమద్వాదిరాజతీర్థులు వ్రాసిన 'భూగోళవర్ణన' మను గ్రంథమందలివి) ఇత్యాదులవలన బ్రహ్మాండవిషయములు మిక్కిలి విశదముగా తెలియనగును.

అవ : పద్మావతీ వేంకటేశ్వరుల లీలాప్రకారమును స్తుతించుటకు ఉపోద్ఘాతమును చెప్పుచున్నారు–'చిన్తాం ప్రకృత సిద్ధ్యర్థాం ఉపోద్ఘాతం విదుర్బుధాః' ప్రకృతమైన అర్థ సిద్ధికి ఉపయుక్తమైన విచారము ఉపోద్ఘాతమనబడును.

శేషో మహత్తపస్తప్త్వా త్వామారాధ్య జగత్పతిమ్ ॥ 47
త్వత్ప్రసాదాన్మహాభాగ్యం యద్యప్యాప సుదుర్లభమ్ ।
శయ్యాసనం పాదుకే చ హ్యతపత్రమభూత్తవ ॥ 48

అ :— జగత్పతియైన విష్ణుగురించి మహాతపస్సుచేసి విష్ణ్వారాధించిన శేషుడు నీ యనుగ్రహమువలన గరుడ–రుద్ర–ఇంద్రాదులకైనను లభ్యముకాని భాగ్యమును నీయొక్క శయ్య, ఆసనము, పాదుకలు, ఛత్రము అనునాలుగు రూపములతో నిన్ను ఎల్లప్పుడు సేవించుటద్వారా పొందుచున్నాడు. ఇది అత్యాశ్చర్యకరము !

తత్సుఖం తు రమా దృష్ట్వా మేనే శేషైకభాజనమ్ ।
అహమేవానుభోక్ష్యామి మత్పతేరంగజం సుఖమ్ ॥ 49

అ :— భగవత్సేవ వలన శేషునికి కలుగుచున్న సుఖాతిశయమును చూచిన లక్ష్మీదేవి 'నాపతియొక్క అంగ సంగమువలన కలిగెడు సుఖమును శేషుడు మాత్రమే అనుభవించుటయా? నేనే దానిని అనుభవింతును' అని తలంచినది.

విశేషార్థము :—

ఛత్రరూపముతోనని చెప్పుట వలననే 'శ్రీనివాసుని శిరస్సుమొదలుకొని పాదపర్యంతము ఛత్రము (గొడుగు) యొక్క నీడగానుండుట ద్వారా కలుగు శ్రీహరి సంపర్కముచే లభించు సుఖము'— అని సామాన్యముగా తెలియుచుండగా, మరలపాదుకారూపముదాల్చి యని చెప్పుటవలన 'చ' శబ్దముతో శయన– ఆసనరూపములతోను, తన పతియొక్క పాదాద్యవయవముల స్పర్శముచే ఏ యే సుఖము ప్రాప్తించునో దానినంతను తానే అనుభవింప వలెనని లక్ష్మీదేవి తలంచినదని తాత్పర్యము.

ఆతపత్రేణ యత్ప్రాప్యం పాదుకాభ్యాం చ యత్సుఖమ్ ।
సర్వం భాగ్యం మమైవస్యాదితి వక్షఃస్థితాఽపి సా ॥ 50

అ :— భగవంతుని వక్షఃస్థలమునందు నిత్యము వసించుచున్నదైనప్పటికిని లక్ష్మీదేవి ఛత్రపాదుకల రూపములుగా నుండుటచే ఎట్టిసుఖము కలుగునో, ఆ సుఖమంతయు తనకే కలుగవలయునని తలంచెను.

వైకుంఠాదిషు లోకేషు చతుర్దశసు వై తథా ।
బ్రహ్మాండాంతర్బహిశ్చాపి సర్వహృత్కమలేష్వపి ॥ 51

అ :— మఱియు లక్ష్మీదేవి ముక్తములైన వైకుంఠాది మూడులోకములందును, అముక్తములైన భూరాది పదునాల్గు లోకములయందును, బ్రహ్మాండము లోపల, వెలుపలను, అందరి హృదయకమలములందును భగవంతునితో నుండెదనని తలంచెను.

విశేషార్థము :—

భూః భువః సువః మహః జనః తపః సత్యం — అని పైలోకములేడును, అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములని క్రింది లోకములు ఏడును కలిసి పదునాల్గు లోకములు.

సంస్థితో భగవాన్యత్ర వసేఽహం తత్ర తత్ర హి ।
క్రీడావనమభూన్మందవాయుగంధాదిరంజితమ్ ॥ 52

అ :— భగవంతు డెక్కడెక్కడ నుండునో ఆయా చోట్లన్నిటను నేనే ఆయావస్తురూపములతో నుండెదనని తలచి, లక్ష్మీదేవి మహాపరిమళభరితమైన మందవాయువుగను, సుగంధము, చిగురుటాకులు, కస్తూరి, కర్పూరాదులతో నలంకృతమైన నందనవనాది క్రీడావనముగను ఆయెను.

అవ : క్రీడావన మెట్లుండెననగా—

మల్లికాకేతకీజాతీచంపకాకుసుమాన్వితమ్ ।
ఖర్జూరపనసద్రాక్షా కదలీనారికేలకైః ॥ 53

బదరీమాతులంగైశ్చ కపిత్థైశ్చూతదాడిమైః ।
జంబూజంబీరక్రముకప్రముఖైః ఫలదాయకైః ॥ 54

పారిజాతైః కల్పవృక్షైరత్నవస్త్రఫలదాయకైః ।
శ్రీచందనవృక్షమందారైః సంకులం మధుకాదిభిః ॥ 55

**అ :—** మల్లె, మొగలి, జాజి, సంపెంగ, మొల్ల మొదలగు పతిపరిమళము గల పుష్పములతో గూడిన పూదీగలుగను, ఖర్జూర, పనస, ద్రాక్ష, అరటి, టెంకాయ, రేగు, మాతులుంగము (మాదీఫలము), మాదాళము, వెలగ, మామిడి, దానిమ్మ, వేరేడు, నిమ్మ, పోక మొదలగు వృక్షములుగను, నిత్యము పుష్పఫలభరితములగు పారిజాతము, కల్పవృక్షము, శ్రీచందనము, మందారము మొదలగు వృక్షములుగను, మిక్కిలి రసభరితములగు మధూకము, చెఱకు మొదలగు వృక్షములుగను తానేఅయి శ్రీలక్ష్మీదేవి వీటన్నిటితోకూడిన సుందర క్రీడావనముగా నుండినది.

విశేషార్థము :—

వసంతాది షడృతువులలోను సకలజాతులకు చెందిన ఫలములు, పుష్పములు కలుగునట్టి చెట్లుండుటవలన సంవత్సరంతు వెలలయందును ఆవనములో ఫలపుష్ప సమృద్ధి కలిగియుండును. ఇట్లే అన్నితోటలందును అన్ని జాతులచెట్లుండినవి.

తస్మిన్ సరః స్వచ్ఛనీరం స్వర్ణసోపానమండితమ్।
నవరత్నాభకమలైః సువర్ణాభకుశేశయైః ॥ 56
పీతవర్ణైరుత్పలైశ్చ రక్తనీలోత్పలాంచితమ్।
మీనకచ్ఛపహంసాఢ్యం మత్తషట్పదనాదితమ్ ॥ 57

**అ :—** ఆ క్రీడావనమునందు నిర్మలోదకముగల బంగారు సోపానములతో అలంకృతమైన సరస్సుగా లక్ష్మీదేవి రూపము దాల్చినది. ఆసరస్సులో నవరత్నములవంటి బంగారుకాంతిగల నూరురేకుల-వేయిరేకుల కమలములుగాను, పీత-నీల-రక్తవర్ణములుగల కమలములుగాను, మత్స్యములు-కూర్మములు-హంసలు - పుష్పరసపానముచే మత్తెక్కి ఝుంకారము చేయుచున్న తుమ్మెదలుగాను, లక్ష్మీదేవి రూపముల దాల్చెను.

విశేషార్థము :-

'తస్మిన్' అని మొదలుకొని, పైన చెప్పినదంతయు జాత్యేకవచన

మని తెలియవలెను. అనగా ఆ విధముగనే అన్ని క్రీడావనములును ఉండిన వని భావము.

తత్ర రత్నమయం క్రీడామణ్డపం చాభవద్రమా ।
దివ్యరత్నమయం తేజఃపుంజపీఠమభూన్ముదా ॥ 58

అ:— ఆ సరస్సులో మధ్యభాగమందు లక్ష్మీదేవియే మహా సంతో షముతో క్రీడావిలాసము కొరకు రత్నమండపమాయెను. మఱియు నామండ పములో తేజః పుంజముతో భాసించుచున్న దివ్యరత్నమయములగు పీఠముల (ఆసనముల) రూపమును దాల్చెను.

తత్ర త్వామర్చయత్యంబా షోడశైరుపచారకైః ।
పాయసాన్నం వ్యంజనాది పంచభక్ష్యామృతాని చ ॥ 59

నూతనాని పవిత్రాణి నానారుచికరాణి చ ।
ఆర్ద్రకాదీని మూలాని స్వాదూదం స్వర్ణపాత్రకే ॥ 60

అ:— లోకమాతయగు లక్ష్మీదేవి ఆ పీఠములపై నిన్ను షోడశోపచారము లతో పూజించుచు, పాయసము, అన్నము, వ్యంజనములు, పంచభక్ష్యములు, పంచామృతములు, పంచశాకములు, అతి పవిత్రములు నూతనములు అగు రుచికరములైన ద్రాక్ష-ఖర్జూర-కదళీ-నారికేళాది ఫలములను, అల్లము కంద మొదలగు మూలమును, శుద్ధమైన మంచినీటిని స్వర్ణపాత్రముల యందుంచి నిత్యతృప్తుడవైన నీకు సర్వదా సమర్పించుచుండును.

విశేషార్థము :—

1. తత్రాఽవాహ్యం హరిం చార్ఘ్యం పాద్యం ఆచమనీయకమ్ ।
మధుపర్కం పునశ్చాచాం స్నానం వాసో విభూషణే ।
ఉపవీతాసనే దత్వా గంధపుష్పే తథైవ చ ॥

— ఇత్యాదిగా తంత్రసారములో అర్ఘ్య - పాద్య - ఆచమన - మధు పర్క - పునరాచమన - అభిషేక (స్నాన) - వస్త్ర - భూషణ - ఉపవీత -

ఆసన - గంధ - పుష్ప - ధూప - దీప - నైవేద్య - నీరాజనములనెడు ఈ పదునారు షోడశోపచారములని పేర్కొనబడినవి.

2. అపూపము - మోదకము - వటకము - పోళికా - శష్కులి అనునవి పంచభక్ష్యములు.

3. తిలైలానారికేళాజ్య గుడగుంప సమన్వితః।
పంచభక్ష్యసమః ప్రోక్తః పంచమూర్తేర్హరేః ప్రియః॥
— నువ్వులు, ఏలకులు, టెంకాయలు, నెయ్యి, బెల్లము ఇవిగాని, వీనితో వండిన వంటకములుగాని పంచభక్ష్యములకు సమానము.

4. నాహం కర్తా హరిః కర్తా తత్పూజా కర్మ చాఖిలమ్।
తథాపి మత్కృతా పూజా తత్ప్రసాదేన నాన్యథా॥
తద్భక్తిస్తత్ఫలం మహ్యం తత్ప్రసాదః పునః పునః।
కర్మన్యాసో హరావేవం విష్ణోస్తుష్టికరస్సదా॥
....స్వాతంత్ర్యం మమ న క్వచిత్।
ఇతి మత్వా న శక్తః స్యాత్ ప్రీతోఽస్య భవతి ప్రభుః॥

భగవంతునికి సమర్పించుటయనగా 'నేనెందులకును కర్తను కాను. శ్రీహరియే సర్వకర్త. అతని పూజను, సమస్త కర్మలను అతని దయవల్లనే నేను చేయుచున్నాను అతనియందు భక్తి కలిగియుండుట, అందుకు ఫలముగా నాపై అనుగ్రహము చూపుట - ఇదియంతయు భగవంతుని సంకల్పబలముచేతనే కలుగుచున్నది. నాకేమాత్రము నెందులోను స్వాతంత్ర్యములేదు.' అని తలంచి కర్మఫలముల నాశింపక యుండవలెను. ఈవిధమైన కర్మ సన్న్యాసముచే హరి ప్రీతుడగును. అని 'గీతాతాత్పర్య' మను గ్రంథములో (గీతా. అ. 3, శ్లో 35) కలదు.

నిత్యతృప్తాయార్పయన్తి పూర్ణకామాయ చాదరాత్।
ఈశాంకసర్వసారాయ సర్వసారాత్మికా న్స్వయమ్॥ 61

అ — సర్వపదార్థ సారస్వరూపిణియగు శ్రీ లక్ష్మీదేవి, పుత్రుడైన వాయుదేవుని తన తొడపైన ఉంచుకొనియున్నట్టివాడవు, సర్వశ్రేష్ఠుడవు, పూర్ణకాముడవు. నిత్యతృప్తుడవునగు నీ కొఱకు పరమాదరముతో భక్ష్య భోజ్యములను అర్పించుచున్నది.

విశేషార్థము :-

1. ఉద్యద్రవిప్రకరసన్నిభమచ్యుతాంకే
స్వాసీనమస్య నుతినిత్యవచః ప్రవృత్తిమ్ ।
ధ్యాయేద్గదాఽభయకరం సుకృతాంజలిం తం
ప్రాణం యథేష్టతను మున్నతకర్మశక్తిమ్ ॥

అనేక సూర్యబింబము ఉదయించుచున్నట్లు ప్రకాశించుచున్న, శ్రీహరియొక్క తొడపై కూర్చొని ధ్యానించుచున్న బహురూపియగు ముఖ్య ప్రాణుని (వాయు దేవుని) ధ్యానము చేయవలెనని 'తంత్రసారము' లో చెప్పబడినది.

2. దేవ్యాదేశప్రణీతిద్రుహిణహరవరావధ్యరక్షోవిఘాతా–
ద్యాసేవోద్యద్దయార్ద్రః సహభుజముకరోద్రామనామా ముకుందః ।
దుష్ప్రాపే పారమేష్ఠ్యే కరతలమతులం మూర్ధ్ని విన్యస్య ధన్యం
తన్వన్ భూయః ప్రభూతప్రణయవికసితాబ్జేక్షణస్త్వేక్షమాణః ॥

వాయుస్తుతి శ్లో. 21

లంకానగరములో సీతాదేవికి శ్రీరామ సందేశమును తెల్పి, అంగుళీయకము నిచ్చి, ఆమెచే నీయబడిన చూడామణిని శ్రీరామునికిచ్చుట, బలిష్ఠులైన (అవధ్యులైన) అక్షకుమారాది రాక్షసులను సంహరించుట - ఇత్యాది సేవలచే సంతుష్టుడయిన శ్రీరాముడు ఇతరులకలభ్యమైన చతుర్ముఖబ్రహ్మపదవి లభ్యమగునట్లు ఆంజనేయుని శిరస్సుపై తన అభయహస్తమునుంచి కృపా దృష్టితో చూచెను.

3. 'సహభోగమనన్యలభ్యం హనుమద్రూపపతే దదౌ పురా హి' ఆ చతుర్ముఖబ్రహ్మ పదవి కలిగినపుడు మోక్షములో సాయుజ్యమోక్షమును (అనగా

లక్ష్మీదేవి భోగము మాత్రము లేకుండ మిగిలిన సర్వభోగములను) తనతో అనుభవించునట్లు ఆంజనేయుని అనుగ్రహించెను.

4. ప్రతియొక భోజ్యపదార్థములో వాయ్వాత్మక, రమాత్మక, విష్ణ్వాత్మకము లనబడు రసవిశేషములున్నవి. అనగా వారు వారు స్వీకరించుటకు కర్హమగు రసములని భావము. వానిలో శ్రీహరి స్వరూపభూతమైన విష్ణ్వాత్మకములగు అప్రాకృతరసవిశేషములను తానే స్వయముగ స్వీకరించును. శ్రీ లక్ష్మీదేవి స్వరూపభూతమైన రమాత్మక రసవిశేషములను శ్రీహరి స్వీకరించిన యనంత రము స్వీకరించును. కాని వాయ్వాత్మక రసవిశేషములను శ్రీహరి తన పుత్రుడైన వాయుదేవుని తన తొడపై గూర్చుండబెట్టుకొని మిక్కిలి ప్రీతితో తినిపించి, ఆతని ద్వారా ఆరస విశేషములను అంతర్యామిగానుండి తానే స్వీకరించుననుటయే ముఖ్యతాత్పర్యము.

5. నిత్యతృప్తుడైన హరికి ఎందుల కర్పింపవలె ననగా, హరికి ఏ పదార్థములోను అపేక్ష లేకుండుటచేత అవసరము లేకపోయినను, మనకు భగవదనుగ్రహము కలుగవలెనని ఉద్దేశించి భక్త్యతిశయముతో మనము సమర్పించుటయే గాని, అతనికి అక్కరలేదు.

అథాత్మానం కల్పయన్తీ డోలామంచం మనోహరమ్ ।
సువర్ణశృంఖలాలంబం సువిశాలం సులక్షణమ్ ॥ 62
ప్రవాలపాదసంయుక్తం సువజ్రఫలకైర్వృతమ్ ।
ఓతప్రోతైః స్వర్ణపట్టైః మాణిక్యస్తబకావృతమ్ ॥ 63
జాంబూనద వితానాఢ్యం ముక్తాస్తబకరంజితమ్ ।

అ:— శ్రీహరి భోజనానంతరము విశ్రమించు అతిమనోహరమగు డోలామంచముగా లక్ష్మీదేవి తన్నుతానే కల్పించుకొనెను. ఆ తూగుటుయ్యేల అతిమనోజ్ఞమగు బంగారు గొలుసులు కలది. అది విశాలమై, శుభలక్షణ సంపన్నమై, పగడములచే చేయబడిన పాదములు కలదై, వజ్రపు పలకలు గలిగి

స్వర్ణమయమగు నవారుచే ఓతప్రోతముగా (అడ్డదిడ్డముగా) నేయబడియుండెను. నురియు మాణిక్యముల గుత్తులు, బంగారు చాందినీలు, ముత్యములగుత్తులు-పీటితో అలంకరింపబడియుండెను

విశేషార్థము:—

అనంతాననవైకుంఠనారాయణపురేమ యే ।
శ్రీభాగాః శుద్ధసత్త్వస్థాః పద్మశంఖాంబరాది చ ॥
కిరీటకటకాద్యా యేఽప్యలంకారా మమ శ్రియః ।
ఇత్యాద్యాః సత్వరూపాః స్యుః నిత్యానాదయ ఏవ తే ॥

విష్ణురహస్యము అ. 17, శ్లో. 11-13.

శ్వేతద్వీపము, - అనంతాసనము, - వైకుంఠము అనబడు నారాయణ మందిరములందు భగవంతుని వస్త్రాభరణ కిరీటాయుధ పుష్పాదులన్నియు లక్ష్మీ త్మకములు, నిత్యములు, అనాదులు - అని చెప్పబడినవి. కనుక ఇక్కడసైతము రమాదేవి తన హెూదాకు తగినట్లుగా ఐశ్వర్యసంపదలతో భగవంతుని పూజించుచున్నది —

భూరూపాఽభూత్ స్వయం శయ్యా శ్రీరూపా సోపబర్హణమ్ ॥ 64
దుర్గాభూత్ పాదసేవార్థం తాంబూలం భోగసాధనమ్ ।
సువర్ణదండవ్యజనం విద్యుదాభే సుచామరే ॥ 65
వైడూర్యస్తబకచ్ఛత్రం పాదుకే రత్నపీఠకే ।
సర్వరాజోపచారాణి రాజచిహ్నాని యాని చ ॥ 66
సర్వాణ్యభూద్రమాదేవీ దేవాయానన్తతేజసే ।
భోగ్యవస్తుస్వరూపేణ తవ సేవాఽభిలాషిణీ ॥ 67
మహాసంహాంబుధౌ మగ్నా రమతే సా రమా త్వయా ।
రమసే రమయైవ త్వం వైకుంఠాదిషు ధామసు ॥ 68

అ:— అటువంటి తూగుటుయ్యెలయందు మహైశ్వర్యపూర్ణుడవగు నీ సేవార్థము లక్ష్మీదేవి భూరూపిణియై శయ్యారూపముగను, శ్రీ రూపిణియై తల

గడగను, దుర్గారూపిణియై నీ పాదములను సేవించుచున్నది. మరియు పరిమళ పిష్టము, ఏలకులు, లవంగము, జాతిపత్రి మొదలగు భోగసాధనములుగల తాంబూలముగను, బంగారు కాడగల విసనకఱ్ఱలుగను, విద్యుత్కాంతిగల చామరములుగను, వైడూర్యగుచ్ఛములుగల ఛత్రములుగను, రత్నపీఠములు గల పాదుకలుగను, సకల రాజోపచారకములగు రాజలక్షణములుగల పదార్థములుగను అయినది. ఇట్లు సకల భోగ్యవస్తు స్వరూపములు తానేఅయి, బ్రహ్మాది దేవతలకు స్వామివైన నీ సేవచేయగోరి, మహానందసాగరమున మగ్నురాలై లక్ష్మీదేవి నీతో క్రీడించుచున్నది. అట్లే నీవును లక్ష్మీదేవి ఆనందాభివృద్ధికొఱకు వైకుంఠాది త్రిధామములయందు ఆమెతో క్రీడించుచున్నావు.

విశేషార్థము :—

1. దేవః 'దివ్ = క్రీడాయాం' రాధ సే, రాధ, సాధ = సంసిద్ధౌ.

2. ఛత్ర - చామర - దర్పణ - వ్యజన - పాదుకా - గీత - నృత్య - వాద్య - వాహన ప్రభృతులు రాజోపచారములు.

3. ఇంద్రానిల యమార్కాణామగ్నేశ్చ వరుణస్య చ ।
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీః ॥
యస్మాదేషాం సురేన్ద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః ।
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా ॥

మనుస్మృతి 7, 4-5.

అష్టదిక్పాలకుల అంశములనాకర్షించి, సృష్టికర్త రాజును సృష్టించును. కావున అట్టి తేజస్సుచే రాజు సకల ప్రాణులను వశపఱచు కొనగలుగును. అష్టదిక్పాలకుల చిహ్నములేవి కలవో వానినన్నిటిని రమాదేవి శ్రీనివాసుని ప్రీతికొరకు సేవార్థముగ కల్పించెను.

అవ :— శ్రీ స్వామివారి ఇతర మహిమలను పేర్కొని వర్ణించుచున్నాడు

ప్రత్యేకావరణస్థైశ్చ మూర్తిభిర్బ్రహ్మపూర్వకైః ।
త్రిదశైర్దశదిక్పాలైః సేవితః పరమాపదే । 69

అ :— ఓ ప్రభూ ! నీవు ప్రత్యేకావరణములందున్న నీయొక్క స్వరూప భూతములైన కేశవాది-సంకర్షణాది-మత్స్యాది భగవద్రూపములచేతను, మఱియు నీకు మందిరములవంటి ఉత్తమాధిష్ఠానములైన బ్రహ్మాదిదేవతలచేతను, ఇంద్రాది దశదిక్పాలకులచేతను అత్యుత్తమమైన సింహాసనముపై సేవింపబడుచున్నావు

విశేషార్థము :-

1. లక్ష్మి, ధరా, కృద్ధోల్క, మహోల్క, వీరోల్క, ద్యుల్క, సహస్రోల్క అనునీ యేడుగురు ప్రథమావరణ దేవతలు.

2. వాసుదేవ — మాయా, సంకర్షణ — జయా, ప్రద్యుమ్న — కృతీ, అనిరుద్ధ — శాంతి, విశ్వ -తైజస-ప్రాజ్ఞ - తుర్యములనబడునవి ద్వితీయావరణరూపములు.

3. కేశవాదులు తృతీయావరణ రూపములు.

4. సంకర్షణాదులు చతుర్థావరణ రూపములు.

5. మత్స్యాదులు పంచమావరణ రూపములు.

6. అనంత, బ్రహ్మ, వాయు, ఈశాన, గరుడ, వారుణీ, గాయత్రీ, భారతీ, గిరిజా, సౌపర్ణీ — అనువారు షష్ఠావరణ దేవతలు.

7. ఇంద్రాద్యష్టదిక్పాలకులు, అనంత, బహ్మ - వీరు సప్తమావరణ దేవతలు.

ఇందులకు ప్రమాణములు —

వాసుదేవాదికాన్ దిక్షు కేశవాదీంస్తతః పరమ్ ।
మత్స్యకూర్మవరాహాంశ్చ నారసింహం చ వామనమ్ ।
భార్గవం రామవం కృష్ణం బుద్ధం కల్కినమేవ చ ।
అనంతం విశ్వరూపం చ తద్బహిః పూజయేత్క్రమాత్ ।
అనంతబ్రహ్మవాయ్వీశాన్ వీశం చాగ్రే ప్రపూజయేత్
వారుణీం చైవ గాయత్రీం భారతీం గిరిజామపి ।
కోణేషు వీంద్రం వామే చ సుపర్ణీం ప్రయజేదపి ।

తంత్రసారము అధ్యా. 1, శ్లో. 62—65.

పూర్వాది దిక్కులందు వాసుదేవాది రూపములను, కేశవాదిరూపములను రెండేసి మూర్తుల చొప్పున విదిక్కులలో (మూలలందు) ఒక్కొక్క మూర్తిని ధ్యానించవలెను. కేశవాదిమూర్తుల వెలుపలయందు మత్స్యాదిరూపములను పూజింపవలెను. నాలుగు దిక్కులయందు శేషాదులను, దేవుని ఎదుట గరుత్మంతుని, నాలుగు మూలలందు వారుణ్యాదులను పూజింపవలెను

ఈ అర్చనాప్రక్రియ 'పద్యమాల' యను గ్రంథములో విశదముగా నున్నది.

8. భగవద్రూపములకు ఏ మాత్రము భేదము లేకుండుటవలన కేశవాది మూర్తులు శ్రీ శ్రీనివాసుని పూజించుచున్నవనుట యెట్లు సంభవించును? అనగా —

మహీయతే మహతి చ స్వయం స భగవాన్ హరిః
పూజ్యపూజకభేదోఽత్ర నైవ కశ్చిదపీష్యతే ।
అనన్యోఽప్యన్యశబ్దేన చతురాత్మా ప్రకీర్త్యతే ।
నిర్విశేషోఽపి భగవాన్ సంఖ్యామాత్ర విశేషతః ॥

శ్రీహరి యొక్కడే తనరూపములచే తాను పూజింపబడుచున్నాడు. తాను తన రూపములనే పూజించుచున్నాడనగా పూజ్య పూజక భేదము ఏ మాత్రము లేదని భావము. అట్లు భేదము లేకున్నను అన్యశబ్దముచే చెప్పబడుచున్నాడు. విశేషములేకున్నను సంఖ్యామాత్ర విశేషముచే భిన్నునివలె చెప్పబడుచున్నాడు

శ్రీనివాస రమానాథ త్వన్నాభ్యబ్జే చతుర్ముఖమ్ ।
గిరీశమంతఃకరణే హ్యంగేష్వింద్రాదిదేవతాః ॥ 70

ఋష్యాదీంశ్చ యథావత్త్వం సర్వజీవాంశ్చతుర్విధాన్ ।
సృష్ట్వా తేష్వంతరావిశ్య బహిః స్థిత్వాఽపి పాలకః ॥ 71

అ:— లక్ష్మీపతియగు శ్రీనివాసా! నీనాభికమలములో చతుర్ముఖబ్రహ్మను, అంతఃకరణములో కైలాసాధిపతియగు మహారుద్రుని, ముఖాద్యంగములందు

ఇంద్రాది దేవతలను, అట్లే యథాయోగ్యముగా ఋష్యాదులను, నాల్గుతెరంగుల (జరాయుజములు, స్వేదజములు, అండజములు, ఉద్భిజ్జములు) జీవరాసులను సృష్టించి, నీవు వారిలో ప్రవేశించి, వారి వారి సంస్కారానుసారముగా ఆయా యోనులలో పుట్టించి, లోపలను, వెలుపలను ఉండి రక్షించుచున్నావు.

విశేషార్థము :–

1. తల్లి గర్భమునందలి గర్భపుసంచినుండి (గర్భవాసముచేసి) పుట్టెడి మనుష్యాది ప్రాణులు 'జరాయుజము' లనబడును.

2. చెమటనుండి పుట్టెడి పేను మొదలగునవి 'స్వేదజము' లనబడును.

3. గ్రుడ్లనుండి పుట్టెడి పక్షులు, క్రిమి – కీటక – సర్పాదులు 'అండజము' లనబడును.

4 చెట్లు – తీగలు మొదలగునవి భూమిని భేదించుకొని మొలకెత్తుటవలన 'ఉద్భిజ్జము' లనబడును. ఇట్లు జీవరాసులు ప్రధానముగా నాల్గువిధములైయున్నవి

5. శ్రీహరియొక్క ముఖాద్యంగముల నుండి ఇంద్రాదులు జనించిరనుటకు 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత' – ఇత్యాది శ్రుతులు ప్రమాణము.

అత్యన్తభిన్నస్తైః సర్వైః పృథక్ జీవజడాత్మకైః । 72
పారతన్త్ర్యాదిదోషోజ్ఝః స్వాతన్త్ర్యాదిగుణోర్జితః ॥

అ :– సర్వవస్తువులందు ప్రవేశించియున్నప్పటికిని, వరస్పరాత్యంత భిన్నములైన సకలవస్తువులకంటెను నీవు అత్యంత భిన్నుడవుగానున్నావు. నీవు (ఇతరులకు లోబడియుండుట అను) పారతంత్ర్యాది దోషములు లేనివాడవు. స్వాతంత్ర్యాది గుణములచే పరిపూర్ణుడవు.

విశేషార్థము:–

జీవేశయోర్భిదాచైవ జీవభేదః పరస్పరమ్ ।
జడేశయోర్జడానాం చ జడజీవభిదా తథా ॥
పంచభేదా ఇమే నిత్యాః సర్వావస్థాసు సర్వశః ।

1. జీవులకు ఈశ్వరునికి భేదము.
2. జీవులకు పరస్పర భేదము
3. జడములకు ఈశ్వరునికి భేదము
4. జడములకు పరస్పర భేదము
5. జడములకు జీవులకు భేదము

ఈభేదములు సర్వదా నిత్యములు.

నిరపేక్షో నిత్యతృప్తః పూర్ణకామ స్త్వమార్ద్రహృత్ ।
సత్యకృత్ సత్యసంకల్పో మాబ్రహ్మేశేన్ద్రవన్దితః ॥ 73

అ :— లోకమున పరస్పరాశ్రయముగలిగి జీవించెడు జనులవలెగాక, నీవు కేవలము ఏ వస్తువుయొక్క అపేక్షగాని, ఆశ్రయముగాని లేనివాడవు. నీవు నిత్యతృప్తుడవైనను, పూర్ణకాముడవైనను నిర్దయుడవు కావు. అనగా ద్రవించు (దయగల) అంతఃకరణముగలవాడవు సత్యమైన జగత్తునే సృష్టించువాడవు. సత్యమైన సంకల్పము గలవాడవు. అనగా అనుకొన్న దానికి వ్యతిరేకముగా చేయనివాడవు. రమాబ్రహ్మరుద్రేంద్రాది దేవతలచే సదా వంద్యుడవు

సర్వేషాం ప్రేరకస్త్వం హి ముక్తాముక్త నియామకః ।
అఘట్యఘటనే శక్తో హ్యగణ్యగుణమణ్డితః ॥ 74

అ :— ఓస్వామీ! నీవు రమాబ్రహ్మాదులైన సర్వులకు ప్రేరకుడవు. ముక్తులకును, అముక్తులకును నియామకుడవు. ఎవరికిని సాధ్యముకాని దానిని సాధించుటలో కడు సమర్థుడవు. ఎవరికిని గణింపవీలుగాని గుణములచే పరిపూర్ణుడవు. మఱియు శ్రుతి స్మృత్యాదులయందు సుప్రసిద్ధుడవు.

అచిన్త్యాశ్చర్యచర్యస్త్వం బ్రహ్మాండాన్తర్బహిఃస్థితః ।
అణోరణీయాన్ మహతో మహీయాన్ సర్వగోఽవమః ॥ 75

అ:— ఎవ్వరిచేతను ఆలోచించుట కసాధ్యమైన ఆశ్చర్యకరమైన కృత్యములు కలవాడవు, బ్రహ్మాండమునకు లోపలను వెలుపలనుండువాడవు, మిగుల చిన్నవస్తువులగు అణువులన్నిటిలోను అతిచిన్నదగు పరమాణువైనవాడవు (అనగా సూక్ష్మముకంటె నతి సూక్ష్మము), మిక్కిలి పెద్దవస్తువు లన్నిటికంటె చాల పెద్దవాడవు, సర్వత్రవ్యాపించినవాడవు, సాటిలేనివాడవు నైయున్నావు.

విశేషార్థము :—

1. ఇచట ఆశ్చర్యమేమనగా అణుత్వమున్నదానిలో మహత్వముండదు. మహత్వమున్నదానిలో అణుత్వముండదు. భగవంతునిలో ఈ రెండు నుండుటయే అత్యాశ్చర్యము.

2. సర్వథా అసంభావితములు విరుద్ధధర్మములు ఎట్లు ఒకదానిలో ఘటించగలవు? అనినచో అతడు అచింత్యుడు. అతని మహిమల నాలోచించుటకు ఎవరికిని వీలుకాదని సమాధానము

3. 'అణోరణీ యాన్మహతోమహీయానాత్మాఽస్య జన్తో ర్నిహితో గుహాయాం' అను కఠశ్రుతి ప్రసిద్ధము

సర్వాధారః సర్వసాక్షీ సర్వాపేక్షోఽతిసుందరః ।
సర్వోత్తమశ్చ సర్వజ్ఞః సర్వస్వామీ చ సర్వదా ॥ 76

అ:— నీవు బ్రహ్మాది సకలజీవులకు సర్వలోకములకు పైతము ఆధారము. సమస్తజీవులయొక్క ఆంతర బహిర్వ్యాపారములను సదా సాక్షాత్తుగా చూచుచున్నవాడవు. వారి వారి యోగ్యతానుసారముగా ఫలములనిచ్చుటకై సర్వము నపేక్షించువాడవు బ్రహ్మాదులందరు (సర్వసజ్జనులందరు) నీ యపేక్షగలవారు అతిసుందరుడవు క్షరాక్షరపురుషులనబడు రమాబ్రహ్మాదు లెల్లరికన్న నుత్తముడవు. సకలము నెఱిగినవాడవు. సర్వ చరాచరములకు స్వామివి. మఱియు భూతభవిష్యద్వర్తమానములందున్నవాడవు

విశేషార్థము :-

ఇందులకు ప్రమాణములు:—

1. 'సాక్షి చేతా కేవలో నిర్గుణశ్చ'

2. 'అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః'

3. 'యః సర్వజ్ఞ స్సర్వవిత్'

4. 'యస్య జ్ఞానమయం తపః' ఇత్యాదిశ్రుతిస్మృతులు ప్రసిద్ధములు.

సర్వశక్తోఽజ్ఞేయచర్యో వ్యక్తోఽవ్యక్తస్సనాతనః ।
శేషోఽశేషశ్చ నిర్లిప్తో బ్రహ్మణ్యః శాశ్వతః శుభః ॥ 77

అ :— సర్వకార్యములను చేయుటయందు శక్తికలవాడవు, అయోగ్యులకు సర్వదా ఎఱుగ సాధ్యముకాని కృత్యము కలవాడవు యోగ్యులకు (సజ్జనులైన భక్తులకు) యథాయోగ్యముగా తెలియుటకు శక్యమైన కృత్యములు గలవాడవు. (అనగా యోగ్యులకు కొంతమాత్రమైనను గోచరమగును. అయోగ్యులకు వేమాత్రమును నీ కృత్యము గోచరము కాదు. అని భావము) ఎల్లకాలము నేక రీతిగా నుండువాడవు. నిత్యములైన వేదములచే స్తుత్యుడవు. ప్రళయకాలములో నీ వొక్కడవే మిగిలి (శేషించి) యున్నందువలన 'శేషుడ'న బడుచున్నావు. సృష్టికాలములో సర్వత్ర వ్యాప్తుడవై యుండుటవలన 'అశేషుడ' నిపించు కొన్నావు. పాపాది దోషములచే లేపములేనివాడవు. బ్రాహ్మణప్రియుడవు. బాల్య - కౌమార - యౌవన - వార్ధక్య - అవస్థారహితుడవై ఏక విధమున శాశ్వతముగా నుండువాడవు. సమస్తములకు ప్రభువైనవాడవు. మఱియు కల్యాణగుణ పూర్ణుడవు.

విశేషార్థము : -

బ్రహ్మణ్యః 'బ్రహ్మయతి ఆనందేన ముక్తాన్' బ్రహ్మ=ఆనందముచే ముక్తజీవులను పూర్ణీకరించు సుధాసముద్రము ఎవని వలన కలిగెనో ఆతడు — అను వ్యుత్పత్తిచే ముక్తులకు సుధాసముద్రమును కల్పించినందువలన భగవంతుడు బ్రహ్మణ్యుడు.

చతుర్వ్యర్గైస్సదా హీనః చతుర్ధర్మ ప్రదర్శకః ।
చతుఃపుమర్థదాతా చ చతుర్మోక్షప్రదః శ్రుతః ॥ 78

అ:— అనిత్యత్వము, దేహహాని, దుఃఖప్రాప్తి అపూర్ణత్వములనెడు చతుర్విధనాశములులేని వాడవు. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులనబడు నాలుగువర్ణములకు (నీ అవతారములలో స్వయముగా ఆచరించి శిక్షణములనిచ్చు వాడవు) నియామకుడవు. బ్రహ్మచర్య - గార్హస్థ్య-వానప్రస్థ - సన్న్యాసములు అను చతుర్విధాశ్రమముల ధర్మములను ప్రవర్తింపజేయువాడవు. ధర్మార్థ-కామమోక్షములనబడు నాలుగు పురుషార్థములను యథాయోగ్యముగానిచ్చు వాడవు. కర్మక్షయము, ఉత్క్రాంతిమార్గము, భోగములు మఱియు సాలోక్య-సారూప్య — సామీప్య - సాయుజ్యములనెడి చతుర్విధమోక్షములనిచ్చువాడవు. మఱియు వేదాదులచే ప్రసిద్ధుడవు

విశేషార్థము :—

1. అనిత్యత్వం దేహహానిః దుఃఖప్రాప్తిరపూర్ణతా ।
నాశశ్చతుర్విధో జ్ఞేయః తదభావో హరేస్సదా ॥

— అను నాలుగు విధములగు నాశములు లేనివాడు.

శమోదమస్తపః శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మ కర్మ స్వభావజమ్ ॥

— ఈ శమదమాదులు బ్రాహ్మణునకు స్వాభావికధర్మములు.

శౌర్యం తేజో ధృతిః దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ।

— శౌర్యము మొదలయినవి క్షత్రియుల ధర్మములు.

కృషిగోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।

— కృషి వ్యాపారాదులు వైశ్యుల ధర్మములు.

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ।

త్రైవర్ణికులకు శుశ్రూషాదులను చేయుట శూద్రుల ధర్మము.

(భగవద్గీతా అ. 18, శ్లో. 42 నుండి 44)

అధోక్షజోఽప్రాకృతస్త్వమనంతమహిమా శవ ।
మూలరూపీ హ్యనంతస్త్వమవతారాస్తథావిధాః ॥ 79

అ:- ప్రత్యక్షానుమానములచే అగోచరుడవు. అనగా ప్రత్యక్షముగా తెలిసికొన వీలుకాని వాడవు. ప్రకృతి సంబంధము (సంసారబంధము) లేని వాడవు. నీ మహిమలు అనంతములు. అట్లే మూలరూపుడవైన నీవును నీ యవతారములును అనంతములు. అనగా నీవు నాశము లేనివాడవు.

1. అధోక్షజః=అధః కృతం అక్షజం యేన - అను వ్యుత్పత్తి ననుసరించి ధిక్కరింపబడిన ప్రత్యక్షాది జ్ఞానము కలవాడు. అనగా ప్రత్యక్షముగా తెలిసికొన వీలుకానివాడు.

2. అనంతః='అతి = బంధనే, న విద్యతే' 'అంతః బంధః యస్య' సంసారబంధము లేనివాడు.

3. 'నేంద్రియాణి నానుమానం వేదా హ్యేవైనం వేదయంతి', 'న తత్ర చక్షుర్గచ్ఛతి'- ఇంద్రియములచేతను అనుమానములచేతను బ్రహ్మను తెలిసికొన వీలుగాదు. వేదములచేతనే తెలియవలెను. అని శ్రుతులుండుటచే ప్రత్యక్షము నకు ఈశ్వరుడు గోచరుడు కాడు.

4. 'యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ ।
మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' - ఇత్యాది శ్రుతులయందు మూలరూపములను, అవతారరూపములను వేర్వేరుగా భావించిన యెడల మహానర్థములు కలుగునని చెప్పబడియున్నది.

నామధేయాన్య (నామచర్యాణ్య) నంతాని జ్ఞానానందాదయోగుణాః ।
అనన్తవేదవేద్యస్త్వైః అవేద్యోఽనన్తసౌఖ్యదః ॥ 80

అ:- ఓ లక్ష్మీపతీ! నీ రామకృష్ణాది నామధేయములు (గోవర్ధనగిరి నెత్తుట మొదలగు నీ కార్యములు) అనంతములు. నీ జ్ఞానానందాది గుణము లనంతములు. నీవు అనంతవేద శాస్త్రములచేతనే తెలియదగినవాడవు.

మరియు నీవు వారివలనను సంపూర్ణముగా తెలియ వీలుగానివాడవు. నీవు బ్రహ్మాదులకు (మరియు ముక్తులకు) యథాయోగ్యముగ అనంత సౌఖ్యముల నిచ్చువాడవు.

అహో భాగ్యమహో భాగ్యం రమేశ త్వత్పదాంబుజే ।
నివిష్టమనసాం సౌఖ్యమిహాముత్రాభివర్ధతే ॥ 81

అ:— ఓ లక్ష్మీపతీ! నీ పాదకమలములందే మనస్సునుంచిన భక్తులకు ఈ లోకములోను పరలోకములోను అనుదినము సుఖము వృద్ధియగుచుండును. వారల భాగ్యమే భాగ్యము! అది యెంతటి మహాభాగ్యము!

తవ ప్రసాదలేశస్య లేశలేశాతిలేశతః ।
లవమాత్రం యైస్తు లబ్ధం తైరలభ్యం న కించన ॥ 82

అ:— ఓ శ్రీనివాసా! నీ యనుగ్రహముయొక్క లేశాతిలేశమందలి లేశ మాత్రము (అత్యల్పకణ భాగములోని అత్యల్పభాగము) చేతనే సమస్తము లభ్య మగునప్పుడు అట్టి లేశమును పొందిన వారికలభ్యమును, దుర్లభమగునదేదియును లేనేలేదని వేరుగా చెప్పవలెనా? అలభ్యమైనదేదియు ఉండనే యుండదు.

చరిత్రాణ్యతిచిత్రాణి మహాన్తి సుబహూన్యపి ।
తవ నానావతారేషు దర్శయస్యనువర్తినామ్ ॥ 83

అ:— ఓ శ్రీహరీ! నీవు రామకృష్ణాద్యవతారములలో చేసిన మహిమలు అనేకములును, అతివిచిత్రములునైయున్నవి. అవి చాలగొప్పవి. ఆ నీ చరిత్ర విశేషములను ఆయా అవతారములయందు నిన్ననుసరించి వర్తించెడు భక్తులెల్ల రకు చూపించియున్నావు.

అవ:— శ్రీహరియొక్క వివిధావతరారములయందేమి చెప్పబడియున్నదో, ఎవ రెవరి కేమేమి చూపియున్నాడో ఆ విశేషములను చెప్పుచున్నాడు.

కీటోఽపి త్వద్దయాలేశాత్ సామ్రాజ్యమనుభుక్తవాన్ ।
త్వత్పాదపద్మసంపర్కలేశలేశాతిలేశతః ॥ 84
దృషద్దివ్యాంగనాఽభూద్ది చేతనానాం తు కిం బ్రువే ।

ఆ:— ఒకానొక కీటకము (పురుగు) వేదవ్యాసరూపమున నున్న నీయొక్క దయాలేశమువలన ఆ కీటరూపముతోనే గొప్ప సామ్రాజ్యము ననుభవించెను. రామావతారములో నీ పాదపద్మస్పర్శయొక్క లేశాతిలేశమందలి లేశమాత్రము చేతనే యొకపాషాణము అహల్యయను దివ్యసుందరియాయెను. పాషాణముపైనే నీ మహిమ యింతగానుండగా, నిక చేతనులవిషయమై నీ మహిమవేమని చెప్పగలను ?

విశేషార్థము :—

1. భవస్వ రాజా కుశరీరమేతత్ త్యక్త్వేతి నైచ్ఛత్తదసౌ తతస్తమ్ ।
అత్యక్తదేహం నృపతిం చకార పురా స్వభక్తం వృషలం సుబుద్ధిమ్ ॥
లోభాత్స కీటత్వముపేత్య కృష్ణప్రసాదతశ్చాశు బభూవ రాజా ।

మహాభారత తాత్పర్య నిర్ణయము, అధ్యా 10, శ్లో. 64-65

శ్రీ వ్యాసమహర్షి దారిన పోవుచుండగా నొకకీటకము వారిపాదములపై బడెను. వారు దానింజూచి- 'ఓ కీటమా! నీవు ఈ శరీరమును విడనాడి రాజువగుము' అనిరి. కాని ఆ కీటము శరీర త్యాగమున కిష్టపడలేదు. పూర్వము ఒక భక్తుడుగాను అతిలోభిగానుఉండి లోభత్వమువల్లనే కీటకముగా బుట్టెను. అయినను శ్రీ వ్యాసమహర్షికి దానిపై దయకలిగెను. ఆయన ఆ కీటమును ఆ కీటరూపముతోనే రాజ్యాధిపతిగా చేసిరి.

2. అథోఽహల్యాం పతినాఽభిశప్తాం ప్రధర్షణా దింద్రకృతాచ్ఛిలీకృతామ్ ।
స్వదర్శనాన్మానుషతాముపేతాం సుయోజయామాస స గౌతమేన ॥

మహాభారత తాత్పర్యనిర్ణయము, అధ్యా 4, శ్లో 10

అహల్యాదేవిని దేవేంద్రుడు బలాత్కారముగా ననుభవించుటవలన, శిలారూపముతో నుండుమని గౌతమముని శపించెను. శ్రీరామచంద్రుడు తన

పాదస్పర్శవలన శాపవిమోచనమేర్పరచి, సుందరియైన అహల్యను మిక్కిలి దయతో గౌతమముని కప్పగించెను.

అత ఏవార్జునే సూతో బలేశ్చ ద్వారపోఽప్యభూః ॥ 85
ఇన్ద్రే త్వం దయయా చేలాం బలిం యాచితవానసి ।

అ:— ఓ స్వామీ! భక్తులను అనుగ్రహించుటకొఱకే నీవు కృష్ణరూపమును ధరించియుంటివి. అర్జునునియెడ దయగలవాడవై ఆతనికి సారథివైయుంటివి. దుష్టులగు దుర్యోధనాదులను వధించి భూభారము నణచితివి. బలిచక్రవర్తికి ద్వారపాలకుడవై యుంటివి. దేవేంద్రునిపై కరుణవహించి బలిచక్రవర్తినుండి భూమిని యాచించితివి.

విశేషార్థము :—

ఓ శ్రీనివాసా! నీవు ఇంద్రునియందలి దయచే వామనరూపమున బలిచక్రవర్తివద్ద దైన్యముతో మూడడుగులనేలను భిక్షాటనము చేసితివి. త్రివిక్రమరూపముతో ఆ బలిచక్రవర్తిని అట్టడుగు పాతాళమునకు పంపి దేవేంద్రునకు మరల స్వర్గాధిపత్యము నిచ్చి యాతని ననుగ్రహించితివి. బలి చక్రవర్తి ప్రార్థనానుసారము మరల ఆతని ననుగ్రహించునిమిత్తము బలి యింటియందు ద్వారపాలకుడవైతివి.

గజేన్ద్రరక్షణే దూతాన్ ద్వారపాన్ వాఽప్యనాదిశన్ ॥ 86
అన్వధావః స్వయం శీఘ్రం క్షుద్రనక్రముముక్షయా ।

అ:— ఓ ప్రభో! క్షుద్రమగు మొసలిచే పీడింపబడిన భక్తుడైన గజేంద్రుని రక్షించుటకై భృత్యులనుగాని, ద్వారపాలకులను గాని పంపక, స్వయముగా నీవే అతిశీఘ్రముగా పరుగెత్తివచ్చి రక్షించితివి గదా!

విశేషార్థము :—

అంతస్సరస్యురుబలేన పదే గృహీతో
గ్రాహేణ యూథపతిరంబుజహస్త ఆర్తః ।

ఆహేదమ్ ఆదిపురుషాఖిలలోకనాథ
తీర్థశ్రవః శ్రవణమంగళ నామధేయ ।
స్మృత్వా హరిస్తం శరణార్థినమప్రమేయః
చక్రాయుధః పతగరాజ భుజాధిరూఢః ।
చక్రేణ నక్రవదనం వినిపాట్య తస్మా-
ద్ధస్తే ప్రగృహ్య భగవాన్ కృపయోజ్జహార ॥

భాగవతము స్కంధము 2, అ. 7. శ్లో. 15-16

ఒక మహా సరోవరములో జలక్రీడకొఱకు ప్రవేశించిన మదగజము పాదము నొక మొసలి పట్టుకొనెను. ఆ యేనుగు చాలకాలమువఱకు తన శక్తి కొలది ప్రయత్నించియు, తప్పించుకొనలేక మిక్కిలి డస్సిపోయి, భగవత్కృపచే స్ఫురించిన పూర్వజన్మ విద్యాసంస్కారబలము వలన 'నీవేగతి రక్షించు హరీ!' యని అతిదీనముగా మొఱపెట్టుకొనెను. శరీరబలముతో పెనగులాడుచుండిన గజేంద్రునకు జ్ఞానము కలుగనంత కాలమును రక్షింపలేదు. కాని జ్ఞానముకలిగి 'రక్షించు హరీ!' యని పిలువగనే భగవంతుడు తత్క్షణము వచ్చి, చక్రాయుధముతో మొసలిని ఖండించి యాగజేంద్రుని రక్షించి యుత్తమగతి నిచ్చెను. కావున భగవంతుడొక్కడే కర్త - అని తెలిసి యారాధించువారినే దయతో ఆయన రక్షించునని భావము.

వైకుంఠం వా పరిత్యక్ష్యే న భక్తాంస్త్యక్తుముత్సహే ॥ 87
మేఽత్యంతప్రియా హి మద్భక్తా ఇతి సంకల్పవానసి ।

అః— ఓ దేవా! నీవు 'వైకుంఠమునైనను విడువగలను. కాని, భక్తులను మాత్రము విడవలేను. ఎందుచేతననగా నా భక్తులు నాకత్యంతప్రియులు' అను దృఢసంకల్పము గలవాడవైయున్నావు.

కామధేనుః కల్పవృక్షః చింతామణిరితి త్రయమ్ ॥ 88
వేంకటేశ త్వమేవాసి శేషాద్రే సర్వదానతః ।

అ:— ఓ వేంకటాచలపతీ! దేవలోకములోని కామధేనువు, కల్పవృక్షము చింతామణి యను ఈ మూడును సకలేష్టములనిచ్చునవి. వేంకటగిరిపై భక్తులకు సర్వదా కోరికల దీర్చుటకు నీవే ఈ మూడును అయియున్నావు.

విశేషార్థము :

'నతః' అనగా బ్రహ్మాదులచే పూజితుడు మఱియు చేతికందునట్లు వంగియున్నాడని యర్థము. ఎంతటి కల్పవృక్షమైనను నిటారున ఆకాశములో నుండినచో ప్రయోజనములేదు. చేతికందునట్లు వంగియుండిన యెడల అందఱికిని ఫలము సులభముగా అందునని భావము.

అవ:— నీవు కల్పవృక్షాదులతో సముడవు కావు. వానికన్న నధికుడవని చెప్పుచున్నాడు.

దదాతి కామానన్నాదీన్ మణిర్ధేనుశ్చ పాదపః ॥ 89
న చాపవర్గం స్వర్గం వా తేషాం శక్తిశ్చ తాదృశీ ।

అ:— కల్పవృక్షాదులను అర్థించిన వారికి అవి అన్న-వస్త్ర-ఆభరణ-భోగసాధనములను మాత్రమియ్యగలవు. వాటి శక్తి అంతమాత్రమే. స్వర్గమునుగాని మోక్షమునుగాని ఇయ్యలేవు.

అవ:— కామధేన్వాదులకన్న భగవంతుని దయ గొప్పదనియు, వాటిచే నియ్యబడని ఫలములను భగవంతుడియ్య గలడనియు చెప్పుచున్నాడు.

యది త్వం సుప్రసన్నోఽసి సర్వార్థాన్ సంప్రదాస్యసి ॥ 90
జాత్యన్ధానాం చ చక్షూంషి రాసి త్వన్మూర్తి దర్శనమ్ ।

అ:— ఓ వేంకటపతీ! నీవు సంతుష్టుడవైన యెడల భక్తులకు ధర్మార్థ కామమోక్షములనబడు నాలుగు పురుషార్థముల నిచ్చెదవు. పుట్టుగ్రుడ్డివారికి దృష్టి నొసగి పిదప నీ దివ్యమంగళవిగ్రహదర్శనమును పైతమిచ్చెదవు.

విశేషార్థము :—

'రా - దానే' అని ధాతువు 'రాసి' అనగా 'ఇచ్చువాడవు' అని భావము.

బధిరాణాం చ శ్రోత్రాణి త్వత్కథాశ్రవణం పరమ్ ॥ 91
జడం మూకం చ వాచాలం కరోష్యధ్యయనాన్వితమ్ ।
మందబుద్ధిం ప్రాజ్ఞతమం సాంఖ్యయోగసమాధిగమ్ ॥ 92

అ :— చెవిటివారికి చెవులను (వినగల శక్తిని) ఇచ్చి వారిచే నీ కథా శ్రవణము చేయించెదవు. సర్వథా మాట్లాడలేని మూగవానికి వాగింద్రియ దోషములను పోగొట్టి వేదశాస్త్రాధ్యయనశీలునిగా చేయుదువు. మంద బుద్ధిగలవానికి విద్యాబుద్ధులనిచ్చి అతి వాక్పాటవముగలవానిగను, మహా ప్రజ్ఞావంతునిగను జేసి సాంఖ్య - యోగశాస్త్రములయందు నిష్ఠగలవానిగా జేయుదువు. మఱియు వానిని భగవద్విషయకమగు ఆధ్యాత్మికజ్ఞానమునందు పరినిష్ఠితునిగా, స్థితప్రజ్ఞునిగా నొనర్చుచున్నావు

అకరస్య కరౌ దత్త్వా కరోషి తవ పూజకమ్ ।
అపదస్య పదే దత్త్వా త్వత్తీర్థక్షేత్రగామినమ్ ॥ 93

అ :— చేతులు లేనివానికి చేతులనిచ్చి, నిన్ను పూజించు వానినిగను, కాళ్ళు లేనివానికి కాళ్ళనిచ్చి నీ సన్నిధానముగల పుణ్యక్షేత్రములకు పుణ్య తీర్థములకు పయనించు వానినిగను చేయుచున్నావు.

విశేషార్థము :—

తీర్థక్షేత్రములకు పోయి, స్నానజపానుష్ఠాన భగవద్దర్శన నమస్కార ప్రదక్షిణాదులను చేయుట ద్వారా అట్టివారలను నీ యనుగ్రహమునకు పాత్రులుగా చేయుచున్నావని భావము.

యద్యద్దుఃఖం భవేద్భక్తే తత్తత్సద్యో హరిష్యసి ।
కుబ్జత్వం కుష్ఠతాం నానారోగానప్యాభిచారికాన్ ॥ 94
హృత్వా దదాస్యంగదార్ఢ్యం సౌన్దర్యం త్వద్దయాఽద్భుతా ।

అ:— శ్రీహరీ! భక్తులకు ఏయే దుఃఖములు కలుగునో వానినన్నింటిని వెంటనే పరిహరింతువు. నీ భక్తులకు కలిగెడు (వృద్ధాప్యములో) శరీరము వంగిపోవుట, కుష్ఠరోగము ఆయుధప్రయోగముచే చంపబడుట, భోజనాదులలో విషప్రయోగము, మంత్రప్రయోగాదులు మొదలైన ఆపదల నన్నింటిని పరిహరించి వృద్ధులకుకూడ శరీరదార్ఢ్యమును దేహసౌందర్యమును అనుగ్రహించు నీ దయ అత్యాశ్చర్యకరము!

అవ:— అభీష్టదాన విషయమై ఎంతని వర్ణింపగలను? ఈ మహిమ యింతయని చెప్పుట కెవరికిని సాధ్యముకాదు. నా శక్త్యనుసారము వర్ణించెదనని పల్కుచు ముగించు చున్నాడు.

శ్రీనివాస! బహూక్త్యా కిం భక్తసర్వార్తినాశనే ॥ 95
సర్వార్థపూరణే చాపి త్వత్సమోఽన్యో న కుత్రచిత్ ।

అ:— ఓ స్వామీ! ఎక్కువగా చెప్పుటవలన ప్రయోజనమేమి? భక్తుల యొక్క సకల దుఃఖములను పరిహరించు విషయమునను, సకలాభీష్టముల నిచ్చుటయందును బ్రహ్మాండములో నీకు సాటియగు వారెచ్చటను లేరు.

ప్రసన్నో నీలమేఘస్త్వం శ్రీభూవిద్యుత్సమన్వితః ॥ 96
హృద్వ్యోమగస్త్రితాపఘ్నో భక్తసర్వేష్టవార్షుకః ।

అ:— ఓ హరీ! నీవు ప్రసన్నుడవై భక్తుల 'సర్వాభీష్టము' లను, వర్షమును కురియించువాడవు. (ఇందులో వర్షములకు సంబంధించిన మేఘ చిహ్నాదులను చెప్పుచున్నాడు.) ఇంద్రనీలమణి వంటి దేహకాంతి కలవాడవు. నీ హృదయాకాశములో నున్న వారును మెరుపులవలె ప్రకాశమానులు నైన శ్రీదేవి భూదేవులతో గూడియున్న వాడవు. ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవికము లనబడు తాపత్రయమును పోగొట్టి భక్తుల సకలాభీష్టములను వర్షించువాడవు వైయున్నావు.

విశేషార్థము :—

1. వర్షణ (వర్షము కురియించు) మేఘ చిహ్నములను స్వామివారి యందు నిరూపించుచున్నాడు. నీలవర్ణముగల స్వామివారు నీలమేఘము. శ్రీదేవి భూదేవి యనువారలు ఆ మేఘమందలి మెరుపులు. భక్తుని హృదయమే ఆ నీలమేఘము సంచరించెడి యాకాశము.

మేఘసంచారముచే ఆధిభౌతికమగు తాపమొకటి మాత్రమే పరిహరింపబడును. శ్రీ స్వామివారనెడు నీలమేఘము హృదయాకాశమున సంచరించుట వలన ఆధ్యాత్మికాది మూడు విధములైన తాపములును పరిహరింపబడుచున్నవని భావము.

2. కంటితో చూడవలెనన్న సూర్యుడు కావలెను. సూర్యాగ్రహము లేకున్నచో లోకము అంధకారబంధురమగును. అటులనే శ్రోత్రాది జ్ఞానేంద్రియములకు అభిమానులైన దేవతల యనుగ్రహము లేకపోయినచో చెవిటితనము, గ్రుడ్డితనము మున్నగు లోపములేర్పడి, ఆయా ఇంద్రియములున్నప్పటికిని లేనట్లే యగును. ఆయా ఇంద్రియములతో దర్శనాది కార్యములు జరుగుట లేదు. ఆయా ఇంద్రియాధిదైవములవలననే ఆ కార్యములు జరుగుచున్నవి. ఇదియే ఆధిదైవికమనబడినది.

3. పాంచభౌతిక దేహమునందు ఉష్ణము అధికమైనచో పైత్యమతిశయించును. శీతమెక్కువైనచో శైత్యము. వాయువధికమైనచో వాతమధికమగును. ఇది యాధిభౌతికమనబడినది.

4. మనస్సునందలి చింత, రాజాదులవలన భయము, దాయాదులతోడి కలహము – ఇత్యాదులాధ్యాత్మికము.

5. ఐనను నీచే సమస్త–అనిష్టనివృత్తియు, సమస్తేష్ట సిద్ధియు అగుచున్నవి.

**అవ:— భగవంతుడు భక్తులనెట్లు సంసారసాగరమునుండి దాటించి, ఎనిమిదవ సముద్రమున తగియున్న అభీష్టముల నియ్యగలవాడో—అను విషయమును వివరించుచున్నాడు.**

**అభీష్టాష్టమవారాశౌ విమజ్యోన్మజ్జితం నిజమ్ ।** 97
**అనష్టాష్టమమద్వీపే సంస్థాపయసి చాదరాత్ ।**
**సర్వసౌఖ్యమిహాముత్ర ప్యర్మక్త్యానన్దవర్ధనః ।** 98

అ :— సప్తసముద్రముల కతీతమై యెనిమిదవసముద్రమనదగియున్న (అనంతకృపతో) అనంతానంత - అభీష్టదానముల నొసంగుట యను కృపా సముద్రమునందు నీ భక్తులను ముంచి పైకెత్తి వారలను సకలాభీష్టప్రాప్తి వలన కలిగిన 'మహానంద మనబడు ఎనిమిదవ ద్వీపములో మహావాత్స ల్యముతో వెలకొల్పెదవు. అనగా నీ భక్తులకు సకలైహిక - ఆముష్మిక సౌఖ్య ములనిచ్చి, ముక్తిలోగూడ ఆనందాభివృద్ధిని కలుగజేయుచున్నావు - అని తాత్పర్యము.

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటేశమాహాత్మ్యే
'అభీష్టదానప్రకారో' నామద్వితీయాధ్యాయః

శ్రీమదాదిత్య పురాణాంతర్గత శ్రీ వేంకటేశమాహాత్మ్యము
నందలి 'భగవద్గుణ కథామవర్ణన' మను
రెండవ అధ్యాయము సంపూర్ణము.
। శ్రీ కృష్ణార్పణమస్తు ।

# అథ తృతీయాధ్యాయః

॥ అథ భగవతః నానావతారవర్ణన ప్రకారః ॥

అవ :— దేవశర్మ శ్రీనివాసుని అవతార విశేషములను వర్ణించుచున్నాడు.

దేవశర్మోవాచ :

అనన్తవేదసంవేద్య లక్ష్మీనాథాణ్డకారణ ।
జ్ఞానానన్దైశ్వర్యపూర్ణ నమస్తే కరుణాకర ॥ 1

అ :— అనంతవేదములచేతనే తెలియదగినవాడవు, బ్రహ్మాండసృష్టికి కారణమైనవాడవు, జ్ఞానానందైశ్వర్యములచే పరిపూర్ణుడవు, కరుణామయుడవు, లక్ష్మీపతివియునగు ఓ స్వామీ! శ్రీ వేంకటేశా! నీకు నమస్కారములు.

నక్షత్రాణి చ గణ్యన్తే పాంసవశ్చ క్షణాదయః ।
త్వద్వీర్యాణి న గణ్యన్తే బ్రహ్మణా రమయాఽపి వా ॥ 2

అ :— నక్షత్రములను, ధూళిలోని రేణువులను, క్షణలవాది కాలవిభాగములను లెక్కింపవచ్చును గాని, నీ శక్తిచాతుర్యాది గుణములు రమాబ్రహ్మాదులకైనను లెక్కింప వీలుగానివి.

విశేషార్థము :—

ఈ పద్యమున 'విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి' అను శ్రుత్యర్థము వివరింపబడినది.

తథాఽపి తే భక్తదాసదాసదాసో యథామతి ।
స్తౌమి త్వాం వేంకటాధీశ త్వద్భక్తః ప్రేరితస్త్వయా ॥ 3

అ :— ఓ వేంకటాచలపతీ! నీ గుణములు అగణ్యములుగా నుండుటచే నీ భక్తురాలగు లక్ష్మీదేవికి భృత్యుడును, భక్తుడును అగు వాయుదేవునకు

సేవకురాలైన భారతీదేవికిని మఱియు నీకును భక్తుడను, భృత్యుడనగు నేను నీ ప్రేరణానుసారము యథాయోగ్యముగా విష్ణుస్తోత్రము చేయుదును.

శ్రీవేంకటేశ మత్స్వామిన్ జ్ఞానానన్ద దయానిధే ।
భక్తవత్సల భో విశ్వకుటుంబిన్నధునాఽవ మామ్ ॥ 4

అ:— ఓ వేంకటేశా! జ్ఞానము, ఆనందము, దయ - అను వాటికి ఆశ్రయుడవైన ఓ భక్తవత్సలా! ఈ జగము నంతటిని స్వీయకుటుంబముగా ఎంచుకొని భరించువాడవు నీవే. నా స్వామివియగు వో వేంకటేశా! నన్ను రక్షించి అనుగ్రహించుము.

విశేషార్థము:—

'భక్తాః ఏవ వత్సాః తాన్ లాతి' = భక్తులనెడు బిడ్డలను తనవారినిగా స్వీకరించువాడు.

అవ:— నా ప్రార్థనచే నీవు సత్యసంకల్పుడవైతివా? లేదు అనుచున్నారు.

సత్యేశం సత్యసంకల్పం సత్యం సత్యవ్రతం హరిమ్ ।
సత్యచర్యం సత్యయోనిం సత్యశీర్షమహం భజే ॥ 5

అ:- సత్యమైన జగత్తునకు నియామకుడును (లేదా సత్యభామాదేవికి పతియు), 'వైకుంఠమునైనను విడువగలనుగాని భక్తులను ఎల్లప్పుడు విడువక రక్షింతును' - అను సత్యసంకల్పము గలవాడును, సత్యనామకుడును, భక్తులను రక్షించుటలో దీక్షగలవాడును, భక్తుల సర్వదుఃఖపరిహారకుడును, పాపముల పారద్రోలుటచేతను, దుష్టులను సంహరించుటచేత 'హరి' శబ్దవాచ్యుడును, అన్యథాజ్ఞాతములు కాని యథార్థచర్యలుగలవాడును, పరమాత్మజ్ఞానమునకు కారణభూతములైన వేదములకు రక్షకుడును (సత్యములైన వేదములే తనయునికిని తెలియజేయుకారణములని బోధించువాడును, అనగా కేవలము వేదముల చేతనే తెలియదగినవాడును), సత్యలోకమును శిరమునందు ధరించినవాడును, లేక సత్యాత్మకములగు సహస్రశిరస్సులుగల విరాడ్రూపము కలవాడునగు శ్రీ వేంకటేశుని సేవించెదను.

విశేషార్థము :-

ఈ శ్లోకములోని కొన్నియంశములకు ప్రమాణమును జూపుచున్నాడు.

1. 'యచ్చికేత సత్యమిత్తన్నమోఘం', 'విశ్వం సత్యం మఘవానా' 'పరిభూః స్వయంభూః యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః' - ఇత్యాది శ్రుతులలో చెప్పిన రీతిగా జగత్తు సత్యము.

2. 'మనోమయః ప్రాణశరీరః భారూపః సత్యసంకల్పః' (ఛాందోగ్యోపనిషత్తు) - ఇత్యాదులచే సత్యసంకల్పుడు

3. పాపాని పాపినశ్చాపి దుఃఖనిర్హరణాదపి ।
పుణ్యాను హరణాచ్చాపి హరిర్నారాయణోఽభవత్ ॥

అను స్మృతి భక్తుల పాపదుఃఖముల నశింపజేయుటచే 'హరి' యని పిలువబడుచున్నాడని తెలియజేయుచున్నది.

4. 'నిత్యావేదాః సమస్తాశ్చ శాశ్వతాః విష్ణుబుద్ధిగాః', 'అనాదినిధనా నిత్యా'- ఇత్యాదిప్రమాణములు, వేదములు అనాది నిత్యములని చాటుచున్నవి.

శ్రవణాత్సర్వపాపఘ్నం మననాత్పుణ్యవర్ధనమ్ ।
స్వధ్యానాత్సిద్ధిదం విష్ణుం ప్రేక్షణాన్మోక్షదం భజే ॥ 6

అ :- మాహాత్మ్యశ్రవణమాత్రముచే సర్వపాపముల పోగొట్టు (పరోక్షజ్ఞాన ప్రాప్తిని కలిగించు) వాడును, చరిత్రలనే మఱల మఱల తలచుచుండుట వలన పుణ్యమును వృద్ధిచేయు (జ్ఞానదార్ఢ్యమునిచ్చు) వాడును, ధ్యానించుట వలన సకల సిద్ధులనిచ్చు (జ్ఞానసిద్ధిని కలిగించు) వాడును, దర్శించుట వలనను మఱియు బ్రహ్మసాక్షాత్కారమనబడు అపరోక్షజ్ఞానము వలన మోక్షమునిచ్చు (అనగా సంసారమునుండి విమోచనముచేయు) వాడునగు విష్ణువును భజించెదను.

విశేషార్థము :-

1. గురువులు చెప్పినదానిని వినుట 'శ్రవణము'. వినిన దానిని

మననమ్మలో నిరంతరానుసంధాన మొనరించుట 'మననము'. (శ్రవణ దర్శ నాదిజనిత మానస వాసనామయస్య వస్తునః మనసాఽవలోకనం ధ్యానమ్) శాస్త్రశ్రవణమువలనను భగవద్దర్శనమువలనను కలిగిన మానసవాసనామయ వస్తువును మనస్సులో తలచుటయే 'ధ్యానము'. చెవితో విన్నది కంటితో చూచినది మనస్సులో వాసనారూపమగు 'బింబము'గా నిలుచును. దానిని ఏకాగ్రముగా తలంచుటయే ధ్యానమని భావము.

2. జీవునకు జననమరణాది ఘటితమైన దుఃఖసర్వస్వము నశించి నిరవ వాస్తవమైన సుఖానుభవము కలుగుటయే మోక్షము.

శ్రీవేంకటేశం లక్ష్మీశం అనిష్టఘ్నమభీష్టదమ్ ।
చతుర్ముఖేరతనయం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 7

అ:— శ్రీ వేంకటాచలమునకధిపతియు, లక్ష్మీపతియు, భక్తులయొక్క కామక్రోధాదులు - సంశయ జ్ఞానము - విపరీతజ్ఞానము మొదలగు ననిష్టములను పరిహరించువాడును, తత్త్వజ్ఞానము - భక్తి - వైరాగ్యము మొదలగు నభీష్టముల నిచ్చువాడును, ఐహికాముష్మిక ఫలముల నిచ్చువాడును చతుర్ముఖ బ్రహ్మ దేవుడు వాయుదేవుడు - అను నిరువురు కుమారులను బడసినవాడును ఐన శ్రీ శ్రీనివాసమూర్తిని వేవేళ్లప్పుడును భజింతును. (తెల్లవారుజామున నిద్రనుండి మేల్కొనునపుడును, పరుండబోవునపుడును, పారాయణాదులందును, ప్రయాణ కాలమందును మఱియు ఇతరములగు ఆపత్సమయములందును ఈ శ్లోకమును రెండుమార్లు పఠించినచో సర్వాభీష్టసిద్ధియగునని పెద్దల యనుభవము)

యదపాంగలవేనైవ బ్రహ్మాద్యాః స్వపదం యయుః ।
మహారాజాధిరాజానం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 8

అ:— ఎవరి కృపాకటాక్షలేశమాత్రముచే ఉత్తమాధికారులైన బ్రహ్మాది దేవతలు ఉత్తమ స్థానములైన సత్యలోకాదులయందు ఆధిపత్యాది పదవులను పొందియున్నారో (ఇంద్రుడు దేవలోకమునకు రాజు. రుద్రుడు కైలాసమునకు

రాజు. చతుర్ముఖబ్రహ్మ సత్యలోకమునకు రాజు) ఆ బ్రహ్మరుద్రాదులవెడు మహారాజులెల్లరకు చక్రవర్తియైన శ్రీనివాసమూర్తిని సదా భజింతుము.

అనంతవేదసంవేద్యం నిర్దోషం గుణసాగరమ్ ।
అతీన్ద్రియం నిత్యముక్తం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 9

అ:— అనంతవేదములచేతనే తెలియదగినవాడును, దోషలేశమైనను లేనివాడును, జ్ఞానానందాది గుణములకు సముద్రమువంటివాడును (పరిపూర్ణుడును), చక్షురాదీంద్రియములకు అగోచరుడును, నిత్యముక్తుడునగు శ్రీనివాసుని ఎల్లకాలము సేవింతును.

విశేషార్థము :—

1. 'వేదేహ్యేవైనం వేదయన్తి'= వేదములే పరమాత్మను ఎఱుకపఱచుచున్నవని భాల్లవేయశ్రుతి చెప్పుచున్నది.

2. 'నతత్రచక్షుర్గచ్ఛతి, నవాక్గచ్ఛతి, నోమనః'— ఇత్యాది శ్రుతులు ఏ యింద్రియములకును గోచరము కానివాడని చెప్పుచున్నవి.

స్మరణాత్సర్వపాపఘ్నం స్తవనాదిష్టవర్షిణమ్ ।
దర్శనాన్ముక్తిదం చేశం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 10

అ:— నామస్మరణముచే సకలపాపముల హరించువాడును, స్తోత్రము చేయుటచే భక్తుల యభీష్టములను కురిపించువాడును, దర్శనమువలన (పరోక్ష జ్ఞాన సాధనముచే అపరోక్ష జ్ఞానమునకు దారిచూపించుటవలన) ముక్తినిచ్చువాడును, భక్తుల స్తోత్రములచే (నిష్ఠజ్ఞానముచే) సంతుష్టుడును, సర్వస్వామియు నగు శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

'ధియారమతే' అనువ్యుత్పత్తిచే భక్తులయందు జ్ఞానముచే రమించువాడు. అనగా భక్తులకు అనుగ్రాహకుడు.

స్వామిపుష్కరిణీస్నానం శ్రీనివాసస్య దర్శనం ।
సహస్రనామపఠనం జన్మాంతర తపఃఫలమ్ ॥

అని పురాణాంతర వచనము.

అశేషశయనం శేషశయనం శేషశాయినమ్ ।
శేషాద్రీశమశేషం చ శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 11

అ:— జగత్తులో సర్వవస్తువులయందు (ఏవస్తువును వదలక) శయనించి యున్న (వ్యాపించియున్న) వాడును, సర్వుల హృదయాకాశములో నియామకుడై శయనించి (వ్యాపించి) యున్నవాడును మహాప్రళయకాలమునందు తానొక్కడే శేషించి వటపత్రముపై పరుండియుండుటవలన 'శేషుడ' నిపించు కొన్నవాడును, ఇతరకాలములందు ఆదిశేషునిపై పవళించియున్నవాడును, శేషపర్వతాధీశుడును, సర్వము తానే అయినవాడును అగు శ్రీనివాసుని నిత్యము భజింతును.

భక్తానుగ్రాహకం విష్ణుం సుశాన్తం గరుడధ్వజమ్ ।
ప్రసన్నవక్త్రనయనం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 12

అ:— తన భక్తుల ననుగ్రహించువాడును సర్వత్రవ్యాప్తుడును (సు-శ-అంతం) సజ్జనులకు సుఖమునిచ్చునట్టి అంతఃకరణము గలవాడును లేదా (సు-శాంతం) దుర్జనుల సుఖమును హరించువాడును, గరుడవాహనుడును, సజ్జనులయందు మిక్కిలి ప్రసన్నములైన ముఖనేత్రములు గలవాడునగు శ్రీనివాసుని సదా భజింతును.

భక్తభక్తిసుపాశేన బద్ధసత్పాదపంకజమ్ ।
సనకాదిధ్యానగమ్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 13

అ:— తన భక్తుల భక్తియనెడి సుఖకరమైన త్రాటిచే బంధింపబడిన ఉత్తమములగు పాదపద్మములు గలవాడును, సనకసనందనాది మునులకు

ధ్యానముచే గోచరించువాడునగు శ్రీనివాసుని నేనెల్లప్పుడు సేవింతును.

విశేషార్థము :—

లోకములో త్రాటితో కట్టుటవలన దుఃఖమే కలుగును. ప్రకృత పాశమునకు 'సు' అను విశేషణము నిచ్చుటవలన భక్తిరూపమగు పాశము సుఖకరముగా నుండుటచే ఈ పాశముచే బద్ధుడైన శ్రీహరి ప్రసన్నుడుగానే యుండునని సూచింపబడినది. అనగా భక్తులు చేయు భక్తికి మెచ్చి లొంగి యుండునని భావము.

అవ :— భక్తితో బంధించునట్టి భక్తులందు శ్రీహరి ప్రసన్నుడై, భక్తులనెట్లు తరింప జేయునో ఆ లక్షణములను చెప్పుచున్నాడు.

గంగాదితీర్థజనకపాదపద్మం సుతారకమ్ ।
శంఖచక్రాభయవరం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 14

అ :— గంగాది పుణ్యతీర్థములకు జననస్థానమైన పాదపద్మములు కల వాడును, భక్తులను సంసారమునుండి తరింపజేయువాడును, శంఖము - చక్రము- అభయముద్ర - వరముద్రలను నాలుగుచేతులందు ధరించినవాడునగు శ్రీనివాసుని సదా సేవింతును.

సువర్ణముఖితీరస్థం సువర్ణేడ్యం సువర్ణదమ్ ।
సువర్ణాభం సువర్ణాంగం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 15

అ :— సువర్ణముఖి నదీతీరమునందుండువాడును, శోభనవర్ణములు గల వేదములచే స్తుత్యుడును, భక్తులకు ధనధాన్యాది సంపద్రూపమును మంచి సువర్ణము (వేదార్థజ్ఞానము) నిచ్చువాడును, బంగారుఛాయవంటి ప్రకాశము (వేదములచే బాగుగ ప్రకాశింపజేయబడినవాడు) గలవాడును, బంగారుమయ మైన కిరీటకుండలాద్యాభరణములచే నలంకృతములైన అంగములు (లేదా లక్ష్మీదేవితో యుక్తమైన శరీరము) కలవాడునగు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

సువర్ణాః = వేదములు, అ = బాగుగ, 'భాః (భాదీప్తౌ) ప్రకాశితాః వ్యక్తాఃయేన' అను వ్యుత్పత్తిచే వేదవ్యాసరూపముతో ఋగాది వేదములను బాగుగ అభివ్యక్తీకరించినవాడు.

శ్రీవత్సవక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహమ్ ।
శ్రీమత్తం శ్రీనిధిం శ్రీర్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 16

అ :— 'శ్రీవత్స' మనెడు మచ్చను వక్షఃస్థలమునందు కలిగియున్న వాడును, లక్ష్మీపతియును, లక్ష్మీదేవితో కలిసి హావభావ విలాసములయం దాసక్తి కలవాడును, లక్ష్మీదేవిని తన పాణిపద్మముతో గ్రహించినవాడును, ఋగ్వేదాది సర్వవిద్యా పరిపూర్ణుడును, సమస్తైశ్వర్యములచే సంపూర్ణుడును, శ్రీభూదుర్గారూపములతో విలసిల్లు రమాదేవిచే స్తుత్యుడును అయిన శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

1. 'శ్రియః శం సుఖం యస్మాత్ సః' = శ్రీశః అనువ్యుత్పత్తి ననుసరించి లక్ష్మీదేవికి సుఖమునిచ్చువాడని యర్థము.

2. శ్రియః=ప్రకాశములు, 'నిధీయన్తే అస్మిన్' అనువ్యుత్పత్తి ననుసరించి 'శ్రీనిధిః' = ప్రకాశములకు ఆశ్రయుడని యర్థము.

వైకుంఠవాసం వైకుంఠత్యాగం వైకుంఠసోదరమ్ ।
వైకుంఠదం వికుంఠాజం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 17

అ :— వైకుంఠములో నుండువాడును, భక్తులకొఱకై వైకుంఠమును విడిచి శేషగిరికి వచ్చినవాడును, 'వైకుంఠుడు' అను పేరుగల సోదరుడుగల వాడును, ఎప్పుడును కొఱతలేని మోక్షసుఖము నిచ్చువాడును, 'వికుంఠా' యను తల్లి గర్భమునుండి ప్రాదుర్భవించిన వాడును అగు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

మాయాపి పరమానందం త్యక్త్వా వైకుంఠముత్తమమ్ ।
స్వామిపుష్కరిణీ తీరే రమయా సహ మోదతే ॥

అను పురాణ వచనామసారము వైకుంఠమును వదలి, స్వామిపుష్కరిణీ తీరమున లక్ష్మీదేవితో విహరించువాడు.

అవ :— దశావతారములను ధరించిన శ్రీనివాసుని స్తుతించుచున్నాడు.

వేదోద్ధారం మత్స్యరూపం స్వచ్ఛాకారం యదృచ్ఛయా ।
సత్యవ్రతోద్ధరం సత్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 18

అ :— తన ఇచ్ఛతోనే స్వచ్ఛము, సుందరమునగు మత్స్యరూపమునుదాల్చి హయగ్రీవుడను రాక్షసుడు అపహరించుకొని పోయిన వేదముల నుద్ధరించి చతుర్ముఖున కిచ్చినవాడును, జలప్రళయములో సత్యవ్రతుడను రాజర్షిని తన సంకల్పము మేరకు ఉద్ధరించి 'సత్యుడ' ని అనిపించుకొనినవాడును అగు శ్రీనివాసుని ఎల్లప్పుడు సేవింతును.

విశేషార్థము :—

I 'సత్య' శబ్దమునకు అనేకార్థములు గలవు.

1. 'సద్భావం యాపయేత్ యస్మాత్ సత్యం తత్తేన కథ్యతే' అను ప్రమాణమునమసరించి జగత్తును సృష్టించినవాడు.

2. 'సత్వం యాపయతి' = సర్వప్రాణులకు జీవనమును, నాశమును కల్పించువాడు.

3. 'ఉక్తం సదితి ధాత్వర్థో గతిర్జ్ఞాతోహి సత్యతా । సత్యేన ప్రాణత్వం' అను ప్రమాణమునమసరించి, సత్ = సర్వప్రాణులకు గతినిచ్చువాడు, 'ప్రాణం దేవా అనుప్రాణంతి మనుష్యాః పశవశ్చ యే' అను శ్రుతిచే శ్రీహరికి గతిప్రదత్వము ప్రసిద్ధమైనది.

4. 'భాగవత తాత్పర్య' మను గ్రంథమునందు 'సత్యం పరం ధీమహి' అనుచోట 'సత్యం నిర్దుఃఖ నిరతిశయానందానుభవస్వరూపమ్' అని వ్యాఖ్యానింపబడినది.

5. ఐతరేయ భాష్యమునందు 'సచ్ఛబ్దముత్తమం బ్రూయాత్' 'తను విస్తారే' 'యా ప్రాపణే' అను ధాతువుల ననుసరించి

పఏష భగవాన్ విష్ణుః సత్యమిత్యభిధీయతే ।
సర్వోత్తమత్వాత్ పూర్ణత్వాత్ సర్వజ్ఞత్వాత్ తథైవ చ ॥

అను ప్రమాణముననుసరించి సత్యః = సర్వోత్తముడు, సర్వగుణపూర్ణుడు, సర్వజ్ఞుడు – అని పిలువబడుచున్నాడు.

6. ఛాందోగ్యభాష్యమునందు –

సదిత్యమర ధర్మాణః ముక్తాః శ్రీరపి చేరితా ।
ఇత్యుక్తా మర్త్యధర్మాణః తేషాం నియమనాద్ధరిః ॥
'సత్యమిత్యుచ్యతే సద్భిః'
ముక్తాముక్తులకు నియామకుడగుటచే 'సత్య' మనబడుచున్నాడు.

7. 'సాదయతీతి సత్' నాశాదులను కల్పించువాడు. 'యామయతీతి యం' = ప్రేరేపించువాడు. 'సచ్చతత్యంచ సత్యం' 'తస్యోపనిషత్ సత్యస్య సత్యం' 'ఏష ఏవ ఏతత్ సాదయతి యామయతీతి' శ్రుతిః.

II 1. ప్రళయకాలములో భూర్భువాది లోకములు సముద్రములో మునిగిపోయినవి. చతుర్ముఖుని నోట వెడలిన నాలుగు వేదములను బలిచక్రవర్తి సమీపమందున్న హయగ్రీవుడను రాక్షసుడు అపహరించి సముద్రమున దాగెను. శ్రీహరి మత్స్యరూపమును దాల్చి ఆ అసురుని చంపి పునః వేదములందెచ్చి బ్రహ్మకిచ్చెను.

2. తతోహరిర్జగృహే మత్స్యరూపం
మన్వంతరే చాక్షుషే నాశకాలే ।

వావ్యాం సమారోప్య మహీం చరంతం
పాతుం మనుం వైవస్వతం లయోదే ।

గారుడపురాణము అధ్యా 15, శ్లో. 16

మత్స్యో యుగాంతసమయే మనునోపలబ్ధః
క్షోణీమయో నిఖిల జీవనికాయకేతః ।
విస్రంసితానురుభయే సలిలే ముఖాస్మ
ఆదాయ తత్ర విజహార హ వేదమార్గాన్ ।

సత్యవ్రతుడను రాజు సముద్ర జలములో తపమాచరించు చుండెను. ఒకనాడు సువర్ణకాంతిగల యొక చిన్న చేప ఆతని చేతిలోనికి వచ్చెను అతడా చేపను నదిలో విడువ బూనగా ఆ చేప తనను కాపాడుమని రాజును ప్రార్థించినది సత్యవ్రతుడు కమండలమునందుంచి అ చేపను ఆశ్రమము నకు తీసికొని వెళ్ళెను. అది కమండలము నందు పెద్దదయ్యెను. అట్లే ఎచ్చ టెచ్చట ఉంచినను అది క్షణక్షణమునకు పెరుగుచు మిక్కలి పెద్దదగుచుండెను. నద్యాదులందు మఱంత పెఱుగజొచ్చెను చివరకు రాజు దానిని జూచి ప్రార్థింపగా తాను సాక్షాత్ నారాయణుడనని చెప్పి, 'చాక్షుష మన్వంతర ప్రళయకాలములో నిన్ను ఉద్ధరింతు' నని చెప్పెను. కడకు ప్రళయావంతము నందు పదిలక్షల యోజనముల విస్తీర్ణమైన సువర్ణమయ మత్స్యరూపము ప్రాదుర్భ వించెను. ఆ పిమ్మట సత్యవ్రతుడు శ్రీహరిని గురించి ధ్యానించెను. శ్రీహరి మత్స్యరూపముతో వా రాజునకు కర్మ-జ్ఞాన-భక్తి యోగముల నుపదేశించి రక్షించెను. ఆ సత్యవ్రత రాజే అటుపిమ్మట 'వైవస్వంతమను' వాయెను. (భాగవతము స్కంధము 8, అధ్యాయము 24).

మహాగాధ జలాధారం కచ్ఛపం మన్దరోద్ధరమ్।
సుందరాంగం చ గోవిన్దం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 19

అ:- మిక్కలి లోతైన బ్రహ్మాండ జలావరణమునకు ఆధారమైనవాడును అమృతప్రాప్తి కొఱకై సముద్ర మథన సమయమున మందర పర్వతము వెత్తిన

వాడును, అట్టి తిర్యగ్జంతువుల రూపమును ధరించినప్పుడు పైతము కురూపి గాక, అతి సుందరమగు దేహము గల్గిన వాడును, విశేషమైన తేజస్సుగల కూర్మరూపియునైన గోవిందుడనెడు శ్రీనివాసుని సదా సేవింతుము.

విశేషార్థము :—

1. పీఠపూజా ప్రకరణములో 'అగాధ జలాధార విష్ణుకూర్మాయతేనమః' అని కలదు.

2. అథాతి భారాదవిశత్సుకాంచనో గిరిః స పాతాలమథ త్వమేవ।
తం కచ్ఛపాత్మా త్వభరః స్వపృష్ఠే హ్యావవ్యధార్యం పురులీలయైవ॥

మహాభారత తాత్పర్య నిర్ణయము, అ. 10, శ్లో॥ 11

స్వర్ణమయమైన మందరపర్వతము పాతాళలోకమును ప్రవేశించెను. భగవంతుడు కూర్మరూపముతో దానిని వీపుమీద ధరించి అవలీలగా పైకితెచ్చెను. అటుపిమ్మట దేవాసురులు క్షీరాబ్ధిని మథించి అమృతము సంపాదించిరి.

అమరేంద్రవైరి భుజదండమండల ప్రతికర్షపుష్కర పతద్ధరోద్ధృతిః

మ. వి. వ. 8 శ్లో॥ 15

శరణాగతులకు మోక్షము నిచ్చి రక్షించు శ్రీమన్నారాయణుడు, దేవదానవులు క్షీర సముద్రమును చిలుకునపుడు సముద్రములో మునుగుచుండు ఆ మందర పర్వతమును తాబేటి రూపమున ధరించి పైకెత్తెను.

3. తతో హరిర్జగృహే కూర్మరూపం
సురాసురాణా ముదధిం విమథ్నతాం।
పృష్ఠే ధర్తుం మందరం పర్వతం చ
తథైవాండం ధర్తుమిశో మహాత్మా॥

(గా, అ. 15 శ్లో 17)

4. 'దృక్ ధేను దీప్తి స్వర్గేషు గోశబ్దః పరికీర్తితః' అను స్మృతిని ననుసరించి 'గోవింద' శబ్దమున కనేకార్థము లున్నవి. 'విద్ల్ — లాభే' ప్రకారమును

కోలిగియున్నవాడు. 'గోవింద' సముద్రజలమును ప్రవేశించినవాడు ధృత రాష్ట్రునకు విశ్వరూప దర్శన సమయమున నేత్రము లిచ్చినవాడు.

5. భూమిని, బాణమును, ధేనువును, స్వర్గమును వేదములను కలిగిన వాడు. లేదా సమస్త వేద ప్రతిపాద్యుడు.

వరం శ్వేతావరాహాఖ్యం సంహారం ధరణీధరమ్।
స్వదంష్ట్రాభ్యాం ధరోద్ధారం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 20

అ:— వికృతములు కాని ఉత్తమాంగములు గలవాడును, శ్వేతవరాహ మను పేరు గలవాడును, భూమిని అధోలోకమునకు తీసికొని పోయిన హిరణ్యా క్షుని సంహరించినవాడును, తన కోరలతో భూగోళమును ధరించి పైకి తెచ్చి సుస్థిరముగ స్థాపించినట్టి శ్వేత రూపియగు శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

'విదధే వరాహవపుషాఽమునోర్మిమత్
శ్రుతి సింధు కచ్ఛపతయాఽఽప్త రక్షిణా'

(మ. వి. వ. 8 శ్లో 15)

తతో హరిః ప్రాదురభూన్మహాత్మా
నృసింహనామా భగవాన్ స్తంభతశ్చ।
దైత్యం హిరణ్యకశిపుం స్వోరుదేశే
సంస్థాప్య తం కరజైర్దారయత్సుస్మ కోపాత్॥

(గా. వ. అ. 15. శ్లో 20)

పూర్వము దేవతలకు విరోధియైన హిరణ్యాక్షుడను దానవుడు తన వేయి చేతులతో భూమిని లాగగా భూమి నీటియందు మునుగుచుండెను. అపుడు నారాయణుడు వరాహావతారము నెత్తి ఆ హిరణ్యాక్షుని సంహరించి భూమి నుద్ధరించెను.

ప్రహ్లాదాహ్లాదకం లక్ష్మీనృసింహం భక్తవత్సలమ్।
దైత్యమత్తేభదమనం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 21

అ:- భాగవతోత్తముడైన ప్రహ్లాదుని సంతోష పఱచిన వాడును, భక్తుల యందు అధికవాత్సల్యము గలవాడును, మదించిన గజములవలె మహాదైత్యులను మర్దించినవాడును అయిన లక్ష్మీ నరసింహ స్వరూపుడగు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :-

1. నరసింహ ఏష విదదార దారుణం
ప్రతిఘోదయే నఖర చక్ర తేజసా।
స్వరిపుం క్షణేన పరసః స్ఫురత్తమం
పృథు సత్త్వ మిష్టజన భీతి భంజనః॥
(మ. వి. వ. 8, శ్లో 16)

మహా బలుడైన నారాయణుడు భక్తుల భయమును పోగొట్టుటకై నరసింహావ తారమెత్తి, బాలుడైన ప్రహ్లాదుని పీడించుచున్నవాడును, బలాఢ్యుడును, అతని తండ్రియునగు హిరణ్యకశిపుని కోపముతో గోళ్ళతో చీల్చి చంపెను. మఱియు బలవంతమైన మొసలి నోటిలో చిక్కి మిగుల బాధపడుచున్న తన భక్తుడగు గజేంద్రుని రక్షించు నిమిత్తమై ఆ మొసలిని సరోవరమునుండి పైకి లాగి తన చక్రాయుధముతో చీల్చి చంపినాడు.

2. (పైన వివరించిన విధముగా) ప్రహ్లాదుడు సంతోషించె ననగా తనకు తండ్రివలన కలుగుచున్న విషభక్షణాద్యు పద్రవములు తీరినవనిగాని, తండ్రి రాజ్యము నిష్కంటకమై తనకు లభ్యమైనదనిగాని సంతోషింపలేదు. తన తండ్రిని వధించెనని కోపింపనులేదు. మఱి దేనికి సంతోషించినట్లు? భగవంతుని దర్శనము, అనుగ్రహం కలుగుటయే మహాభాగ్యమనియు, అనాదికాలము నుండి తనకున్న జనన మరణ పరంపరా ఘటితమైన సంసారమను మహా బంధనము విచ్ఛిన్నమై పోయెనని సంతోషించెను. జీవహింస చేయరాదను

ధర్మశాస్త్రము నెఱిగిన సాధువులుకూడ ప్రాణులకు పీడాకరములగు సర్ప వృశ్చికాదులను చంపుట వలన సంతోషించుచున్నారు. అట్లే లోకకంటకుడైన నీ తండ్రిని చంపినందులకు లోకమంతయు నిష్కంటకమైనదని సంతోషింపగా, నీవు మాత్రము దుఃఖించుదువా?

ప్రహ్లాద మేఽతి ప్రియోఽసి తవాద్య మభద్ర భద్రం
భద్రకామం వరం చ సువృణీష్వ మత్తస్త్వమేవ।
విషయేషు రతిర్నిత్యం యథా న స్యాన్మహాప్రభో।
తథైవ మే వరం దేహి।
మదాజ్ఞయా త్వం రాజ్యం చ ప్రశాధిష్వ మహాబలః।
మదర్పణాచ్చ సంసారలేపో నైవ భవేత్తవ।
ప్రహ్లాదో హరిముద్దిశ్య రాజ్యం సర్వమపాలయత్।

(గారుడ పు. అ. 40. శ్లో 103–107)

ప్రహ్లాదా! నీవు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడవు. నీకు పరమమంగళ మగుగాక. కావలసిన వరమును అడుగుమని శ్రీ నరసింహుడు చెప్పెను. అందులకు ప్రహ్లాదు డిట్లు ప్రార్థించెను. 'నాకు విషయములయందాసక్తి సర్వథా ఉండరాదు. అట్టి వరము ప్రసాదింపు'మనగా నరసింహుడు అను గ్రహించెను. 'నా ఆజ్ఞచే రాజ్యమును పాలింపుము. నా యందే ఆసక్తుడ వగుము. సంసార లేపనాదులు నీ వద్దకు రాజాలవు.' అని హితబోధచేసి నరసింహుడు అదృశ్యుడయ్యెను. ప్రహ్లాదుడు భగవదాజ్ఞమేరకు రాజ్యమును రక్షించుచుండెను.

వామనం వామనం పూర్ణకామం భామనమాణవమ్।
మాయినం బలిసంమోహం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 22

అ:— దైత్యుల అహంకారమును (క్రోధమును కల్గించు) నాశనముజేయు, లేదా, శోభనములైన భక్త్యాదిగుణములచే భక్తుల నాకర్షించు ఓజస్సుతో, పౌరుషముతో కూడిన సంపూర్ణ మనోరథముగల సుందరమైన రూపముతో,

బాలబ్రహ్మచారి వేషమును ధరించినవాడై, బలిచక్రవర్తిని మోహింపజేసిన వామనరూపియగు శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

1. అపి వామనో లలిత బాల్య వానయం
ప్రతిభాబలేన కృతదైత్య కౌతుకః।
ఉపధేరధః కృత బలిర్ద్విశాత్రవః
స్వజనాయ కేవల మదాత్పరం పదమ్॥

(మ. వి. వ. 8 శ్లో 17)

తతో హరిర్భగవాన్ వామనోఽభూ
దదిత్యాయాం కశ్యపాద్దేవదేవః।
ఇంద్రాయేమం దాతుకామః స్వర్లోకం
తదర్థం వై యాచయితుం బలిం చ।

(గారుడ అ. 15 శ్లో 21)

అదితిదేవియందు కశ్యపుని వలన వామనావతారము నెత్తి శ్రీహరి (పొట్టివాడై) కపటముచే దైత్యరాజగు బలిని మూడడుగుల భూమిని వేడెను. అతడిచ్చుట కంగీకరించెను. అనంతరము బ్రహ్మాండమంతయు వ్యాపించినవాడై ఆ బలిచక్రవర్తిచే మూడడుగుల భూమిని కొలిచి తీసికొను నెపమున అతనిని పాతాళమునకు త్రొక్కి, తనభక్తుడైన దేవేంద్రునకు త్రైలోక్యాధిపత్యము నొసంగెను.

2. వామనుడుగా నున్నప్పటికిని అతిసుందరబాలుడని కొనియాడబడెను.

వామన వామన భామన వందే।
వామన వామన మాణవవేష॥— అని ద్వాదశస్తోత్రము.

3. ఇచట బలిచక్రవర్తికి మోహము కల్పించుటయనగా —

దైత్యవంశమున జన్మించి, దైత్యులకు చక్రవర్తిగా ఉండి, దైత్యులకు సహజమైన హరిద్వేషాదులు లేనట్టి భగవద్భక్తునికి మోహము కల్పించుట —

అవగా మోసముచేయుట యుక్తమా? అను శంక గలుగుచున్నది. వామన మూర్తి దర్శనానంతరము బలిచక్రవర్తి మూడడుగుల భూదానమువలన తనకు గాని, తనవారికిగాని త్రిలోకాధిపత్యము, భోగైశ్వర్యములు తప్పిపోవునని యూహింపక, స్వార్థమును మఱచిపోవుటయే మోహము నొందుటయని తెలియ వలెను. బలిచక్రవర్తి స్థిరమతిగల మహాభాగవతుడైనను తనకు కలిగిన రాజ్య భ్రంశమును గురించి ఎంతమాత్రము చింతపడలేదు. అందులకే శ్రీహరికి 'మాయినం' = తన ఇష్టానుసార ముండువాడు-అను విశేషణమును ముందుగా చెప్పిరి. వామనమూర్తి తన దర్శనమాత్రముచే బలిచక్రవర్తి యొక్క మనో వృత్తిని తన కనుకూలముగా మార్చివేయుటయే మోహము కల్పించుట యని భావము.

చంద్రాననం కున్దదన్తం కురాజఘ్నం కుఠారిణమ్ ।
సుకుమారం భృగుబుషేః శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 23

అ:— చంద్రబింబమువంటి ఆహ్లాదకరమైన ముఖముకలవాడును, మల్లె పూలవంటి సుందర దంతపంక్తి గలవాడును, కుత్సితులైన దుష్టక్షత్రియులను ఇరువదియొక్కమార్లు సంహరించినవాడును, గొడ్డలిని ధరించినవాడును, భృగువంశములో జన్మించిన సుకుమార కుమారుడును, పరశురామరూపుడునగు శ్రీనివాసుని సదా సేవింతును.

శేషార్థము :—

కథయంత్యముం పరశుభాసమాన గో
హతమర్త్యదేవ తమసం ముహుర్ముహుః ।
జగతాం హితం హరిమిహావరం హరిం
గురుశక్తి తాపన వరాన్వయోద్భవమ్ ॥
(వ. వి.వ. 8, శ్లో 18.)

తతో హరిర్జమదగ్నేః సుతోఽభూ
ల్లోకే వ వై పరశురామేతి సంజ్ఞకః ।

బ్రహ్మద్రుహాణాం క్షత్రియాణాం చ పీంద్ర
భూమౌ నిఃక్షత్రం కర్తుమిశో మహాత్మా ॥
(గారుడ పు. అ. 15, శ్లో. 22.)

శ్రీహరి పూర్వము మిగుల సమర్థవంతమైన భృగువంశమునందు జనించి పరశురాముడని విఖ్యాతుడై ఇరువదియొక్కమారులు బలదర్పముగల దుష్ట క్షత్రియులను తన గొడ్డలిచే సంహరించి జగత్తునకు హితముచేసెను. సాధు రక్షణ, దుష్టశిక్షణయే అతని ప్రధానకార్యము.

శ్రీరామం దశదిగ్వ్యాప్తం దశేన్ద్రియనియామకమ్ ।
దశాస్యఘ్నం దాశరథిం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 24

అ:— పరిమితిలేని సుఖరూపమైనవాడును, పదిదిక్కులందు వ్యాపించి యుండువాడును, దశేంద్రియముల కభిమానులైన దేవతలను శాసించువాడును, దశముఖుడైన రావణుని సంహరించినవాడును, దశరథుని కుమారుడును అగు శ్రీరామచంద్ర రూపుడగు శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము:—

'రామ' పదమునకు అనేకార్థములు గలవు.

1. 'రమాయాః పతిరయం రామః' = రమాదేవికి పతియగుటంజేసి రాముడు.

2. రమంతే యోగినోఽనంతే సదానందే చిదాత్మని ।
ఇతి రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే ॥

3. 'రమతే ఇతి రః, న విద్యతే మాయస్య పః అమః, రశ్చాసౌ, అమశ్చ రామః' = పరిమితిలేక యథేష్టముగా క్రీడించువాడు కమక, రాముడు, 'రమయతీతి రామః' లక్ష్మితో క్రీడించువాడు.

4. ఆనందస్వరూపుడైనందువలనను, సర్వగుణపూర్ణుడైనందువలనను, సజ్జనసమూహమునకు ఆనందదాయకుడగుటచేతను రాముడని, 'ఆనందరూపో

విస్ఫురిమాణ ఏషః లోకశ్చైచ తస్మాద్రమతే తేన రామః’ అని శాండిల్యశాఖా వచనము. సదా ఆనందస్వరూపుడు, చిదాత్మరూపుడునగు అతనియందే యోగులు సదా రమించుటవలన ‘రాముడు’ అని చెప్పబడుచున్నాడు. ‘రామ’ అను పదముచే పరబ్రహ్మ చెప్పబడుచున్నాడు. రాముడనగా సాక్షాత్తు పర బ్రహ్మస్వరూపుడే యని భావము.

5. ఎనిమిది దిక్కులు, ఊర్ధ్వఅధోదిశలు కలిసి దశదిశలైనవి.

6. వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలు - అను పంచేంద్రియములు. చక్షుః - శ్రోత్ర - ఘ్రాణ - రసనా - త్వక్ - అను పంచ జ్ఞానేంద్రియములు కలిసి దశేంద్రియములు.

7. తతో హరీరఘువంశేఽవతీర్ణః కౌసల్యాయాం దశరథాత్పూర్వపంశే ।
సముద్రాదీన్నిగ్రహం కర్తుమీశో హంతుం భూమ్యాం రావణాదీంశ్చ వీంద్ర ॥

(గారుడ పు. అ. 15, శ్లో. 24)

శ్రీహరి సేతుబంధనాదులను చేయుటకును, రావణాదులను సంహరించుటకును సూర్యవంశమున రఘుకులములో దశరథునివలన కౌసల్యాదేవికి రాముడుగా నవతరించెను.

గోవర్ధనోద్ధరం బాలం వాసుదేవం యదూత్తమమ్ ।
దేవకీతనయం కృష్ణం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 25

అ :— బాలుడయినను గోవర్ధనగిరిని పైకెత్తినవాడును, వసుదేవుని పుత్రుడును, యాదవులలో నుత్తముడును, దేవకీదేవి తనయుడును, కృష్ణవర్ణము గలవాడును, లేదా సదా ఆనందస్వరూపుడును, శ్రీకృష్ణరూపుడును ఐన శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

1. యతః కర్షసి దేవేశ నియమ్య సకలం జగత్ ।
అతో వదంతి మునయః కృష్ణం త్వాం బ్రహ్మవాదినః ॥

(మహాభారతము)

భగవంతుడు సర్వజగత్తును నియమించుచు, ఆకర్షించి తనవశమున నుంచు కొనుటవలన బ్రహ్మజ్ఞానులైన మునులు శ్రీహరిని 'కృష్ణు'డని చెప్పుచున్నారు. కృష్ణుని స్మరించుటవలన కలిదోషము దూరమగును.

2. కృష్ణరూపుడగుటచేతను, పాపమనెడి మూలమునకు అగ్ని సదృశుడగుటచేతను కృష్ణుడనబడుచున్నాడు.

3. 'వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః' వసుదేవుని కుమారుడగుటవలన 'వాసుదేవుడు'

4. వాసాత్సూతేః దేవనాద్వాసుదేవః వాసాద్ద్యుతేః ఛాదనాత్క్రీడయా చ।
బలాదసుత్వాద్దాతృతో వర్తనాచ్చ తం వాసుదేవం ప్రవదంతివేదాః॥

అనగా వా = వాసాత్ = జ్ఞానాధిక్యమువలన, సు = సూతేః = జగత్సృష్టిచేయుట దే = దేవనాత్ = క్రీడాది గుణములుండుట వలన వాసుదేవుడు, వా—గతిగంధనయోః, షూఙ్ = ప్రాణప్రసవే, దివ్ = క్రీడావిజిగీషా వ్యవహార-ద్యుతి-స్తుతి-మోద-మద-స్వప్న-కాంతి-గతిషు' అను మూడు ధాతువులనుండి పుట్టినది 'వాసుదేవ' శబ్దము.

వాసాత్ = సర్వత్ర వసించుటవలన, మఱియు సర్వుల వాసమునకు ఆశ్రయుడగుటవలన (వస = నివాసే) ద్యుతేః = ప్రకాశస్వరూపుడైనందున వాసుదేవుడు.

ఛాదనాత్ = సర్వమును అవిద్యాదులచే నావరించియుండుట వలన (వస = అచ్ఛాదనే) క్రీడించియుండుటవలన వాసుదేవుడు.

వ = బలాత్ = బలముండుటవలన, (అసు = అసుత్వాత్) ప్రాణముగా నుండుటవలన, దేవః = భక్తుల కభీష్టప్రదుడు వాసుదేవుడు.

దాతృతః = భక్తుల కభీష్టముల నిచ్చుటవలన, వర్తనాచ్చ = సర్వత్ర ఉండుటవలనను (వసతీతి = వాసుః) వాసుదేవునికి దేవః = స్వామియైయుండుటవలనను వాసుదేవుడు.

'వార్థం అసుదేవః యస్మాత్' = సర్వులకు జ్ఞానోపదేశము కొరకు వాయుదేవుని సృష్టించినవాడు నగుటవలన వాసుదేవుడు అనుచున్నాడు.

'వృతు = వర్తనే' వ = సర్వత్రనుండువాడు. అసు = ప్రాణరూపుడు. దేవః = క్రీడాదిస్వరూపుడు వాసుదేవుడు.

5. తతో హరిః కృష్ణరూపో బభూవ
దేవక్యాం వై వసుదేవాచ్చ విష్ణుః ।
కంసాదీనాం నితరాం హన్తుకామో
సమ్యక్ కర్తుం పాండవానాం ఖగేంద్ర ॥

గారుడ పు. అ. 15, శ్లో. 26.

కంసాదులను సంహరించుటకును, పాండవుల నుద్ధరించుటకును శ్రీహరి వసుదేవునివలన దేవకీదేవియందు శ్రీకృష్ణుడై యవతరించెను.

నన్దనన్దనమానన్దం ఇన్ద్రనీలం నిరంజనమ్ ।
శ్రీయశోదాయశోదం చ శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 26

అ:— నందగోపుని కుమారుడును, ఆనందస్వరూపుడును (లేదా భక్తులకు ఆనందమును కలిగించువాడును), ఇంద్రనీలమువంటి దేహచ్ఛాయకలవాడును, దోష లేశమైనను లేనివాడును, సంపన్నురాలైన యశోదాదేవికి యశస్సు నిచ్చువాడునగు కృష్ణరూపుడైన శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము:—

కరుణాకరః స వసుదేవమోదదో
భగవాన్ పురా హిమకరాన్వయేఽభవత్ ।
జితవాన్ దిశో దశరథోఽగ్ర్యసంపదో
జనకో బభూవ భువి యస్య వైరిహా ॥

(మ. వి. వ. 8–19)

దయాళువైన శ్రీనారాయణుడు వసువులకు, దేవతలకు ఆనందము నిచ్చుటకు త్రేతాయుగమున సూర్యవంశమునందు దశరథుడను రాజునకు కుమారుడై

శ్రీరామచంద్రుడను పేరుతో అవతరించి, రావణాది రాక్షసులను సంహరించి సజ్జనుల నుద్ధరించెను. ద్వాపరయుగమున చంద్రవంశమునందు వసుదేవుని పుత్రుడై కృష్ణుడను పేరుతో దుష్టులైన దుర్యోధనాదులను వధించి పాండవుల నుద్ధరించెను.

గోవృందావనగం బృన్దావనగం గోకులాధిపమ్।
ఉరుగాయం జగన్మోహం శ్రీనివాసం భజేఽనిశమ్ । 27

అ:— గోవుల సమూహమును రక్షించుటలో ఆసక్తి కలవాడును, బృందావనక్షేత్రంలో వసించువాడును. గోకులమున కధిపతియును, అధికముగా గానాదులచేత పొగడదగిన (లేక వేదములచే ఉత్కృష్టముగా స్తుతింపబడు) వాడును, జగత్తును మోహింపజేయువాడువగు కృష్ణరూపియైన శ్రీ శ్రీనివాసుని సదా భజింతును.

పారిజాతహరం పాపహరం గోపీమనోహరమ్ ।
గోపీవస్త్రహరం గోపం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 28

అ:— సత్యభామకోరిక తీర్చుటకై దేవలోకమునుండి పారిజాతవృక్షమును భువికి తెచ్చినవాడును, భక్తుల పాపములను హరించువాడును, గోపికల మనస్సులను రంజింపజేయువాడును, యమునాతీరమున గోపికాస్త్రీల వస్త్రములను అపహరించినవాడును, తానే గోవులను రక్షించుచు గోపాలుడైయుండిన కృష్ణ రూపియునగు శ్రీ శ్రీనివాసుని సదా భజింతును.

కంసాంతకం శంసనీయం సంశాంతం సంప్రతిచ్ఛిదమ్ ।
సంశయచ్ఛేది సంవేద్యం శ్రీనివాసం భజేఽనిశమ్ ॥ 29

అ:— కంసుని వధించినవాడును, ఉత్తములగు బ్రహ్మాదిదేవతలచే స్తుతింప బడువాడును, శాంతిసౌఖ్యములచే పరిపూర్ణుడును (లేదా భక్తులకు తారతమ్యా నుసారము సుఖమువిచ్చి, ద్వేషులకు సుఖమే కలుగనియ్యనివాడును), సజ్జను లకు జన్మమృత్యురూపమగు సంసారమును పోగొట్టి ముక్తినిచ్చువాడును, భక్తు

లకు సంశయ విపరీతాది జ్ఞానములను పోగొట్టి, తత్త్వజ్ఞానముచే బోధ్యుడును అయిన కృష్ణరూపియగు శ్రీ శ్రీనివాసుని సదా భజింతును.

కృష్ణాపతిం కృష్ణగురుం కృష్ణామిత్ర మభీష్టదమ్।
కృష్ణాత్మకం కృష్ణ సఖం శ్రీనివాసం భజేఽనిశమ్॥

అ:— సత్యభామాదేవికి పతియు, భీమార్జునులకు గురువును, ద్రౌపది రక్షకుడును, భక్తుల కభీష్టముల నిచ్చువాడును, వసిష్ఠ వంశోద్భవుడగు వ్యాస మౌని రూపుడును, అర్జునునకు మిత్రుడును, యదుకులోత్తముఁడైన కృష్ణరూపియు నగు శ్రీ శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

1. 'సత్యా భీమ పార్థౌ కృష్ణేత్యుక్తే హి భారతే'

సత్యభామ, భీముడు, అర్జునుడు, ఈ ముప్వురును కృష్ణ నామధేయము కలవారని మహాభారతములో కలదు

2. 'కృష్ణాయ కృష్ణా రమణ ప్రియాయ'

ద్రౌపదికి కూడ 'కృష్ణ' నామధేయము కలదని చెప్పుచున్నారు.

కృష్ణాఽహి మర్దనం గోపైః కృష్ణోపవన లోలుపమ్।
కృష్ణాతాతం మహోత్కృష్టం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 31

అ:— కాళియుడను కృష్ణసర్పము (నల్లని నాగుపాము) ను మర్దించిన వాడును, గోపబాలురతోడను, గోపికా స్త్రీలతోడను యమునా తీరములోని ఉపవనములలో క్రీడించుట యందాసక్తిగల వాడును, కృష్ణవేణీ నదికి జనకుడును, రమా బ్రహ్మాది దేవతలకంటె అత్యుత్తముడునగు కృష్ణ రూపియైన శ్రీ శ్రీనివాసుని సదాభజింతును.

బుద్ధం సుబోధం దుర్బోధం బోధాత్మానం బుధ ప్రియమ్।
విబుధేశం బుధైర్బోధ్యం శ్రీనివాసం భజేఽనిశమ్॥ 32

అ;— పజ్జనులకు తత్త్వజ్ఞానమును బోధించువాడును. దుర్జనులకు సర్వథా తెలియ నలవికానివాడును, జ్ఞానాత్మకుడును, (జ్ఞాన స్వరూపుడును), వియామకుడును, కేవలము జ్ఞానులకు మాత్రమే గోచరుడునగు బుద్ధరూపియైన శ్రీ శ్రీనివాసుని సదా సేవింతును.

1. 'తతఃకలౌ సంప్రవృత్తే హరిస్తు సంమోహాయాఽప్యసురాణాం ఖగేంద్ర।
నామ్నా బుద్ధో కీకటేషు ప్రజాతః వేదోఽ ప్రమాణం చేతి దార్ఢ్యం చ కర్తుమ్॥ గా. 15—27

అసురజనులను మోహింపజేయుటకు గాను వేదముల ప్రమాణములని దృఢముగ స్థాపించుటకై శ్రీహరి కలియుగములో కీకట దేశమున బుద్ధుడై యవతరించెను.

2. చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః॥

గీతా, అధ్యా, 7, శ్లో, 16, 17.

జ్ఞానికి నా యందు పరమప్రీతి, అట్లే నాకును వానియందు ప్రేమ అని గీతయందు చెప్పబడినది.

కల్కినం తురగారూఢం కలి కల్మష నాశనమ్।
కల్యాణదం కలిఘ్నం చ శ్రీనివాసం భజేఽనిశమ్॥ 33

గుఱ్ఱము నెక్కిన వాడును, భక్తుల కలి దోషముల హరించువాడును, మంగళముల ప్రసాదించువాడును, అతిదుష్టుడైన కలిని నాశమొందించువాడు నగు కల్కిరూపముతో నవతరించు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

కలేస్తు కాల్కారత ఏవ కల్కి జ్ఞానం కలం కం సుఖమేవ తద్వాన్।
కల్కీతి వా తేన సమస్తదస్యువినాశనం తేన దినాద్వ్యధాయి॥

అధర్మవృత్తం విముఖం హరేశ్చ విహత్య నిశ్శేషజనం తురంగీ।
సంస్థాపయామాస సధర్మపేతుం జ్ఞానం చ భక్తిం చ నిజప్రజాసు॥
(మహాభారత తాత్పర్య నిర్ణయము అ. 32 శ్లో. 167, 168.)

తతో హరిః కల్కి సంజ్ఞశ్చ వీంద్ర
ఉత్పత్స్యతే యుగయోర్మధ్యసంధౌ ।
దస్యుప్రాయాణాం భూమిపానాం నిహంతుం
నామ్నా ద్విజస్య విష్ణుయశసో గృహే చ॥
(గారుడ పు. అ. 15. శ్లో 28)

(కల=హింసాయాం, కల=బంధనే) కాల్కారః=బంధనము లేదా హింస, కాల్కార ఏవ కల్కం, కల్కవాన్ కల్కి =కలినామకుడైన అసురుడిని విరాకరించుటచే 'కల్కి' యనబడుచున్నాడు.

(కల=జ్ఞానే) కలం = జ్ఞానము, కం = సుఖము, జ్ఞానసుఖము గలవాడు. (తను విస్తారే) తః = వ్యాప్తుడు, వ్యాప్తుడైన కల్కిరూప పరమాత్మునిచే సమస్త దస్యుల నాశనము జేయబడినది.

అశ్వారూఢుడగు కల్కిమూర్తియైన శ్రీహరి, అధర్మాసక్తుడు భగవద్విరోధియునగు కలిని సపరివారముగా వధించి, తన భక్తులయందు జ్ఞానభక్తి ధర్మములను స్థాపించును.

అవ:- భగవంతుని మహిమలను వర్ణించుట సాధ్యముకాని దగుట వలన కేవలము భగవన్నామ స్మరణము మిక్కిలి ప్రశస్తమనుచున్నాడు.

హరిం హంసం కృష్ణం నరహరి మనన్తం మధురిపుం
హృషీకేశం యజ్ఞం కపిలమృషభం వాజివదనమ్॥
నరం వ్యాసం నారాయణమనఘమాత్మానమమృతం
దత్తం ధన్వన్తరిం పురుషమితరాహ్వాన మజితమ్॥ 34

అ:- హరిరూపియు, 2. హంసనామకుడును, 3. కృష్ణస్వరూపియు, 4. నరసింహరూపియు, 5. అనంతనామకుడును, 6. మధురిపుడును,

7. హృషీకేశుడును, 8 యజ్ఞుడును, 9. కపిలుడును, 10. ఋషభుడును, 11. హయగ్రీవుడును, 12 విష్ణువును, 13. వేదవ్యాసుడును, 14. నారాయణుడును, 15. పాపవిదూరుడును, 16. ఆత్మనామకుడును, 17. నాశరహితుడును, 18. దత్తాత్రేయుడును, 19. ధన్వంతరినామకుడును, 20. పురుషరూపియును, 21. మహిదాసరూపియును, 22. అంజితనామకుడును అగు శ్రీనివాసుని ఎల్లప్పుడు భజింతును.

విశేషార్థము :—

1. 'హరతీతి — హరిః,' హృఞ్ = హరణే' = భక్తుల పాపపరిహారకుడు, దుర్జనుల నాశమొందించువాడు.

2. 'హంసః' 'దోషహీనత్వాత్ = హం, సారత్వాత్ = సః 'హంచాసౌ సశ్చ = హంసః' = దోషలేశరహితుడు, సర్వశ్రేష్ఠుడు, లేదా—హినస్తీతి హంస హిసి = హింసాయాం.

వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ
ద్వౌ చాపరౌ వర్ణవికార నాశౌ।
ధాతోస్తదర్థాతిశయేన యోగం
తదుచ్యతే పంచవిధం నిరుక్తమ్॥

ఇతి నిరుక్తత్వాత్ సాధుః. దుష్టసంహారకుడు, సజ్జనుల పాప పరిహారకుడు, సజ్జనులకు జ్ఞానదాయకుడు, సర్వశ్రేష్ఠుడు.

3. కృష్ణః = ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుని ప్రేరణాదులచే సమస్త జగత్తును వశము నందుంచుకొనువాడు, లేదా భూమికి, భక్తులకును సుఖప్రదుడు.

4. నరహరిం = సంకర్షణాదులకంటెను పృథగ్రూపుడు నరసింహరూపి.

యమానిలేంద్ర చంద్రార్క విష్ణు సింహాంశు వాజిషు।
శుకాహి కపి భేకేషు హరిర్నా కపిలే త్రిషు।

అను కోశానుసారము 'హరి' శబ్దము సింహవాచకము.

5. 'అనంతః – న విద్యతే అంతో యస్య = చతుర్విధ నాశములేని వాడు. లేదా (అతి–బద్ధనే) న విద్యతే అంతః = బంధః యస్య = సంసార బంధములు లేనివాడు.

6. మధురిపుం = మధునామక దైత్యునకు శత్రువైనవాడు.

7. హృషీకేశః = హృష–తుష్టౌ హృషః = హర్షము హృషీ = ఆనందము కలవాడు. ఈ = లక్ష్మీదేవి, కః = బ్రహ్మ, ఉభయోః = ఈకః = లక్ష్మీవాయు దేవులకు ప్రభువు హృషీ చాసౌ ఈ కేశన్చ = హృషీకేశః, లేదా హృషిణః ఈ కేశాః యేన = ఎవరిచే లక్ష్మీబ్రహ్మరుద్రాదులు ఆనందము ననుభవింప గలుగుచున్నారో అట్టి శ్రీహరి 'హృషీకాణాం ఈశః = హృషీకేశః=సమస్తేంద్రి యములకు ప్రేరకుడు.

8. యజ్ఞభోక్త యగుటచే 'యజ్ఞః' దని పిలువబడుచున్నాడు. లేదా 'జపయజ్ఞశ్చ ఇజ్యాం తపోయాజ్య ఏవ చ' అను ప్రమాణముచే యజ్ఞస్వరూపుడై పూజింపబడుటచే 'యజ్ఞా' డనబడు చున్నాడు.

స ఏవ యజ్ఞో అభవద్రుచేశ్చ
ఆకూత్యాం యస్సచ్చిదానన్ద రూపః।
స్వాయం భువం అద్యమన్వన్తరం చ
దేవైః సాకం పాలయామాస విద్వ॥

(గారుడ పు. అ. 15. శ్లో 14)

సచ్చిదానంద రూపియైన శ్రీహరి రుచి ప్రజాపతిచే ఆకూతిదేవియందు యజ్ఞ నామకుడై యవతరించి మొట్టమొదటిదగు స్వాయంభువ మన్వంతరము నందు దేవతలతో కూడి రాజ్యమును పాలించెను.

9. కపిలః = కపిమ్ = హనుమంతుని, లాతి = భక్తత్వేన, గృహ్ణాతి = భక్తునిగా స్వీకరించువాడు. లేక 'సుఖరూపం' పాల్యతే లీయతే చ జగత్ అనేన చ' సుఖరూపుడైన శ్రీహరిచే జగత్తు రక్షింపబడు చున్నది. నాశ మొందింపబడు చున్నది. కాన జగద్రక్షణ లయకర్త యగుటచే కపిలుడు, లేక

పి = సుఖం, కం = ఆనందః అని కోశము "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మేతి।

"ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానే బిభర్తి జాయమానం చ పశ్యేత్। సుఖాదనంతాత్ పాలనాచ్చ యం వై దేవం కపిలముదాహరన్తి"।— అను బాభ్రవ్యశాఖ ననుసరించి అపరిమిత సుఖముండుటచేతను 'కపిలు' డనబడుచున్నాడు. లేదా కః = సుఖరూపుడు, పి = జగత్తును రక్షించువాడు. (ప=రక్షించుట) లః = జగత్తును నాశమొందించువాడు. లేతా (లీ = శ్లేషణే లా = ఆదానే) సుఖం పిబన్ లీలయైవ' అని గీతా తాత్పర్యమను గ్రంథము నందు చెప్పినట్లు లీలగా ఆనందము ననుభవించువాడు.

తతో హరిః కపిలత్వం అవాప
　　తిరోహితాన్ కాలబలేన తత్వాన్।
చతుర్వింశత్సం ఖ్యాకానుద్ధరిష్యన్
　　చరిష్యవై ఆసురయే ప్రవక్తుమ్॥

(గారుడ పు. అ. 15. శ్లో 12)

శ్రీహరి కాలబలముచే మరుగైన ఇరువది నాలుగు తత్త్వముల నుద్ధరించి ఆసురి ఋషికి వాటి నుపదేశించుట కొరకు కపిల రూపుడుగా నవతరించెను.

10. ఋషభః = దేవశ్రేష్ఠుడు అభీష్టములను వర్షించువాడు ధర్మముచే శోభించువాడు.

11. వాజివదనః = అశ్వముఖము గల హయగ్రీవుడు.

12. నరః = క్షీణతలేనివాడు లేదా బ్రహ్మాది దేవతలచే నమస్కరింప బడునట్టి లక్ష్మీరమణుడు విష్ణువు.

13. వ్యాసః = వి = సర్వస్మాద్విశిష్టః = అందరికంటె శ్రేష్ఠుడు. సృ=గతౌ సృష్ణ్ = గతా. సః = జ్ఞానరూపుడు. ఆ = బాగుగ సః = కేవల జ్ఞానరూపుడు అగ్నివేశ్యశాఖయందు 'సవ్యాసౌ వీతి తం అవైహి। సోఽధస్తాత్స ఉత్తరతః

వేం. మా. 8

స పశ్చాత్స పూర్వస్మాత్స దక్షిణతః స ఉత్తరతః' అని యుండుటచే సర్వో త్కృష్టుడు. అతడు క్రిందను, పైనను. వెనుకను, ముందును, అంతటను వ్యాపించియుండుటచేత సర్వోత్కృష్టుడు, సర్వవ్యాప్తుడు లేదా వేదములను విభజించినవాడు.

తతోఽభవత్ వ్యాసరూపీ చ విష్ణు –
శ్చతుర్వారం దాశరథేశ్చ పూర్వమ్।
పరాశరాత్సత్యవత్యాం బభూవ
పైలాదిభిర్వేద భాగం చ కర్తుమ్॥

(గారుడ పు. అ. 15 శ్లో. 23)

శ్రీహరి పైలాది ఋషులద్వారా తానే వేదములను విభజించుటకై ఇరువది నెనిమిదవ ద్వాపరయుగమున పరాశరుని వలన సత్యవతీదేవి యందు వ్యాసరూపియై నవతరించెను.

14. నారాయణః = 'ప్రళయోదక శాయిత్వాత్ స తు నారాయణః స్మృతః = ప్రళయోదకమునందు వటపత్రముపై పరుండువాడు, లేక (దోషారచ్ఛిద్రశబ్దానాం పర్యాయత్వం యతస్తతః) అరాః = దోషములు దోష విరుద్ధములైన గుణములు నారః। నారాణాం ఆయనం = గుణముల కాశ్రయుడు, లేక న అరాణాం అయనం భవతి = దోషముల కాశ్రయుడు కాడు, దోష వర్జితుడు లేక నరసంబంధిత్వాత్ నారమ్ న రీయతే అనేన ఇతి వా, న అరనుణం యేనేతి వా, న దోషః యేనేత వా నిర్దోషములైన వేదములచే పుట్టుట వలన నారం = జ్ఞానం = జ్ఞానమునకు విషయుడై ఆశ్రయుడగుటచే నారాయణః = జ్ఞేయుడు లేక (అరవిధురత్వాత్, అరతి రహితత్వాత్, క్షయ విధురత్వాద్వా దోషములు లేకుండుటవలన గాని, అనిష్టత లేకుండుట వలనగాని నాశము లేకుండుట వలనగాని నారాయణుడని పిలువబడుచున్నాడు; లేదా నారాః = ముక్తులు = ముక్తుల కాశ్రయుడగుటచే నారాయణుడు లేదా (ఉపకారత్వాదివా నరాణాం ఇమే) = నారాః = వేదాదులు వాటియందు ప్రతిపాద్యుడై ఆశ్రయుడగుటచే నారాయణుడు. లేదా (నరాణాం ఇదం) నారం = జనులసముదాయము

దానికి ఉత్పత్యాదులనిచ్చి ఆశ్రయుడగుటచే నారాయణుడు లేక (నరాణాం సమూహః) నారం = మనుష్య సముదాయముచే నమస్కరింపబడుటచే నారాయణుడు. (నరాణాం అధిపతిః) = నారః = ముఖ్యవాయువు. ఆ వాయుదేవునికి పరమప్రీతి పాత్రుడై ఆశ్రయుడై యుండుటచే) నారాయణుడు.

ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః।
ఆయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః॥

అను ప్రమాణము ననుసరించి అపః ఆయనం యస్య = జలమునే ఆశ్రయముగా గలవాడు.

స ఏవ విష్ణుః సమభూద్బదర్యాం
నారాయణాహ్వః శ్యామలాయాం యమాచ్చ।
తపస్త్వం శిక్షయితుం ఋషీణాం
తిరస్కర్తుం అప్సరసాం సహస్రమ్॥
(గారుడ పు. అ 15. శ్లో. 11)

ఆ విష్ణువే ఋషులకు తపోవిధానమును తెలుపుటకై అనేక సహస్రా అప్సర స్త్రీలను తిరస్కరించుటకై యమధర్మరాజుచే శ్యామలాదేవి యందు బదరికాశ్రమములో 'నారాయణు' డను పేరు గలవాడై యవతరించెను.

15. అనఘం = న విద్యతే అఘం = పాపం, యస్య = ఎట్టి దోషములు లేనివాడు.

16. ఆత్మానం:

యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ।
యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మేతి భణ్యతే॥

అను స్మృతిచే సర్వగుణపరిపూర్ణుడు.

యో గుణైః సర్వతోహీనః యశ్చ దోషవివర్జితః।
హేయోపాదేయరహితః స ఆత్మేత్యభిధీయతే॥

సత్త్వాదిగుణ విదూరుడు, సర్వదోషవివర్జితుడు. 'ఆతతగుణత్వాత్ ఆత్మేతి భణ్యతే' = జ్ఞానానందాది గుణపరిపూర్ణుడగుటవలన 'ఆత్మ' శబ్దవాచ్యుడు.

17. అమృతం = అనంతాసనము, ఆధారత్వేన యస్య = అనంతాసనము ఆధారము గలవాడు. 'బ్రహ్మ గుణపూర్ణత్వాచ్చ నిత్యత్వాదమృతం తథా' అని ఐతరేయభాష్యమువందు చెప్పిన ప్రకారము అమృతః=నిత్యుడు, అమం = అపరిమితమైన, ఋతం = శాస్త్రము, యస్య = ఎవనికో అతడు. అపరిమితమైన శాస్త్రములు గలవాడు. అనగా సర్వశాస్త్ర ప్రతిపాద్యుడని భావము.

18. దత్తాత్రేయుడు: శ్రీ మహావిష్ణువుయొక్క అవతారస్వరూపుడు. అత్రిమహర్షి పత్నియైన అనసూయాదేవియం దవతరించెను.

స్వవిత్తం తేన దత్తం తు దత్తాత్రేయాయ కర్మణే ।
క్షత్రధర్మం పురస్కృత్య విజయం శ్రుతమేవ చ ॥

(భారతం, అనుశాసనికపర్వం 257, శ్లో. 5)

మార్గశీర్షయుతే పౌర్ణమాస్యాం జ్ఞస్య తు వాసరే ।
జనయామాస దేదీప్యమానం పుత్రం సతీ శుభమ్ ॥

తం విష్ణుమాగతం జ్ఞాత్వా చాత్రిః నామాకరోత్స్వయం ।
దత్తవాన్ స్వస్య పుత్రత్వాత్ దత్తాత్రేయ ఇతీరితః ॥

మార్గశీర్ష పూర్ణిమాదినమున అనసూయాదేవియందు తానే పుత్రుడుగా జన్మించి, అవతరించుటచే అత్రిపుత్రుడైన ఇతడు దత్తాత్రేయుడని పిలువబడెను.

స ఏవ దత్తః ప్రాదురభూన్మహాత్మా
అనసూయాయామత్రిఋషేః సకాశాత్ ।
అన్వీక్షికీం నామ సుతర్కవిద్యాం
అలర్కాయ శిక్షయితుం మహాత్మా ॥

(గారుడ పు. అధ్యా 15, శ్లో. 12.)

శ్రీ పరమాత్ముడే సత్తర్కవిద్యను అలర్కఋషికి ఉపదేశించుటకై అత్రిమునిచే అనసూయాదేవియందు దత్తాత్రేయ నామకుడై అవతరించెను.

అనసూయా తథైవాత్రేః జజ్ఞే పుత్రానకల్మషాన్ ।
దత్తం దుర్వాససం సోమమాత్మేశ బ్రహ్మసంభవాన్ ॥

భాగవతము

అనసూయాదేవికి అత్రిమహర్షివలన ముగ్గురు పుత్రులుదయించిరి. వారే భగవత్స్వరూపుడైన దత్తుడు, రుద్రస్వరూపుడైన దూర్వాసుడు, బ్రహ్మవిష్టుడైన సోముడు అనువారు.

19. ధన్వంతరి:

ధన్వంతరిస్తతో దేవః వపుష్మాన్ ఉదతిష్ఠతః ।
శ్వేతం కమండలుం బిభ్రదమృతం యత్ర తిష్ఠతి ॥

భారతము, ఆదిపర్వ 18, శ్లో. 38.

తతో హరిః ప్రాదురభూన్మహాత్మా
ధన్వంతరిర్నామ హరిస్మహాద్యుతిః ।
అపథ్యదోషాన్ పరిహర్తుమేష
హస్తే గృహీత్వా పూర్ణకుంభం సుధాభిః ।
తతో హరిర్జగృహే స్త్రీవపుశ్చ
నారాయణీతి ప్రవదన్తి లోకే ।
సముద్భవానాం దితిజానాం మహాత్మా
సమ్యక్ తేషాం వంచయితుం హరిః స్వయమ్ ॥

గారుడ పు. అ. 11, శ్లో. 15, 16,

శ్రీహరి తనచేతియందు సుధాపూర్ణమైన కలశమును హస్తమునందుంచుకొని 'ధన్వంతరి' యని ప్రసిద్ధుడై యవతరించెను. అటుపిమ్మట మదించిన రాక్షసులను వంచించుటకై 'నారాయణి' యను స్త్రీరూపమును ధరించెను.

అథోదధేర్మథ్యమానాత్ కాశ్యపైరమృతార్థిభిః ।
ఉదతిష్ఠత్ మహారాజ పురుషః పరమాద్భుతః ॥
దీర్ఘపీవరదోర్దండః కంబుగ్రీవోఽరుణేక్షణః ।
శ్యామలస్తరుణః స్రగ్వీ సర్వాభరణభూషితః ॥
పీతవాసా మహోరస్కః సుమృష్టమణికుండలః
నీలకుంచితకేశాంతః సుభగః సింహవిక్రమః ॥
అమృతస్య పూర్ణకలశం బిభ్రద్వలయభూషితః ।
స వై భగవతః సాక్షాత్ విష్ణోరంశాంశసంభవః ॥
ధన్వంతరి రితి ఖ్యాతః ఆయుర్వేదదృగిజ్యభాక్ ॥

(భాగవతము స్కం. 8 అ. 8, శ్లో 30, 33)

క్షీరసముద్రము మథించునపుడు శ్రీ పరమాత్ముని అంశసంభూతుడైన ధన్వంతరి అమృతపూర్ణమైన కలశమును హస్తమునందుంచుకొనివెడలివచ్చెను. ఆ శ్రీహరియే ఆయుర్వేదమును లోకమున ప్రవసరింపజేసిన మహనీయుడు.

20. పురుషః(పుర=అగ్రగమనే) =సృష్టికంటెను పూర్వమే యున్నవాడు 'షకారః ప్రాణ ఆత్మా' అనుశ్రుతి ననుసరించి అధికక్రియలు గలవాడు లేదా పురు = పూర్ణమైన మోక్షాఖ్యఫలమును (అనగా తననే) సనోతి (షణు-దానే) = ఇచ్చువాడు, అందరికంటె పూర్వము, సదనాత్ = ఉండుటచే, లేదా 'సర్వ దోషసాధనాద్వా' = సమస్తదోషములను నాశమొందించుటచే పురుషుడు, లేదా పురి = సర్వుల శరీరమునందు, శేతే = నియామకుడై పరుండియుండుటచేత పురుషుడు.

శకారస్య షకారోఽయం వ్యత్యయేన ప్రయుజ్యతే ।
భగవానితి శబ్దోయం తథా పురుష ఇత్యపి ॥
నిరుపాధీ చ వర్తతే వాసుదేవే సనాతనే ।

అని స్మృతి. లేదా 'పూర్ణత్వాత్ పాలకత్వాత్ పురుషః' (పౄ-పాలన పూరణయోః) పూర్ణషడ్గుణములు గలవాడు.

యో బీజభూతః పురుషాఖ్యవిష్ణుః
స ఏవాభూద్వాసుదేవేతి సంజ్ఞః ।
సృష్టిం కర్తుం పురుషాఖ్యం విరించం
మాయాఖ్యాయాం మూలరూపీ యథా సః ॥

(గారుడ అ. పు. 15, శ్లో. 2)

సమస్త అవతారములకు కారణభూతుడైన పురుషాఖ్య విష్ణువే మాయాదేవి యందు 'పురుష' అను చతుర్ముఖుని సృష్టించుటకై వాసుదేవ నామకుడాయెను.

21. మహిదాసః

మహిదాసాభిధో జజ్ఞే ఇతరాయాస్తపోబలాత్ ।
సాక్షాత్స భగవాన్విష్ణుః యస్తన్త్రం వైష్ణవం వ్యధాత్ ॥

ఇతరాదేవి తపోబలముచే శ్రీ భగవంతుడే మహిదాసుడని ప్రసిద్ధుడై అవతరించెను. అతడే వైష్ణవతంత్రమును (పాంచారాత్ర ఆగమమును) నిర్మించెను.

తతో హరిర్మహిదాసత్వమాప
ఋషేర్భార్యాయామితరాయాం స్వయంభూః ।
తథాఽవతారే పంచరాత్రం సమగ్రం
ఉపదేష్టుం వై నారదాయ స్వతంత్రః ॥

గారుడ పు. అ. 15, శ్లో. 10

శ్రీహరి నారదమహర్షికి పాంచరాత్రాగమము నుపదేశించుటకై ఇతరాదేవి యందు మహిదాసనామకుడై యవతరించెను.

22. అజితః = ఎవరిచేతను పరాజితుడు కానట్టివాడు (జి-జయే) అజితుడనబడు భగవదవతారము. (భాగవతము స్కం. 8, అ. 5, శ్లో. 9)

తత్రాఽపి దేవః సంభూత్యాం వైరాజస్యాఽభవత్సుతః ।
అజితో నామ భగవాన్ అంశేన జగతః పతిః ॥

అవ:— భగవంతుని అవతారము లనంతములైనందున వాని నామములు కూడ గణింప వలనుకానందున కేవలము స్తోత్రము చేయుటకు దేవశర్మ ఉపక్రమించుచున్నాడు.

అనంతరూపం స్వమనన్తచర్యం అనంతవేదై రనువర్ణనీయమ్ ।
అనంతనామానమనన్తదేవం(వేద్యం) అనంతకల్యాణగుణాభిరామమ్॥ 35

అ :— అపరిమిత అవతారములు గలవాడును, తన రూపములే అయిన అనంతక్రియలు గలవాడును, అనంత వేదములచే బాగుగ వర్ణింపబడినవాడును అనంతములైన నామధేయములు (లేక అనంతుడను పేరు) గలవాడును, అనంత రూపములచే (లేక గుణములచే) తెలిసికొనదగినవాడును, మంగళకరములైన జ్ఞానానందాది అనంత శుభగుణములచే పరిపూర్ణుడునగు శ్రీనివాసుని సదా పూజింతును.

అనన్తశక్తీశమనన్తవిక్రమం అనన్తదేహే చ శయానమీశ్వరమ్ ।
అనన్తసౌభాగ్యమనన్తనేత్రకం అనన్తపాదాదిమనన్తసౌఖ్యదమ్ ॥ 36

అ :— శక్తి యొక్క ఏకాంశమునందే అనేక శక్త్యంశములు గలవాడును, అపార పరాక్రమములు గలవాడును, అనంతజీవుల శరీరములందు నియామకుడై శయనించియుండువాడును, సర్వేశ్వరుడును, అపార సౌభాగ్యములు గలవాడును, అనంతములైన నేత్రములు, హస్తపాదాదులు గలవాడును, భక్తుల కపారసౌఖ్యము నిచ్చువాడును అగు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

1 కేశవాద్యాశ్చతుర్వింశత్ శతం నారాయణాదయః ।
విశ్వాదయః సహస్రాశ్చ పరాద్యాః అమితాః స్మృతాః ॥
అవతారాః అసంఖ్యేయాః విష్ణోర్నారాయణస్య చ ।
స్వయం నారాయణస్యైతే నామమాత్ర విభేదినః ॥

భగవంతుని యవతారములు అగణ్యము లనుటకు వివరణము :— కేశవాద్యవతారములు ఇరువది నాలుగు. నారాయణాద్యవతారములు నూరు. విశ్వాద్యవతారములు వేయి. పరాదులు అపరిమితములు. ఇట్లు నారాయణుని

అవతారములు లెక్కకు మిక్కిలిగా కలవు. ఈ సమస్త భగద్రూపులకును పరస్పర భేదమించుకైనను లేదు.

2. ఈశన శీలత్వాత్ ఈశ్వరః = నియమించు స్వభావము కలిగియుండుటచే ఈశ్వరుడనబడును.

3, ఈశేభ్యోఽపి పరః = నియామకులైన బ్రహ్మాదులకంటె నుత్తముడు.

4. ఈ = లక్ష్మీదేవి, శ్వా = వాయుదేవుడు — వీరిరువురను సంతోషపరచువాడు గావున ఈశ్వరుడు,

5. ఈశ్వభ్యాం రాజతే ఇతి — ఈశ్వరః = లక్ష్మీవాయుదేవులను మిక్కిలి సంతోషింప జేయుచు, వారికన్న నెక్కువగా ప్రకాశించువాడు.

6. 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' ఇత్యాది శ్రుతులచే అనేక సహస్ర చక్షురాదీంద్రియములు గలవాడని ప్రతిపాదింవబడినది.

7. 'విచిత్రశక్తిః పురుషః పురాణః న చాన్యేషాం శక్తయః తాదృశాః స్యుః' — ఇత్యాదులయందు అనంత విచిత్ర శక్తిసామర్థ్యములు గలవాడని ప్రతిపాదతమై యున్నది.

అవ :– 'స్వ' శబ్దవాచ్యుడైన, సదా స్వస్వతంత్రుడైన శ్రీహరిని ప్రకారాంతరముచే స్తోత్రము చేయుచున్నాడు.

అసురాచలౌఘ హరచక్రధరం దురితాచలౌఘ హరవజ్రధరమ్।
కరుణాచలౌఘభరచిత్త నరం కనకాచలౌఘ ధరపద్మ కరమ్॥ 37

అ :– రాక్షసులనెడి పర్వత సమూహములను నాశము చేయుటకై చక్రాయుధమును ధరించినవాడును, పాపములనెడి పర్వతముల గుంపులను నశింపజేయుటకై వజ్రాయుధమును ధరించినవాడును, దయాగుణమనెడు కొండల సమూహముతో నిండిన శ్రేష్ఠమగు చిత్తము గలవాడును. అసంఖ్యాకములైన పర్వత సమూహములను మించిన సువర్ణరాశిని (లేదా సు-వర్ణ — సమీచీనా

క్షరములలో గూడిన వేదముల అర్థమును) భక్తుల కిచ్చుట కొఱకై లక్ష్మిపద్మి ధావమునగల (అక్షర నామధేయురాలైన) పద్మమును హస్తమునందు ధరించిన వాడునగు శ్రీనివాసుని సేవింతును.

భువనేషు వేంకటేశ బహుపురుషార్థదాన నిపుణోఽసి ।
నో చేద్వ్యక్తతయా త్వం బహూన్నతస్థానే కుతో వససి ॥ 38

అ:— ఓ వేంకటాచలపతీ। లోకములందు భక్తులకు అన్ని పురుషార్థముల నిచ్చుటయందు నీవు మహా నిపుణుడవై యున్నావు. అట్లు గానిచో అందఱకు తెలియునట్లుగా అత్యున్నత ప్రదేశమైన శేషగిరియందు (వైకుంఠమునందు) ఎందులకు వసింతువు।

గుణౌఘైరపారం స్ఫురద్రత్నహారం
స్మరద్దోషహారం స్వభక్తేష్టపూరమ్ ।
భజే వేంకటేశం ఫణీశాద్రివాసం
సదా మందహాసం శ్రియా సద్విలాసమ్ ॥ 39

అ:— జ్ఞానానందాది గుణరాశిచే నిరవధికుడును - అనగా అపారమైన సద్గుణములచే భరితుడును, మిక్కిలి తేజోవంతములైన రత్నహారములు కల వాడును, నామస్మరణ మొనర్చువారి దోషములను హరించువాడును, తనభక్తుల కోరికలను పూరించువాడును, శేషగిరిపై నివసించువాడును భక్తుల సందర్శనమువలన జనించిన నిత్యమందహాసము గలవాడును, లక్ష్మీదేవితో ఎల్లప్పుడును హావభావ విలాసములతో నుండువాడును అగు శ్రీవేంకటేశుని సదా భజింతును.

వేంకటేశ చరణే తవ వన్దే సర్వతీర్థశరణె శరణే మే ।
మావిధీర శివవీశ ఫణీశేన్ద్రార్కసోమహుతభుఙ్ముఖవన్ద్యే ॥ 40

అ:— ఓ వేంకటేశా! గంగానది, స్వామిపుష్కరిణి మొదలగు సకల తీర్థములకు జనకమైన, భక్తరక్షకులు యోగ్యులునైన లక్ష్మి, బ్రహ్మ వాయుదేవుడు

రుద్రుడు, గరుత్మంతుడు, శేషుడు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలైన దేవతలచే స్తుత్యములు, వంద్యములునైన నీ పాదపద్మములకు నమస్కరించుచున్నాను.

శ్రీనివాస చరణే తవ వన్దే లోకపావన సుకుంకుమవర్ణే ।
శ్రీప్రదే కిల సురర్షిసరాణాం శ్రీఋుగాది నిగమాగమవేద్యే ॥ 41

అ:— ఓ శ్రీనివాసా! సకల సజ్జనులకు జ్ఞానప్రధానము చేయునట్టిదియు దివ్యమంగళ కుంకుమవర్ణముతో విలసిల్లునవియు, సమస్త దేవతలకు ఋషులకు, అంబరీషాది మహారాజులకు, తదితర మనుష్యోత్తములకు తాత్త్వికజ్ఞానమును పెంపొందించు నట్టిదియు, మంగళకరములగు ఋగ్వేదము మొదలైన నిగమములను, ధర్మాధర్మములను, భగవత్స్వరూపమును బాగుగ తెలియపరచుటచే ఆగమములనబడు పాంచరాత్రము, ధర్మశాస్త్రములు, పురాణములు, భారతాది ఇతిహాసములు, శ్రీమద్రామాయణము మొదలైన ఆగమములచే తెలిసికొనదగినట్టివియు నగు నీ చరణములకు నమస్కరించుచున్నాను.

విశేషార్థము:—

1. నితరాం గమయతి=బోధయతి=ప్రాపయతి పరమాత్మానమితి నిగమః।
ఆ సమంతాత్ గమయతి ధర్మాధర్మౌ పరం పదం ఆగమః।

2. 'శ్రీః నివసతి అస్మిన్' = సంపద లేదా లక్ష్మీదేవి అతనియందు సర్వదా వసించుట వలన 'శ్రీనివాసుడు'

3. శ్రియం నయతీతి శ్రీనిః = సంపదలను పొందువాడు, ఇచ్చువాడు. 'వస్తే=ఆచ్ఛాదయతి సర్వం, వాసయతి చ, వసని సర్వత్ర ఇతి వా—వాసః' సర్వమును ఆచ్ఛాదించువాడు, సర్వత్ర ఆవాసము చేయువాడు. 'వాసః' శ్రీనిశ్చాసౌ వాసశ్చ = శ్రీనివాసః'

4. 'శ్రియాం నివసతి అంతర్యామితయా' = లక్ష్మీదేవియందు అంతర్యామియై నివసించుచున్నవాడు — అని అర్థము.

భజే భజక సౌఖ్యదం నిజకటాక్ష సంప్రేక్షణం
పరాత్ వరతరం ధరం దరమరిం గదామంబుజమ్।
చతుర్భుజ మధోక్షజం కమలజేశ పూర్వార్చితం
వరోద్ధకఖలాన్ బహూన్ బహుజవేన సంహారిణమ్॥ 42

అ:— తనను భరించువారికి సుఖము నిచ్చువాడును, తన భక్తులను దయా దృష్టితో బాగుగా రక్షించువాడును, ఉత్తములైన లక్ష్మీ బ్రహ్మాదులకన్న నుత్త మోత్తముడును, శంఖ - చక్ర - గదా - కమలములచే శోభితములైన నాలుగు భుజములు గలవాడును, చక్షురాదీంద్రియముల కగోచరుడును, బ్రహ్మ రుద్రాది దేవతలచే పూజితుడును, బ్రహ్మరుద్రాదులిచ్చిన వరములవలన మదించిన రావణాదులను అతిశీఘ్రముగా సంహారించినవాడునగు శ్రీనివాసుని సదా భజింతును.

విశేషార్థము :—

తమద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజం గదాద్యుదాయుధమ్।
(భాగవతము, స్కం. 10. అ. 1)

అజ్ఞాన సాగర సముత్తరణే ప్రశస్తం
సుజ్ఞాన సేతురచనే నిపుణం బుధేడ్యమ్।
లక్ష్మీపతిం సురవరార్చిత వేంకటేశం
దారిద్ర్య పూర్వదురితౌఘ నిశాచరఘ్నమ్॥ 43

అ:— భక్తుల అజ్ఞానమనెడు సముద్రమును దాటించుటలో మిక్కిలి నేర్పరియును, భక్తులకు శ్రేష్ఠమైన బ్రహ్మజ్ఞానమను సేతువును నిర్మించుటలో (యథార్థజ్ఞానమును బోధించుటలో) నిపుణుడును, బ్రహ్మజ్ఞానులైన బ్రహ్మాదులచే స్తుత్యుడును దారిద్ర్యము మొదలైన దురితములనెడు రాక్షసులను సంహారించువాడును, దేవశ్రేష్ఠులైన బ్రహ్మాదులచే పూజితుడును లక్ష్మీపతియు నగు శ్రీనివాసుని సదా సేవింతును.

విశేషార్థము :—

సకల మహో వాఙ్మయములకు దేవతయైన లక్ష్మీదేవికి నమస్కారము చేయుట అత్యావశ్యకము. కాని

**శ్లో॥ క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసామ్।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥**

**(భగవద్గీతా, అధ్యా. 12. శ్లో. 5)**

అనగా సర్వత్ర సమబుద్ధి కలిగియుండవలెను. సమస్త ప్రాణులకు హితమును కలిగింపవలెను. అవి లేనిచో లక్ష్మీదేవి యనుగ్రహము కలుగ కాజాలదు. లక్ష్మీదేవియొక్క అనుగ్రహము లేనియెడల శ్రీహరి యనుగ్రహము కలుగనిదే మోక్షప్రాప్తి లేదు. ఇట్లు లక్ష్మియొక్క ఉపాసనాపూర్వకమైన భగవత్ప్రాప్తిమార్గము అతికష్టముతో కూడుకొన్నది అని చెప్పుటచే ప్రత్యేకించి లక్ష్మీదేవికి మాత్రము నమస్కారము నిషిద్ధము. అందుచే శ్రీహరి సమేతురాలైన లక్ష్మీదేవికి నమస్కరింపవలెను. అందుచే 'లక్ష్మీపతి' యని చెప్పియున్నాడు.

లక్ష్మీనాథం కమలనయనం హారకేయూరభూషం
అణ్డవ్యాప్తం బహుగుణభరం దోషదూరం దయాబ్ధిమ్।
స్వానాం తాపత్రయహరమజం నిర్విశేషం విశేషం
లోకాతీతం పురుషసుతులం భావయామీష్ట దేవమ్॥ 44

అః— కమలదళములను బోలిన నేత్రములు కలవాడును, హారకేయూరాద్యాభరణములను ధరించినవాడును, బ్రహ్మాండమంతట వ్యాపించియున్నవాడును, బహుసద్గుణ భరితుడును, దుఃఖాది దోషరహితుడును, దయాసాగరుడును, తన భక్తులకు సంభవించు తాపత్రయములను పోగొట్టువాడును, పుట్టుకలేనివాడును, ప్రకృతిధర్మముల కతీతుడును, లోకవిలక్షణుడును, లోకముల నతిక్రమించిన (లౌకికజ్ఞానమున కందని) వాడును, మోక్షప్రదుడును, అసదృశుడును, నా యిష్టదేవతయు, లక్ష్మీపతియునగు శ్రీనివాసుని సేవింతును.

విశేషార్థము :—

లోకము నతిక్రమించినవాడు, లోకవిలక్షణుడు — అనగా జననమరణములు, లేదా ఉత్పత్తి నాశములు లోకములో నుండు సర్వ ప్రాణులకు సర్వ

పదార్థములకు స్వాభావిక ధర్మములు. మఱియు లోకములోని కార్య కారణ భావములు సంప్రదాయబద్ధములై, నియతములై యుండును. భగవంతునకు ఇవి వర్తింపవు గనుక ఆయన వాటి కతీతుడు, విలక్షణుడు, అన్నారు. ఎట్లన, భగవంతుడు అనాదికాలమునుండి అనంతకాలముపరకు జనన మరణములు లేని వాడగుటచే 'నిత్యుడు' తాను పురుషుడై యుండియు, తన నాభి నుండి తామరపువ్వును పుట్టించి, అందులో చతుర్ముఖుని కనబరచెను. లోకములో సంతతి యనునది స్త్రీ పురుషుల దాంపత్య ధర్మమనెడి నియమమునకు లోబడి యుండునది. ఇట్లు లోకరీతిని మీఱి తానే బ్రహ్మను తన నాభినుండి సృష్టించుట లోకవిలక్షణ ధర్మము.

శ్రీమద్వేంకటనాథపాదజనితా గంగా జగత్పావనీ
యస్యాపాంగనిరీక్షణం విధిభవేన్ద్రార్కాదిసర్వేష్టదమ్ ।
యన్నామస్మరణం మహాఘహరణం స్వర్గ్యం చ మోక్షప్రదం
యత్పాదాంబుజయుగ్మసేవనరతో బ్రహ్మాదిభిః పూజ్యతే॥ 45

అ:— ఓ వేంకటేశా! ఏ నీ పాదకమలములనుండి ఉద్భవించిన గంగాది సర్వతీర్థములు జగత్తునంతటిని పవిత్రీకరించుచున్నవో, ఏ నీ కృపాకటాక్షములు బ్రహ్మ - రుద్ర - ఇంద్ర - సూర్యాది దేవతలకు సర్వాభీష్టముల నొసంగుచున్నవో, ఏ నీ నామస్మరణము మహాపాతకములరాశిని దహించి, స్వర్గమోక్షాదులను కలిగించునో, ఏ నీ పాదపద్మద్వంద్వమునందు సేవారతులైనవారు బ్రహ్మాదులచే యథాయోగ్యముగ గౌరవింపబడుచున్నారో అట్టి నీ పాదపద్మములను మ్రొక్కెదను.

విశేషార్థము:—

నామ్నోఽస్తి యావతీ శక్తిః పాపనిర్హరణే హరేః ।
తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః ॥

(కృష్ణామృతమహార్ణవము)

అవగా భగవన్నామ స్మరణమువలన నెంతటి పాపరాశి నశించునో (పాపములను హరించుటలో భగవన్నామమున కెంతశక్తి కలదో), అంతటి పాపరాశిని ఏ పాతకియైనను చేయలేడు, అనగా నామస్మరణము చేసినందు వలన హరించిపోవక శేషించునంతటి పాపమేదియునులేదని భావము. దీనిని బట్టి భగవన్నామ మెంతటి మహిమకలదియో తెలియుడు.

సృ(దృ)ష్ట్యాద్యత్యస్తదూరం నిగమనిచయసంవేద్యమాహాత్మ్యపూర్ణం
సర్వేహామాదిమిత్రం రవిశశినయనం పూర్ణకారుణ్యదేహమ్ ।
నిర్వాణం నిష్ప్రపంచం నిరవధికసమామ్నాయసంగైరసంగైః
గీర్వాణాద్యైరజస్రం స్తుతినతినియమైకాన్తభక్త్యాదిపూజ్యమ్॥ 46

అ :— సృష్టి స్థితి సంహారాదుల కత్యన్తదూరుడును (అనగా సృష్ట్యాదులు లేనివాడును), (అర్థాంతరము: కంటికి, చెవికి, మనస్సునకు గోచరముకాని వాడును), ఋగాది వేదశాస్త్ర పురాణాదులవలన తెలియదగిన మహిమచే పరి పూర్ణుడును (మఱియు ఆ వేదశాస్త్రాదులవలనను పూర్ణముగా తెలియ వీలుకాని మహిమ గలవాడును) బ్రహ్మాదిదేవతలకందరకు ఆదినుండియు ఆవద్బాంధ వుడును, సూర్యచంద్రాదులవలె కాంతియుతమైన నేత్రములు గలవాడును, పరి పూర్ణకృపయే దేహముగా గలవాడును, పాంచభౌతికదేహము లేనివాడగుటచే జననమరణాది రూపసంసారబంధనము లేనివాడును, మమతాహంకారాది దోషములను విడనాడి, నిరవధికములును (ఎల్లలేనివి) అనంతములునైన వేద రాశియొక్క అర్థములచే ఎల్లప్పుడు చింతించుచుండెడు ఏకాంతభక్తులగు దేవ తలు, ఋషులు, సజ్జనులు మొదలైనవారిచే నిరంతరము శ్రవణమననాదులనెడి సాధన నియమములచే పూజింపబడుచున్న పాదమహిమ గలవాడును అయిన శ్రీహరిని భజింతును.

**విశేషార్థము :—**

శ్రీహరికంటె వేఱొకడగు సృష్ట్యాదికర్త లేనేలేడు. మఱియు

బ్రహ్మాండకోటిస్రష్టా చ కటాక్షక్షణమాత్రతః ।
సంహర్తా పాలకశ్చైవ తతః కోఽన్యో భవేద్విభుః ॥
స్రష్టా పాలయితా హన్తా కోటిబ్రహ్మాండనాయకః ॥

(ఆది పు. అ. 7, శ్లో. 65)

కేవలము క్రీగంటి చూపుమాత్రముచేతనే ఒకక్షణములో కోటిబ్రహ్మాండములను సృష్టింపగలడు, రక్షింపగలడు, సంహరింపగలడు. అతడే సర్వశక్తుడు. మఱొకడు లేనేలేడు.

కింకరశంకర బహుకరుణా తవ బహుచరితం చతుర్దశభువనేషు ।
జ్ఞాపయసి తవ భక్తవర్గేభ్యః ఫణిశుకపైలనారదప్రముఖైః ॥ 47

అ:— సజ్జనులకు సుఖమునిచ్చు భృత్యుడైన శంకరునియం దత్యంత (కరుణ) ప్రీతిగల ఓ వేంకటేశా! నీకు భృత్యులపై చాలదయ కలదు. ఎందువలననగా, పదునాలులోకములందు ఆదిశేషుడు, శుకాచార్యుడు, పైలమహర్షి, నారదమౌని మొదలగు మహనీయుల మూలముగ భక్తులకొరకై బహువిధములైన నీ చరిత్రలను వెల్లడిచేయుచుందువు

విశేషార్థము:—

ఆద్యన్తం వేదశాస్త్రస్య స్వయం భగవతా కృతమ్ ।
మధ్యం తదాజ్ఞయా శేషపైలాభ్యాం కృతమంజసా ॥
ఋచాం ప్రవర్తకం పైలం యజుషాం చ ప్రవర్తకమ్ ।
వైశంపాయనమేవైకం ద్వితీయం సూర్యమేవ చ ॥
ప్రవర్తనే మానుషేషు గంధర్వాదిషు చాత్మజమ్ ।
నారదం పాఠయిత్వా చ దేవలోకప్రవృత్తయే ॥
దేవమీమాంసకాద్యన్తం కృత్వా పైలమథాదిశత్ ।
శేషం చ మధ్యకరణే పురాణాన్యథ చాకరోత్ ॥

(మహాభారత తాత్పర్యనిర్ణయము, అ. 10, శ్లో. 76, 78, 83)

శ్రీ వ్యాసభగవానుడు ఋగ్వేదమును ప్రచారముచేయుటకు పైలమునిని, కృష్ణయజుర్వేదమునకై వైశంపాయనుని, శుక్లయజుర్వేదమునకు సూర్యుని నియమించెను. అట్లు నియమించి, వ్యాసుడు వేదాంతశాస్త్రముయొక్క ఆద్యంతములను రచించి, మధ్యభాగమును పైలుడు, శేషుడు అనువారిచే రచింపజేసెను. పరీక్షిత్తు ఆదిగాగల చక్రవర్తులయందును, గంధర్వాదులయందును తత్త్వశాస్త్రమును ప్రచారమొనరించు నిమిత్తము తనకుమారుడైన శుకమునిని ఆజ్ఞాపించెను. దేవలోకములో ప్రచారముచేయుటకు నారదమహర్షి నాజ్ఞాపించెను.

వేంకటేశమనుసృత్య య ఆస్తే తస్య భూరి సుభగం దశదిక్షు ।
ఐహికం త్రిదివసౌఖ్యమతుల్యం మోక్షమాశు లభతే గుణసామ్యమ్ ॥ 48

అ:— వేంకటేశ్వరు ననుసరించి పరమభక్త్యాదులచే స్తుతించినవారి కీర్తి పదిదిక్కులయందు (అంతట) వ్యాపించును. అట్టి వారికి అధికమైన సౌభాగ్యము కలిగి ఇహలోకములో అసమాన సుఖభోగములను, అటుపిమ్మట అపారమగు స్వర్గసౌఖ్యమును అనుభవించి, తమతమ యోగ్యతానుసారముగా గుణసామ్యమనెడు ముక్తిని పొందుదురు.

విశేషార్థము:—

1. భగం శ్రీయోనివీర్యేచ్ఛాజ్ఞానవైరాగ్యకీర్తిషు
మాహాత్మ్యైశ్వర్యయత్నేషు ధర్మే మోక్షే చ వా రవౌ ।

అను నిఘంటువాక్యముచే ఇహలోకమునందు అధికసంపద, వీర్యకీర్త్యాదులను అపారసౌఖ్యములను అనుభవించి ముక్తిని పొందుదురని సారాంశము.

2. గుణసామ్యమను మాటకు వివరణము:—సర్వదుఃఖ నివృత్తిపూర్వకమగు స్వరూపానందావిర్భావము మోక్షమనబడును. ఇది 'సద్గుణసారత్వాత్ తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్' (బ్రహ్మసూ. అ.2, పా.3, సూ.29) 'పరమం సామ్యముపైతి' ఇత్యాది సూత్ర-శ్రుతులలో చెప్పబడినట్లు, పరమాత్ముని జ్ఞానానందాదిగుణములతో యథాయోగ్యముగా సామ్యము, సంసారాభావముచే సామ్యము,

దుఃఖదోషాదులు లేమిచే సామ్యము, ఇత్యాది రూపముగా నుండునవి తెలియవలెను. సంసారదశలో జీవుడు భగవత్సామ్యమును ఏ యంశములోను, ఏ విధముగను సంపాదింపలేడు. ముక్తిదశలో కొన్నిగుణములచే భగవత్సామ్యమును పొందగలడు. ఎట్లనగా జీవునకు దుఃఖదోషములులేవు. సంసారము లేదు. కొంతమాత్రమేయైన జ్ఞానము, ఆనందముకలవు. కనుక ఈ గుణములలో బ్రహ్మతో సముడు. ఇట్టి గుణ సామ్యమనబడు ముక్తి, జీవునకు భగవదనుగ్రహము వలన కలిగినది. భగవదధీనమైనది. భగవంతునకు గల గుణములు, ఆనందము, శక్తియును స్వాధీనములు, నిత్యములు, స్వతంత్రములు — అని తెలియవలెను.

శ్రీనివాసమపహాతి మదాన్ధః
తస్య దుఃఖమసమం దశదిక్షు।
ఐహికం నరకరౌరవకుంభీ
పాకవహ్నిమహదన్ధతమాంసి॥ 49

అః — ఓ శ్రీనివాసా! ఎవడు మదాంధుడై నిన్ను ఆరాధించక అపహాస్యము చేసి విడిచి పెట్టునో అతనికి సర్వదిశల యందును (అంతటను) ఈ లోకములో అతి దుఃఖము కలుగును. అటు పిమ్మట పరలోకములో రౌరవ, కుంభీపాక, వహ్ని మహారౌరవాది నరకముల ననుభవించి కడకు మహత్తరమైన శాశ్వత దుఃఖస్థానమైన అంధంతమస్సను నరకమును పొందును.

విశేషార్థము:—

రౌరవోఽథ మహాంశ్చైవ వహ్నిర్వైతరిణీ తథా।
కుంభీపాక ఇతి ప్రోక్తాని అనిత్యనరకాణి తు।
తామిస్రశ్చాన్ధతామిస్రో ద్వౌ నిత్యౌ సంప్రకీర్తితా।
ఏతాని సప్త ప్రధానాని బలీయో హ్యుత్తరోత్తరమ్॥

భగవదనుగ్రహము వలన జీవునకు మనుష్యాది శరీరములు, తగిన జీవనోపాధులు, వసతులు, కలుగుచున్నవి. దీనిని తెలిసికొని కలిగిన దానికి సంతోషించుచు, భగవంతునకు కృతజ్ఞత చూపవలెను కదా! అట్లు చేయ

నిచో ఈ జీవుడు కృతఘ్నుడగును. ఇట్లుండగా ఐశ్వర్య భోగలాలసుడై, భగవంతుని మరచుట, భగవదారాధనా విముఖుడగుట, ద్వేషించుట — ఇత్యాదులను చేయువాడు సర్వదుఃఖములకు ఆశ్రయుడగును. ఉదా:— దుర్యోధనుడు, కంసుడు, జరాసంధుడు, రావణుడు, హిరణ్యకశిపుడు, మున్నగువారు. అట్టివారెల్లరును శాశ్వతముగా అపకీర్తికి గురియై దుర్గతుల పాలైరి.

విపద్ఘ్నం శుభదోద్గారం భక్తానాం వశవర్తినమ్।
లోకపూజ్యం రమారామం భజేఽహం ప్రతిజన్మసు॥ 50

అ:— నరకప్రాప్తి మొదలగు భక్తుల సర్వాపదలను పరిహరించువాడును, శుభఫలముల నొసగి మోక్షము నిచ్చువాడును. తన యిచ్ఛానుసారముగ భక్తులకు ప్రీతితో వశుడైయుండువాడును, సర్వలోకముల యందలి జ్ఞానులచే పూజ పొందువాడును, రమాదేవి సౌఖ్యము నిమిత్తమైన క్రీడాది గుణములు గలవాడును అగు శ్రీ వేంకటేశుని అన్ని జన్మముల యందు భజింతును.

విశేషార్థము:—

భక్తులకు భగవంతుని దయవలన నరకాదులు తొలగి శుభసంపదలు కలుగుటయే ఇహలోక శ్రేయస్సు. సంసార నివృత్తి కలిగి మోక్షము లభించుట పరలోకశ్రేయస్సు.

భక్తానుగ్రహార్థాయ త్యక్త్వా వైకుణ్ఠముత్తమమ్।
ధరణ్యామవతీర్ణోఽసి వరేడ్యో వరదోఽర్చితః॥ 51

అ:— ఓ వేంకటేశా! నీవు జ్ఞానులకు స్తుత్యుడవు. భక్తులకు వరముల నొసంగగల బ్రహ్మాదుల చేతను పూజింపబడుచున్న సర్వోత్తముడవు. అట్టి దయామయుడవు గావుననే నీవు భక్తుల సముదాయమును అనుగ్రహించు నిమిత్తము అత్యుత్తమమగు వైకుంఠమును వదలి భూలోకములో అవతరించితివి.

అత్యల్పమాత్రం పరవస్తు లోకే నైవాపహార్యం కిల సత్యసద్భిః।
జనైరనేకైః బహుజన్మయత్నైః ఆయాససాధ్యం బహుపాపసంచయమ్॥ 52

**హరన్న శేషం స్మృతిమాత్రతస్త్వం గోగోచరో దృష్టిపథాద్యగోచరః।**
**విలక్షణం స్థావరజంగమాత్మకం పశ్యే బహూపాయ విశారదం త్వామ్॥53**

అ:— ఓ వేంకటేశా! లోకములో పరద్రవ్యము కేవల మెంత తక్కువ దైవమ దానినపహరింపరాదని సత్యసంధుడవు, జ్ఞానిశ్రేష్ఠుడవునగు నీవే బోధించుచున్నావు. కాని అనేకులు అనేక జన్మములయందు మహా ప్రయత్నముతో అనేక వ్యయప్రయాసలకోర్చి సంపాదించిన బహుపాపరాశిని, ఎచట వెదకినను బాహ్యనేత్రేంద్రియాదులకు కనబడని నీవు 'శ్రీ వేంకటేశ' అను నీ నామ స్మరణమాత్రముచే కొద్దిగను మిగిలించక అపహరించుకొని పోయెడు పాపచోరుడవుగా నున్నావు. ఇదొక్కటేనా నీవిచిత్రచర్య! వేదములచే మాత్రమే గోచరుడవు, అతివిలక్షణుడవు, చేతనాచేతనాత్మక జగన్నియామకుడవునైన నీవు భక్తులను రక్షించుటయందు బహూపాయ విశారదుడవని నా అనుభవము వలన నే నెరుగుదును.

విశేషార్థము:—

1. గురువులతోను, పెద్దలతోను పరిహాసము లాడరాదని నీతి శాస్త్రము లుండగ శ్రీహరిని తస్కరుడనుట యుక్తమా? అనినచో 'గురూణామపి సమం హాస్యం కర్తవ్యం కుటిలం వినా' అని స్మృతివాక్యము. కపటము లేకుండ యథార్థ విషయముతో గురువులవద్ద హాస్యమాడదగును. మఱియు

> నారాయణో నామ నరో నరాణాం ప్రసిద్ధచోరః కథితః పృథివ్యామ్।
> అనేకజన్మార్జితపాపసంచయం హరన్న శేషం స్మృతిమాత్రతస్త్వమ్॥

అను ప్రమాణము ననుసరించి సత్య సంకల్పముగల భగవంతుడు మనోవాక్కుల కగోచరుడై, కేవలము వేద శాస్త్రముల చేతనే గోచరించువాడై స్మరణ మాత్రము చేతనే కరిగెడు కరుణా హృదయుడై, పాపరాశిని అపహరించుచున్నాడన్న పరిహాసములో 'దోషములను హరించి ఉద్ధరించుచున్నాడు' అన్న గుణకీర్తనము ఇమిడియున్నది.

2. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'

3. 'అవచనేనైవ ప్రోవాచ'

'యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే।
యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతం
యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి'।

'వాణీ మనోదృష్టిపథాద్యగోచర:' అను శ్రుతులు సుప్రసిద్ధములై యున్నవి.

4. గోగోచర: 'సర్వే వేదా యత్పదమామనన్తి,' 'వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః' — ఇత్యాది శ్రుతిస్మృత్యాది సిద్ధములు.

అవ :— ఓ వేంకటేశా! నీవు మాత్రమే తస్కరుడవు కాదు. నీ అనంతరూపములు (అవతారములు), అనంతచరిత్రలు, అనంతనామములు, అనంతానంత గుణక్రియాదులు కూడ భక్తుల దురితముల నపహరించునవే. అవి పాప పరిహారకములే గాక భక్తి పూర్వక ముగ స్మరించినంత మాత్రముననే మహైశ్వర్య ప్రదములుగా నున్నవని చెప్పుచున్నాడు.

తవ రూపాణ్యనన్తాని చరిత్రాణి తథైవ చ।
స్మరతాం భక్తిపూర్వం తు మహావిభవదాని చ॥ 54

అ :— ఓ శ్రీనివాసా! నీ యనేక రూపములు, అనంత చరిత్రలు భక్తితో దలంచినవారికి మహాపాపములను హరించి, మహావైభవముల నొసగుచున్నవి.

ఇహాముత్రాతుల్యసౌఖ్యప్రదాని మహతామపి।
అల్పానాం కిము వక్తవ్యం స్వరూపోద్ధారకాణి చ॥ 55

అ:— నీ చరిత్ర మహిమలను కొంత మాత్ర మెరింగినవారి అల్పభక్తి మాత్రము చేతనే ఇహమునందు అపార సుఖ సంపదల నిచ్చి, పరలోకము నందు స్వరూపోద్ధారకములైన మోక్షాది పురుషార్థముల నిచ్చుచున్నావు. అట్టిచో నీ మహిమల నెక్కువగా నెఱింగిన బ్రహ్మాదుల కెంతటి భాగ్యమో చెప్పతరమా!

ప్రపద్యే పుణ్డరీకాక్షమీశం భక్తానుకంపినమ్ ।
లోకోత్తరం లోకనాథం పరాత్పరతరం విభుమ్ ॥ 56

అ :— కమల దళములవంటి నేత్రములు గలవాడును సర్వమునకు స్వామియును, భక్తులయందతిశయమైన దయకలవాడును, భక్తులకు తత్త్వజ్ఞానము నుపదేశించి, వారిని సంసారసాగరము నుండి తరింపజేయువాడును, సమస్త లోకములకు అధిపతియును, రమా బ్రహ్మాదులకంటెను అత్యుత్తముడును, అనంతరూపములను ధరించినవాడును అయిన శ్రీనివాసవిభుని శరణు వేడుచున్నాను.

విశేషార్థము :—

1. ఈం కాన్తీతి ఈశః=లక్ష్మీనియామకుడు. 'ఈకారేణోచ్యతే రమా' అని నిఘంటువు.

2. 'వివిధం భవతీతి విభుః' = అనేకరూపముల దాల్చువాడు లేదా సర్వత్ర వ్యాపించియుండువాడు.

3. 'పరాత్పరతరం', 'ఏష ఉ ఏవ పరోవరీయాన్ ఉద్గీథః స ఏష ఆత్మా' అని శ్రుతి.

4. పుండరీకే ఇవ అక్షిణీ యస్య = తామరరేకులవంటి నేత్రములుగలవాడు. లేదా పుండరీకః = అగ్నిః స ఏవ అక్షి యస్య = అగ్నినే మూడవ కన్నుగాగల నరసింహరూపుడు లేదా పుండరీకే అక్షి యస్య = పుండరీకముని యందు కృపాదృష్టి గలవాడు.

పుణ్యాత్ త్వద్దయయా లబ్ధం విశేషాదనుతోభయమ్ ।
భగవంతం విశ్వవన్ద్యం భూతభవ్యభవత్ప్రభుమ్ ॥ 57

అ :- పూర్వార్జిత పుణ్యమువలనను, నీ కృపవలనను, గుర్వనుగ్రహము వలనను, ఐశ్వర్యాది షడ్గుణపూర్ణుడవును, సర్వజగద్వంద్యుడవును, భూతభవి

వ్యద్వర్తమానకాలిక సమస్తవస్తువులకు ప్రభువైనవాడవును ఐన శ్రీవేంకటేశా! నీవు నాకు లభ్యుడవైనందున నా కింక భయమెక్కడిది? కావున నిన్నే శరణు పొందుచున్నాను.

విశేషార్థము :—

1. ఇకమీదట దేనివలనను నాకు ఏలాటి భయమునులేదు. ఆనంద స్థలమువందు లభ్యుడైన శ్రీహరిని పొందగల్గియున్నాను. కావున భయములేదని భావము.

2. అతీత - ఆగామి — వర్తమాన కాలమునందుండు వారందరికీ నియామకుడు. లేదా 'భూతం, ప్రభూతం, భవ్యం = మంగలం యస్మాత్' = అధికమైన మంగళముల నొసంగువాడు (భూతభవ్యశ్చాసౌ భవత్ప్రభుశ్చ)

యతో భూతాని జాయన్తే యేన సర్వమిదం తతమ్ ।
యేన జాతాని జీవన్తి యం ప్రాప్స్యన్తి మహాశ్రయమ్ ॥ 58

అ :— ఎవనినుండి సమస్త మహదాది తత్త్వములు సృష్టింపబడినవో (లేదా సర్వప్రాణులు పుట్టుచుండునో), ఈ జగత్తు ఎవ్వనిచేవ్యాప్తమైయున్నదో, పుట్టిన ప్రాణులన్నియు నెవనిచే జీవించుచున్నవో, లయకాలమున సర్వప్రాణులు బ్రహ్మాదులకును ఆశ్రయమైన ఏ పరబ్రహ్మమును పొందుచున్నవో అట్టి శ్రీనివాసువే శరణువేడెదను.

విశేషార్థము :—

సర్వప్రపంచము, సర్వప్రాణులు, సర్వ పదార్థములు శ్రీహరి నుండి జన్మించి, రక్షింపబడి, లయము నొందుచున్నవి. అంతటికిని శ్రీహరి యొక్కడే ప్రభువు. సర్వాధికారమతనిదే! ఈ విషయమై 'యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయంత్యభిసంవిశన్తీతి', 'ఉత్పత్తి స్థితి సంహారాః నియతిర్జ్ఞానమావృతిః' — ఇత్యాది స్మృతులు ప్రమాణములు.

దీపవిద్యుత్తారకాగ్నిచంద్రసూర్యాతిదీప్తిమాన్ ।
యోగాయోగైర్యోగ్యయోగైః దృశ్యోఽదృశ్యః శ్రుతోఽశ్రుతః ॥ 59

అ :— దీపము, మెఱుపు, నక్షత్రములు, అగ్ని, చంద్రసూర్యులు మొదలగు వారిని అతిక్రమించువంతటి అత్యధిక ప్రకాశము కలవాడును, యోగులచే గావింపబడిన ధ్యానయోగాదులచే యథాయోగ్యముగా గోచరించు (తెలియదగు) వాడును, తత్సాధనవిహీనులైన అయోగ్యులకు సర్వథా గోచరింపని (తెలియనీలుగాని) వాడును అగు శ్రీ వేంకటేశుని శరణుపొందుచున్నాను.

విశేషార్థము :—

'సూర్యకోటిసమప్రభః'

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

భగవద్గీత అ. 15, శ్లో. 12.

"సయోఽతోఽశ్రుతః అగతః అమతః అనతః అదృష్టః ....
"శ్రోతా మంతా ద్రష్టా ఆదేష్టా ఘోష్టా విజ్ఞాతా ప్రజ్ఞాతా"

యోగధ్యానాది నిష్ఠలగువారి మనస్సులకు భగవంతుడు గోచరించును. కంటికి కనిపించును. చెవికి వినిపించును. అట్టి నిష్ఠలేనివారికి గోచరింపడు. కనబడడు, వినబడడు — అని భావము. తాను సృష్టించిన అన్నితేజస్సులకంటె ఎక్కువ తేజస్వియనుటకు 'సూర్యకోటి సమప్రభః' — ఇత్యాదులు ప్రమాణములు.

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటేశమాహాత్మ్యే
'నానావతారవర్ణనం' నామ తృతీయాధ్యాయః

శ్రీమదాదిత్య పురాణాంతర్గత శ్రీ వేంకటేశమాహాత్మ్యము
నందలి 'నానావతారవర్ణన' మను
మూడవ అధ్యాయము సంపూర్ణము.

॥ శ్రీ కృష్ణార్పణమస్తు ॥

# అథ చతుర్థాధ్యాయః

అథ భగవతో విశ్వరూపాదివర్ణనమ్ :-

దేవశర్మోవాచ :-

శ్రీ వేంకటేశ ! మత్స్వామిన్ ప్రణతార్తిప్రణాశన ।
జ్ఞానానన్దదయాపూర్ణ ! విజ్ఞాపనమిదం శృణు ॥

అ :- నాస్వామీ ! భక్తుల దుఃఖములను పరిహరించు వాడవును, జ్ఞానానంద దయలచే పరిపూర్ణుడవును ఐన శ్రీ వేంకటేశా ! ఈ నా మనవిని దయతో వినుము.

అవ :- 'యతో భూతాని జాయన్తే' అని పురుషసూక్త ప్రతిపాద్యుడైన శ్రీభగవదభిన్న శ్రీ వేంకటేశుని పురుషసూక్తములో చెప్పిన రీతిని దేవశర్మ స్తోత్రము చేయుట కుపక్రమించు చున్నాడు.

యన్ముఖం బ్రహ్మజనకం యద్బాహూ క్షత్రకారణే ।
యదూరుభ్యాం వైశ్యకులం పాదాభ్యాం సేవకోఽభవత్ ॥ 2

అ :- ఓ వేంకటేశా ! ఏ నీ ముఖము బ్రాహ్మణ కులమును సృష్టించినదో, ఎవని బాహువులు క్షత్రియకులమునకు కారణములైనవో, ఎవని తొడలనుండి వైశ్యకులముద్భవించెనో, మఱియు నెవని పాదములనుండి సేవకులగు శూద్రులుద్భవించిరో !

విశేషార్థము :—

బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్య: కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥

అను పురుషసూక్తమంత్రోక్తమైన చాతుర్వర్ణ్యసృష్టి ఈ శ్లోకమున చెప్పబడినది.

శిరసో ద్యౌరభూద్యస్య సహస్రాంశుశ్చ నేత్రజః।
ముఖాత్పురందరోఽగ్నిశ్చ దిగ్దేవాః శ్రోత్రతోఽభవన్॥ 3

అ:- శిరస్సు నుండి స్వర్గలోకము జనించెను. నేత్రముల నుండి సూర్యుడు, ముఖమునుండి ఇంద్రాగ్నులు, చెవినుండి దిగ్దేవతలు జనించిరి.

విశేషార్థము:—

ఈ శ్లోకములో 'చక్షోః సూర్యో అజాయత। ముఖాదింద్రశ్చాగ్నిశ్చ శీర్ష్ణో ద్యౌః సమవర్తత దిశః శ్రోత్రాత్॥' అను మంత్రార్థము ఇమిడింపబడి యున్నది.

శీతాంశుర్మనసో జాతః ప్రాణాద్వాయురజాయత।
అంతరిక్షం నాభితోఽభూత్ పద్భ్యాం భూమిరజాయత॥ 4

అ:- శ్రీమన్నారాయణుని మనస్సునుండి చంద్రుడు జనించెను. ప్రాణము నుండి వాయువు, నాభినుండి అంతరిక్షము, పాదముల నుండి భూమియు పుట్టినవి.

విశేషార్థము:—

'చంద్రమా మనసో జాతః। ప్రాణాద్వాయు రజాయత।

నాభ్యా ఆసీదంతరిక్షమ్। పద్భ్యాం భూమిః' అను మంత్రార్థము చెప్పబడెను.

యత్కోమలాంఘ్రి రభవన్ భువనాని చతుర్దశ।
కోమలే నాభికమలే బ్రహ్మాణ్డం బ్రహ్మాధిష్ఠితమ్॥ 5

అ:- నీ సుందరవిగ్రహ కోమలాంగముల నుండి పదునాల్గు లోకములు పుట్టినవి. కోమలమైన నాభికమలములో బ్రహ్మదేవుని మూల నివాసస్థానమైన అద్భుత బ్రహ్మాండము ఉద్భవించెను.

విశేషార్థము :—

1. ఇందులో 'తథా లోకాన్ అకల్పయత్।' అను మంత్రార్థము చెప్పబడినది.

2. 'యద్భియా వాతి వాతశ్చ భాను స్తపతి యద్భియా।
ఇన్ద్రశ్చన్ద్రః తథా కాలః స్వే స్వే కార్యే చరన్తి తే॥
స ఏవ పరమో విష్ణుః'

(ఆదిపురాణము 13; 50, 51)

శ్రీ భగవంతుని అంగములనుండి జనించిన వాయుదేవుడు, సూర్యుడు, ఇంద్రుడు, చంద్రుడు, కాలుడు – ఇత్యాది దేవతలు పరమాత్ముని యనుగ్రహమును పొందుటకై, ఆతనివలని భయముచేత తమతమ పనుల యందు ఆసక్తులైయుండెదరు.

3. తదా విష్ణో ర్నాభిరూఢమబ్జమాసీదనుత్తమమ్।
కీటాఽణుకీటవచ్చాహం కమలాత్ ప్రజ్వలద్ద్యుతేః॥
తతోఽభవం మహాభాగ ప్రభాతే సంప్లుతోదకే।
దిశో విలోకమానస్య చత్వారి వదనాని మే॥

(అదిపురాణము 10; 5-6-7)

భగవంతుని నాభినుండి అసదృశమైన పద్మము జనించెను. అట్టి అసాధారణ కమలమునుండి ప్రళయకాల ప్రభాతకాలములో నేను జన్మించితిని. దిక్కులు చూచుచుండగనే నాకు నాలుగు ముఖములైనవి – అని చతుర్ముఖుడు పల్కిన వచనము కలదు

శ్రియఃపతే కోఽపి జయేన్న మాయాం
యయా జనో ముహ్యతి వేదనార్థమ్।
తం నిర్జితాత్మానమనన్తమాయినం
మాయాపహం త్వాం శరణం ప్రపద్యే॥

అ :- లక్ష్మీపతియైన శ్రీ వేంకటేశా! నీవు కల్పించిన ఏ మాయచే జనులు యథార్థము తెలుగక మోహము నొందుచున్నారో, అట్టి మాయను ఎవ్వరును తెలిసికొనలేరు. జయింపజాలరు. జ్ఞానార్థులు (తత్త్వజ్ఞానులు) కూడ నీ మాయచే మోహితులై మాయయొక్క సామర్థ్యమును తెలియకున్నారు. కావున నీవు సమస్త జీవులను జయించినవాడవు. అమితమైన మాయ (ఇచ్ఛామయ రూపము) కలవాడవు. నీభక్తులను ప్రకృతి బంధమునుండియు, నీమాయ నుండియు విముక్తులను చేయువాడవు. అట్టి నిన్ను నేను శరణు వేడుచున్నాను. నాయొక్క అజ్ఞాన మనెడు మాయను తొలిగించుము.

విశేషార్థము :-

త్రిభిర్గుణమయైర్భావైః ఏభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥

(భగవద్గీతా అ. 7; శ్లో॥ 13-14)

ఈ జగత్తంతయు సాత్త్విక, రాజస, తామస భావములచే భ్రమచెందుట వలన వీటి కతీతుడును, నాశరహితుడును అగు నన్ను జనులు ఎరుగనేరరు. నా యీ మాయాశక్తి, లేక యోగమాయ త్రిగుణాత్మకమైనది. దివ్యము. దాట శక్యముకానిది. నన్నే ఎవరాశ్రయింతురో లేదా నాకు శరణాగతులగుదురో వారే నా మాయనతిక్రమింతురు - అని భగవద్వచనము. 'మాయ' అనునది భగవంతుని ఇచ్ఛ లేక సంకల్పము. ఇదియే అజ్ఞానము, అశక్తి-అను రూపములతో సర్వజీవులను ఆవరించి బంధించియున్నది. దీని ప్రభావమునకు లోబడినవారందరు తమతమ స్థితిగతులను, ఈశ్వరుని శక్తిసామర్థ్యములను తెలిసికొనలేరు. ఈమాయ భగవదధీనము. భగవంతుడు తానై ఒక్కొక్కనికి ఈ మాయను పరిహరించునంతవఱకు సంసారమునుండి విమోచనములేదు. మాయను తరించుట యనగా నిదియే. ఇందులకై శ్రీహరిని శరణు పొందవలెను.

నమోఽతర్క్యాయ తర్క్యాయ సగుణాయాగుణాయ చ।
నమోఽనన్తాయాన్తకాయ వేద్యావేద్యస్వరూపిణే॥ 7

అ :- అనుమానముచే తెలిసికొనుటకు అశక్యమైనవాడును, ఐనను యోగ్యులైన భక్తులచే తమ యోగ్యతానుసారముగా నూహించుటకు సాధ్యమైనవాడును, దయాప్రసన్నతాది సుగుణములచే పూర్ణుడును, నిర్దయత్వాది దోషములు సత్వరజస్తమోగుణములు లేనివాడును, నాశము లేనివాడును, భక్తుల సంసార దుఃఖముల పోగొట్టి అనంత సుఖముల (మోక్షము) నిచ్చువాడును, దుర్జనులను నాశమొందించువాడును, సజ్జనులచే యథాయోగ్యముగా తెలిసికొనదగు స్వరూపము గలవాడును, దుర్జనులచే సర్వథా తెలిసికొనదగని స్వరూపము గలవాడునగు (లేక వేదములచే ప్రతిపాద్యుడగుటవలన సామాన్యముగ తెలిసికొనదగువాడును, వేదములచేతను సంపూర్ణముగా ప్రతిపాద్యుడు గాకుండుటచే తెలిసికొనవీలుకాని స్వరూపముగలవాడునగు) శ్రీనివాసునకు నమస్కారములు.

విశేషార్థము :—

1. నిరీహోఽనన్తలీలశ్చ నిర్గుణః సగుణాకృతిః।
స్రష్టా కర్తా చ సంహర్తా యాథార్థ్యం వేదకస్తవ॥

(ఆదిపురాణము 15-30)

దేవియందును ఇష్టములేనివాడును, అపరిమిత లీలలు కలవాడును, ప్రాకృతసత్త్వాది గుణరహితుడును, జ్ఞానానందస్వరూపుడును, సృష్ట్యాదులకు కర్త–ఇంతటి విచిత్రధర్మములు కలిగిన దేవదేవుడవగు నీ వాస్తవ స్వరూపము నెవడెఱుగును! మఱియు —

2. అప్పుడప్పుడు భగవంతుని గుణములను చెప్పుచుండగా నవి పరస్పర విరుద్ధములైయుండునట్లు తోచును. ఒకేవస్తువులో విరుద్ధధర్మములుండుట న్యాయముకాదు. పరమాత్మునియందు మాత్రమట్టివానికి సమన్వయము కుదురును. ఎట్లనగా గుణపూర్ణము–నిర్గుణము, వ్యక్తము–అవ్యక్తము, వేద్యము–అవేద్యము,

అణువు - మహత్, తర్క్యుడు - అతర్క్యుడు మొదలైనవి. సర్వస్వతంత్రుడై వందువలన వానిలో వన్నియు నణగియున్నవి.

అవ:- శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహసిద్ధికై చెప్పుచున్నారు.

సిద్ధిప్రదస్త్వం కిల దేవవర్య త్వత్ప్రేరితోఽహం తవ పాదమాప్తః।
త్వత్పాదభక్తో బహిరన్తరాత్మన్ కిమస్తి విజ్ఞాప్యమశేషసాక్షిణః॥ 8

అ:- భక్తుల మనోభీష్టములను పూర్ణముచేయు బ్రహ్మాదిదేవతలకంటెను ఉత్తముడవైన శ్రీవేంకటాచలపతీ! నీచే ప్రేరితుడవై నీయనుగ్రహమును సంపాదించుటకై నీ పాదకమలములనే ఆశ్రయించి నీపాద భక్తుడనైన నేను అందరి జీవాత్మలలోపలను వెలుపలను ఉండి సర్వాంతర్యామివై సర్వమును సాక్షాత్తుగా చూచుచున్న నీకు నా మనోగతమును విన్నవించుకొనవలెనా? నేను చెప్పుకొనవలసినదేమున్నది?

సుఖం నృపాలాః సుర దేవముఖ్యాః
బ్రహ్మాదయస్తే పదపద్మసంశ్రితాః।
త్వత్కింకరాస్తేఽపి పృథక్ విభావితాః
కురుష్వ శం భో ఋషిదేవమిత్ర॥ 9

అ:- ఉత్తమ సుఖానుభోగముగల శ్రీపతీ! నీపాదపద్మములనే ఆశ్రయించి సేవించుచున్న నీభక్తులైన వేర్వేరుగ తమతమ యోగ్యతకర్హములైన సుఖాదులుగల అంబరీషాది రాజులు, ఇంద్రాదిదేవతలకు ముఖ్యులైన బ్రహ్మాదిదేవతలు నీకృపావిశేషముచే వారివారి యోగ్యతానుసారము సుఖభోగాదులను పొందుచున్నారు. అట్టి దేవతలకు, ఋష్యాదులకు, ఆపద్బాంధవుడవైన ఓ హరీ! నాకు కూడ సంసార తాపశాంతిని కలిగించి సుఖము నిమ్ము

విశేషార్థము:-

'శం భో' అని పదమైనను, శం=సుఖమును, భావయతి=కలిగించువాడు, లేక శం భవతి యేన శంభుః=సజ్జనులకు సుఖమును కలిగించువాడు - అనియర్థము.

అవ :- సంసారమనబడు మహారణ్యములో పడియున్న నాకు నీపాదకమల ప్రాప్తియే సుఖము - అనుచున్నారు.

ఉత్పత్త్యధ్వన్యశరణ ఉరుక్లేశదుర్గాన్తకోగ్ర -
వ్యాలాకృష్టే విషయమృగతృష్ణాత్మగేహోరుభారః ।
ద్వన్ద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞపార్థః
పాదౌ శస్తౌ శరణద కదా యామి కామోపసృష్టః ॥ 10

అ :- అరణ్యమెంత భయంకరమో సంసారముకూడ అట్టిదేనని సరిపోల్చుచున్నారు.

అరణ్యము - రక్షకులులేనిది, నడచిపోవుటకు సాధ్యముకానిది, క్రూర సర్పములతోను, దుష్టమృగములతోను, దావాగ్నితోను, ఎండమావులతోను కూడి కడుభయంకరమైనది.

అట్లే సంసారము - రక్షకుడు లేనిది, ఆధ్యాత్మికాది తాపత్రయములు కలది, దారిద్ర్యఋణరోగాదులు, దాటుట కసాధ్యమైన, ఆత్మోన్నతికి ప్రతిబంధకములైన కామక్రోధాదులు, జయాపజయములు మానావమానాదులు - అను ద్వంద్వములతో కూడియున్న అతిదారుణమైన దుఃఖముగలది. ఆలుబిడ్డలు, ద్రవ్యము, రాజ్యము, బ్రతుకు-వీనిపైగల మోహము, ఎన్నియోకోరికలు - అవి నెరవేరలేదన్నబాధ, కష్టములను ప్రతిఘటించెడు శక్తిలేకుండుట-మున్నగు ననేక దుఃఖములచే నిండినది.

ఓ వేంకటేశ ప్రభో! ఆశాపాశములచే బద్ధుడనై ఈ సంసారారణ్యములో పడి సంసార తారక మార్గము నెఱుగని అజ్ఞాని యను సార్థక నామధేయుడనై సంసార తారకములును, కడు ప్రశస్తములునగు నీ పాద పద్మములను ఎప్పుడు శరణు పొందుదునో యని మిక్కిలి కుతూహల పడుచున్నాను.

భవాబ్ధితారం కటివర్తిహస్తం స్వర్ణామ్బరం రత్నకిరీట కుణ్డలమ్ ।
అలమ్బిసూత్రోత్తమమాల్య భూషితం నమామ్యహం వేంకటశైలనాయకమ్ ॥ 11

అ:- సంసార సాగరమును దాటించువాడవును, వడుము బంటి నీటిని దాటుట యెట్లు సులభమో అట్లే సంసారమనెడి సాగరము కూడ వడుము దాటి రాదని తనపాదములనే సేవించు తనభక్తులైన వారికి సంసార సముద్రమును దాటుట సులభమని సూచించుటకే నీ వడుముపై చేతి నుంచుకొనిన వాడవును, సువర్ణమయ పీతాంబరములను, రత్న నిర్మితములగు కిరీట కుండలములను ధరించినవాడవును, నాభిపర్యంతము వ్రేలాడుచున్న యజ్ఞోపవీతము ధరించిన వాడవును, అజ్ఞానాది దోషముల పోగొట్టు నుత్తమమైన సాలిగ్రామాదులచే సమకూర్పబడి పాదముల వరకు వ్రేలాడుచున్న వనమాలాదులచే నలంకృతుడవును, వేంకటాచలపతివియునగు నీకు నమస్కరింతును.

జామ్బూనదాభం గుణిభిర్వరేణ్యం
వక్షఃస్థలే దక్షకుచోర్ధ్వభాగే।
శ్రీవత్సలక్ష్మ్యంకిత దివ్యరూపం
శ్రీవేంకటాధీశమహం ప్రపద్యే॥ 12

అ:- బంగారువలె మనోహరమైన కాంతికలవాడును, జ్ఞానభక్తి వైరాగ్యాది గుణములచే నుత్తములైన బ్రహ్మాది దేవతలచే స్తుత్యుడును, వక్షఃస్థలమునందు కుడి చను పై భాగమున లక్ష్మీ స్వరూపమైన 'శ్రీవత్స' మను చిహ్నముతో కూడిన అలౌకికమైన (ఏ లోకమునందును కానరాని) దివ్యరూపము కలవాడును అగు శ్రీ వేంకటాచలపతిని శరణు పొందెదను.

విశేషార్థము:-

'ప్ర' ఇత్యుపసర్గాత్ 'పద—గతౌ' అను ధాతువు నుండి 'ప్రపత్తి' శబ్దము పుట్టినది.

సంస్థితం సువిమానాన్తర్విరించాద్యైశ్చ సేవితమ్।
చామరైర్వ్యజనైశ్ఛత్త్రైః శరదిన్దుముఖం భజే॥ 13

అ:- ఓ వేంకటేశా! ప్రశస్తమైన (గర్భాలయముపై నుండు బంగారు గోపురమగు 'ఆనందనిలయ' మనబడు) విమానములో నుండు వాడవును,

బ్రహ్మరుద్రాది దేవతలచే ఛత్ర చామరాదులతో సేవింపబడు చుండువాడవును, శరత్కాలములోని చంద్రుని బోలు కాంతివంతమైన ముఖము కలవాడవును— అగు నిన్ను సేవింతును.

భక్తానుకంపీ గరుడధ్వజస్త్వత్ –
స్కన్ధం సమారుహ్య కిరీటకుణ్డలీ।
పీతామ్బరశ్చారు సుమన్దహాసః
శ్రీకౌస్తుభశ్చక్ర వరాఽభయాంకితః॥ 14

అ:– ఓ స్వామీ! నీవు భక్తులపై దయగలవాడవును, గరుడధ్వజుడవును, గరుత్మంతుని భుజముపైనెక్కి పీతాంబర కిరీట కుండలాదుల ధరించి, ప్రకాశించు కౌస్తుభమణిని ధరించి శ్రీదేవితోను శంఖ–చక్ర–వరద–అభయ ముద్రలచేతను కూడినవాడవై సుందర మందహాస వదనారవిందుడవై, చతుర్దశ లోకములందలి భక్తులకు జ్ఞానోపదేశము చేయుచు వారి నుద్ధరించి, వరము లిచ్చుచు సంచరించుచున్నావు.

విశేషార్థము :–

'చర = గతిభక్షణయోః' యే యే గత్యర్థకాః తే తే జ్ఞానార్థకాః—అని చెప్పుట వలన భక్తులకు జ్ఞానోపదేశము చేయుచున్నాడని భావము.

అవ:– సంచరించువానికి ఒక్కొక్కప్పుడు జయాపజయములు కలుగుచుండును. అవి నీకు కూడ ఉన్నట్లు కనిపించెదవు – అనుచున్నారు.

సజయో విజయశ్చైవ దృశ్యోఽదృశ్యః శ్రుతోఽశ్రుతః।
సంభాషణోఽభాషణశ్చ వాచ్యోఽవాచ్యో వృషోఽవృషః॥ 15

అ:– నీవు సంచరించునపుడు కొలదిగా జయాపజయములు సంభవించునా? అనినచో నీవు సర్వత్ర పూర్ణజయశీలుడవైనను భక్తుల విషయములో పరాజితుడవై నీ యిచ్ఛతోనే వారి కధీనుడవై యున్నావు. అదృశ్యుడవై యుండినను వారి కగపడెదవు. మరియు వారికి వేదాదుల ద్వారా నీ కథా శ్రవణాదులచే

వివబడుదువు. దుర్జనులకు నీవు కనబడవు. మరియు వారితో పలుకవు. కావి భక్తుల నోళ్లద్వారా నీ మాహాత్మ్య ఉపదేశ భాషణము చేయుచున్నావు. దుర్జనులద్వారా నీవు భాషణము చేయవు. పూర్ణముగా వాచ్యుడవు గాకున్నను, యోగ్యులగు జ్ఞానులకు శాస్త్రములచే యథాశక్తిగా ప్రతిపాద్యుడవగుచున్నావు. అయోగ్యులకు నీ విషయమైన స్మరణమే కలిగింపనివాడవు నీవు. కామ క్రోధాది అరిషడ్వర్గరహితుడవు. మరియు షడ్గుణైశ్వర్యాదులచే పరిపూర్ణుడవు గమక భక్తుల యభీష్టములను వర్షించుచున్నవాడవు.

విశేషార్థము: —

హరి భక్తాధీనుడనుటకు ప్రమాణము.

'వశ్యతాం దూరగం సర్వదాఽప్యాత్మగమ్'

'వశ్యతాం స్వేచ్ఛయా సజ్జనేష్వాగతమ్'

(ద్వాదశస్తోత్రము అధ్యా. 8; శ్లో. 6—15)

త్వత్పాద పద్మయుగలం శ్రేయోనిస్సక్త మానసాః।
విసృజ్యోభయతః సంగం బ్రహ్మాద్యాస్సముపాసతే॥ 16

అ: — ఓ వేంకటేశా! ముఖ్య శ్రేయోరూపమైన నీ యనుగ్రహముపైననే ఆసక్తులైన బ్రహ్మాదిదేవతలు పుత్ర మిత్ర కళత్రాది సుఖము మఱియు మోక్ష సుఖము అనబడు ఈ రెండు విషయములందును ఆసక్తిని విడనాడి, విరక్తులై, నిశ్చలచిత్తులై భక్తి పూర్వకముగా నీ పాదపద్మములనే ఉపాసించుచున్నారు.

విశేషార్థము: —

విరక్తులైన భక్తులు తమకుగాను ఇహపర సుఖములు కావలెనని భగవంతుని ప్రార్థింపరు. భగవదనుగ్రహ మొక్కటి సిద్ధించెనేని తమ్మాలమున ఇహపరములు యథేష్టముగా దొరకును. వరి పొలములో కృషి చేయుట వలన ధాన్యముతోపాటు గడ్డికూడ దొరకును. గడ్డికై వేఱుగ కృషి చేయ నవసరము లేదు గదా!

**మాహాత్మ్యం శేవ సంద్రష్టుం రమాయా రమణస్య తే।**
**యత్కించిత్ ద్రష్టుమిచ్ఛామి మాయినోఽమాయివ శ్నథమ్॥ 17**

అ:- లక్ష్మీదేవితో క్రీడావిలాసాదులు గల ఓ వేంకటేశా! ఇచ్ఛా స్వరూపుడవై జగత్తునకు మోహమును కలిగించుచున్నను, భక్తుల విషయములో మాత్రము మోహమును కలిగింపని నీ మంగళ మహిమలు పరికింపనెవరికి సాధ్యమగును? అయినను అంతటి మహత్తరమైన నీ మహిమలను కొంత మాత్రమైనను చూడగోరెదను.

విశేషార్థము:—

మహామాయేత్యవిద్యేతి నియతిర్మోహినీతి చ।
ప్రకృతిర్వాసనేత్యేవం తవేచ్ఛానంత కథ్యతే॥

అని చెప్పినట్లు శ్రీహరి భక్తుల విషయములో కూడ మాయను కల్పించు వాడు. అనగా వారిని కొంతకాలము అజ్ఞానముతో కప్పిపుచ్చి, పిదప దానిని తొలగించి మోక్షము నిచ్చును. కనుక 'మాయావి' యనదగును. భక్తులు కానివారికి మోక్షాది ఫలముల నిచ్చు నుద్దేశము లేనివాడగుటచే 'అమాయి' యనదగును.

సర్వప్రాణి హృదావాసం వాసుదేవం జగద్ధితమ్।
శరణ్యాగ్రం దేవదేవం ప్రధానపురుషం భజే॥ 18

అ:— సర్వప్రాణుల హృదయములలో వసించువాడును, అన్ని స్థలము లలో నుండుటచేత 'వాసుదేవు'డనబడువాడును, జగత్తునకు హితము చేకూర్చువాడును, రక్షకులందగ్రగణ్యుడును, బ్రహ్మ రుద్రాది దేవతలకధిదేవుడును, క్షరాక్షర పురుషులకంటె నుత్తముడును అగు మూల పురుష రూపుడైన శ్రీ శ్రీనివాసుని భజింతును.

విశేషార్థము:—

వాసాత్పూతే ర్దేవనాద్వాసుదేవో వాసాద్ద్యుతేశ్ఛాదనాత్ క్రీడయా చ।
బలాదమత్వాద్దాదృతో వర్తనాచ్చ తం వాసుదేవం ప్రవదంతి వేదాః॥

అను శ్రుత్యర్థము ఇచట గలదు. ఇది మూడవ అధ్యాయము 25 వ శ్లోకములో వివరింపబడి యున్నది.

నమోఽవ్యక్తాయ వ్యక్తాయ పరాత్పరతరాయ చ ।
జగత్కారణకర్త్రే చ సాక్షిణేఽక్షయమూర్తయే ॥ 19

అ :_ ఓ వేంకటేశా! చక్షురాదీంద్రియముల కగోచరుడును (లేక వేదాదులచే సాకల్యముగ ప్రతిపాదింపబడని వాడును, లేక వ్యక్తాయ = భక్తులకు వేదాదులచే యథాశక్తి యోగ్యతానుసారము గోచరించువాడును), సర్వవ్యాప్తుడును, సర్వప్రాణులయందు నతిసూక్ష్మ రూపముతో నసించువాడును, బ్రహ్మాది సర్వ దేవతలకంటె సత్తమురాలైన లక్ష్మీదేవికంటె సత్తముడును, జగత్కర్తలుగ ప్రసిద్ధులైన బ్రహ్మరుద్రాది దేవతలకు కూడ సృష్టికర్తయును, ప్రత్యక్షముగ సర్వమును చూచువాడును, అనిత్యత్వాది చతుర్విధనాశములు లేని శాశ్వత మూర్తియును అగు నీకు నమస్కరింతును.

నమస్తే వాసుదేవాయ నమః సంకర్షణాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ యోగిహృత్పద్మవాసినే ॥ 20

అ:_ ఓ శ్రీపతీ! భక్తులకు మోక్షాది పురుషార్థముల నిచ్చుటచే 'వాసుదేవు' డనబడువాడును, భక్తుల దుఃఖములను పరిహరించుటవలన 'సంకర్షణు' డనబడువాడును, ఉత్కృష్ట జ్ఞానప్రదుడు మరియు నతి ప్రకాశస్వరూపుడగుటచే 'ప్రద్యుమ్న' డని పిలువబడువాడును, భక్తులచే నిగ్రహింపదగియున్నందున _ అనగా భక్తుల హృదయములందు ఎల్లప్పుడు విశేషముగా నసించుటచేత 'అనిరుద్ధు' డని పిలువబడు వాడును, సనకాది మహాయోగుల హృదయ పద్మములందు నసించుచున్నవాడును నగు నీకు నమస్కారములు.

విశేషార్థము: _

1. వాసనాద్వసతేశ్చాపి వాసుదేవః స ఏవ హి —

సర్వులను జీవించునట్లుచేసి తాను సర్వప్రాణుల యందు నసించుటచేతను, భక్తులకు మోక్షప్రదుడై నందునను 'వాసుదేవు'డని పిలువబడుచున్నాడు.

2. సర్వేషాం కర్షణాత్సోఽపి సంకర్షణ ఉదాహృతః

భక్తుల అనిష్ట-పాప-దుఃఖాదులను పరిహరించుటచే 'సంకర్షణు' డని పిలువబడుచున్నాడు.

3. ప్రకృష్టద్యోతనత్వాత్తు ప్రద్యుమ్న ఇతి కీర్తితః —

దివం + మనతి = ద్యుమ్నః; 'మ్నా = అభ్యాసే' ఇతి ద్యుమ్నం యశస్సు, ప్రకృష్టం ద్యుమ్నం యస్య=ప్రకృష్టమైన కీర్తిగలవాడు.

4. అనిరుద్ధః - సర్వగతత్వాత్=సర్వత్ర వ్యాప్తుడైనందున అనిరుద్ధుడు. లేక నిరుద్ధో న భవతీతి=అనిరుద్ధః=ఎవరిచేతనూ నిగ్రహించుటకు సాధ్యము గానివాడు. లేక అనిరుద్ధాన్ దధాతి = సంసారమునుండి విముక్తులైన వారిని పోషించుచున్నాడు, ధరించుచున్నాడు. అందుచే అనిరుద్ధుడు. జ్ఞానులచే హృదయమునందు నిగ్రహింపదగినవాడు. అనగా భక్తుల హృదయములందు ఎల్లప్పుడు విశేషముగా ఆవాసముచేసికొని యుండుటచే అనిరుద్ధుడు; లేక, భక్తులు కాని వారిచే నిగ్రహింపబడనందున - అనగా వారి హృదయములో విశేషముగా ఆవాసము చేయనందున అనిరుద్ధుడు.

పంచభూతవిసృష్టాయ పంచమాత్రాత్మకాయ చ ।
జ్ఞానకర్మేంద్రియేశాయ హృషీకేశాయ తే నమః ॥ 21

అ:- ఓ శ్రీనివాసమూర్తీ ! పృథివ్యాది పంచభూతములను సృష్టించినవాడవును (లేక పృథివ్యాది పంచమహాభూతములచే వదలబడినవాడవును అనగా భౌతిక శరీరము లేనివాడవును), రూపరసగంధాది పంచతన్మాత్రల కభిమాన దేవతల కంతర్యామివియును, చక్షురాది పంచజ్ఞానేంద్రియములు వాగాది పంచ కర్మేం

ద్రియములకభిమాని దేవతలకు ప్రభుడవును (ప్రేరకుడవు)(అనగా సర్వప్రాణుల సకలేంద్రియ మనోనియామకుడవును), రమాబ్రహ్మరుద్రేంద్రాదులను సంతోష పరచుటవలన - 'హృషీకేశ' డనబడు వాడవును అగు నీకు నమస్కారములు.

విశేషార్థము :-

1. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము సనెడి మహాభూతములు ఐదు. పృథివ్యాది పంచ తన్మాత్రలు ఐదు. వీటికి క్రమముగ ధరాదేవి, వరుణుడు, అగ్ని, వాయువు, మహాగణపతి - ఈ ఐదుమంది అభిమాని దేవతలు.

2. శ్రీహరి 'యోఽసావశరీరః ప్రజ్ఞాత్మా' అను శ్రుతిచే పాంచభౌతికశరీరము లేనివాడు. జ్ఞానానంద స్వరూపుడు.

3. బుద్ధీంద్రియాణి చక్షుః శ్రోత్రఘ్రాణరసనత్వగాఖ్యాని ।
వాక్పాణిపాదపాయూపస్థాఖ్యాని కర్మేంద్రియాణ్యాహుః ॥
చక్షురాది జ్ఞానేంద్రియములు ఐదు.
వాగాది కర్మేంద్రియములు ఐదు.

4. ఎ) చక్షురభిమాని సూర్యుడు. శ్రోత్రాభిమానులు దిగ్దేవతలు. ఘ్రాణాభిమానులు అశ్వినీ దేవతలు. రసనాభిమాని వరుణుడు. త్వగభిమాని ప్రాణుడు.

బి) వాగభిమాని అగ్ని. పాణ్యభిమాని దక్షుడు. పాదాభిమాని జయంతుడు. పాయ్వ (గుదము) భిమాని మిత్రుడు. ఉపస్థాభిమాని మనువు

5. హృష=తుష్టౌ, హృషీ=సంతోషముగలవారు. ఈ=లక్ష్మిదేవి, క=బ్రహ్మ, ఈశః=రుద్రుడు. వీరు ఆనందముగలవారు మఱియు లక్ష్మి బ్రహ్మాదులకు స్వామియు. లేక లక్ష్మి, బ్రహ్మ, రుద్రులకు ఆనందము నిచ్చువాడు లేక ఇంద్రియములకు నియామకుడు - అని భావము.

విష్ణవే వైష్ణవేశాయ జిష్ణవే జయదాయినే।
ఇష్టప్రదాయ చేష్టాయ కృష్ణాయోత్కృష్టకర్మణే॥ 22

అ :- ఓ వేంకటేశా! సర్వత్ర ప్రవేశించి వ్యాపించి యుండుటచే విష్ణుడవును, విష్ణు భక్తులకు నియామకుడవును, సర్వత్రజయశీలుడవును, కామక్రోధాదులను జయింపవలెనను కోరికగల భక్తులకు జయము కలిగించువాడవును, భక్తుల సర్వాభీష్టముల దీర్చువాడవును, భక్తుల కిష్టుడవును, వాసిష్ఠకృష్ణ (వేదవ్యాస) యాదవకృష్ణ (యశోదానందనుడు) రూపములు గలవాడవును, జగత్సృష్ట్యాది మహాకార్యములను జేయువాడవును, లేక దుష్టులైన దైత్యుల రాక్షసాదుల సంహార రూప ఉత్కృష్టకర్మలు చేయువాడవును అగు నీకు నమస్కారములు.

క్షరాక్షరోత్తమాయాథ స్వక్షరేశాక్షరాయ చ।
కుక్షిస్థపక్షిసంఘాయ క్షయాక్షయకరాయ తే॥ 23

అ :- ఓ వేంకటాచలపతీ! క్షరనామక బ్రహ్మరుద్రాదుల కంటెను అక్షర నామక లక్ష్మీదేవికంటెను ఉత్తముడవును శోభనాక్షరములుగల వేదముల వర్ణాభి మాన దేవతలకంటెను శ్రేష్ఠుడవును, ఉదరమునందనేక జీవసంఘముల నుంచు కొనిన వాడవును, దుర్జనులకు నాశమును సజ్జనులకు నాశాభావమును చేయు వాడవును, లేక తన భక్తుల దుఃఖపాపాదుల నాశనము చేసి పుణ్యవృద్ధిని చేయువాడవు నగు నీకు నమస్కారములు

విశేషార్థము :-

1. ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

(గీతా అ. 15; శ్లో 16-17)

బ్రహ్మరుద్రాదయో దేవాః శరీరక్షరణాత్ క్షరాః।
లక్ష్మీ రక్షర దేహత్వాత్ అక్షరా శ్రీరుదాహృతా।

అనగా ఈలోకమందు క్షరుడు, అక్షరుడు అను యిరువురు పురుషులు (చేతనులు) కలరు. వారిలో బ్రహ్మరుద్రాది దేవతల శరీరములకు నాశము కలుగుటచే వారు క్షరులనియు, సంసారులనియు చెప్పబడుచున్నారు. లక్ష్మీదేవి యొక్క శరీరమునకు నాశములేకుండుటచే ఆమె అక్షర యనబడుచున్నది. ఈ క్షరాక్షర పురుషుల కంటెను వేరైన 'శ్రీహరి' యుత్తముడు. అతడు మూడు లోకములను వ్యాపించి రక్షించును. అతడు నాశరహితుడగు సర్వేశ్వరుడు ఆతనినే పరమాత్మ యని యందురు.

2. సంక్రాంతసంవిదఖిలం జఠరే నిధాయ
లక్ష్మీభుజాంతరగతః స్వరతోఽపి చాగ్రే।

శ్రీహరి ప్రళయకాలమునందు సమస్తజగత్తును ఉదరమునందుంచు కొనును. తన ఉదరమునందుండు వక్షిప్రాయులైన సజ్జన సముదాయమునకు నాశరహితమైన ఆవాసయోగ్యమైన ముక్తిస్థానమును కలిగించును. లేక క్షి= నివాసగత్యోః గత్యర్థకములకు జ్ఞానార్థకత్వముండుటచేత అక్షయమైన ముక్తికి సాధనమైన జ్ఞానమును ఇచ్చువాడు.

3. 'హి' శబ్దముచే

ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి।

అను శ్రుతిలో జీవులకు సుపర్ణత్వము (పక్షులుగా నుండుట) నిర్దేశింపబడి యున్నది.

4. 'పరిభూః స్వయంభూః యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ ।
శాశ్వతీభ్యః సమాభ్యః' 'యచ్చికేత సత్యమిత్తన్నమోఘం'॥

-ఇత్యాది శ్రుతులందు శ్రీహరికి సత్యములైన ఉత్కృష్టకార్యములు గలవని ప్రతిపాదింపబడియున్నది.

నమో భవాయ భావాయ ధీరాయ పరమేష్ఠినే ।
వీరాయ వీరవపుషే ఋషయే పరమాత్మనే ॥ 24

అ:- ఓ శ్రీపతీ! సజ్జనులకు వాసయోగ్యమైన ముక్తిస్థానమును కలిగించువాడును (ముక్తిసాధనమునకు జ్ఞానప్రదుడు), సర్వమును ఉత్పత్తిచేయువాడును, భక్తులజ్ఞానముచే సంతోషించు ధైర్యశాలియును, సర్వోత్కృష్టస్థానములో నుండుటచే పరమేష్ఠియును, జీవులకు శక్తిప్రదుడును, సమాభ్యధికరహితమైన మహాకార్యములను సాధించునట్టి శరీరము గలవాడును, వ్యాసకపిలాది ఋషిరూపములు కలవాడును, సర్వోత్తముడును, పరబ్రహ్మస్వరూపియునగు నీకు నమస్కారములు.

విశేషార్థము :-

1 భవః=సంసారము, అభవః=మోక్షము, భక్తులకు మోక్షమును ప్రసాదించువాడు.

2. భావయతీతి భావః=జగత్సృష్ట్యాదులను చేయువాడు, లేక భాః=అవతీతి భావః=సూర్యచంద్రాదులకు ప్రకాశమునిచ్చువాడు, లేక భాని=అవతీతి= భావః=నక్షత్రములను రక్షించువాడు. ప్రకాశింపజేయువాడు. అవ= రక్షణ-గతి-కాన్తి-ప్రీతి-తృప్తి- అవగమ - ప్రవేశ-శ్రవణ -స్వామి-అర్థ- యాచన-క్రియా-ఇచ్ఛా-దీప్తి - అవాప్తి - ఆలింగన - హింసా -దాన-భాగ - వృద్ధిషు'. 'అవ' ధాతువు ఇన్ని అర్థములు గలది.

3. ధియా రమతే ఇతి ధీరః=భక్తులజ్ఞానముచే సంతోషించువాడు.

4. పరమే=హృదయాకాశమునందు, తిష్ఠతి=ఉండువాడు=పరమేష్ఠి.

5. 'రా - దానే' వీరాయ=వీర్యాదులను (సామర్థ్యాదులను) కలిగించువాడు.

నమో నారాయణాయాథ సాధారణధరాయ చ।
నమః సమర్హణార్హాయ ధరణీధరరూపిణే॥ 25

అ:- జీవులకు ప్రళయకాలమందాశ్రయుడును, మిక్కిలి పెద్దదైన బ్రహ్మాండమును అత్యల్ప పదార్థమువలె అనాయాసముగ ధరించినవాడును, బ్రహ్మరుద్రాదులచే విశేషముగ పూజింప నర్హుడును, దేవతలకు ముఖ్యశత్రువైన హిరణ్యాక్షుని వరాహరూపముతో చంపి భూమిని తన కోరలయందు ధరించియున్న వాడును అగు శ్రీమన్నారాయణునకు నమస్కారములు.

అర్చ్యైరర్చ్యాయాచ్యుతాయాపి వన్ద్యావన్ద్యపదాయ చ।
హిరణ్యగర్భగర్భాయ నమః శివశివాయ చ॥ 26

అ:- ఇంద్రాదులు రుద్రుని పూజింతురు. రుద్రాదులు బ్రహ్మను పూజింతురు. బ్రహ్మ లక్ష్మీదేవిని పూజించును. పూజ్యులైన వీరందఱు నిన్ను పూజింతురు. దేశకాలాదులచే నాశము లేనివాడవు, రుద్రేంద్రాదులచే వంద్యులైన బ్రహ్మాదులచే నమస్కరింపబడు పాదకమలములు గలవాడవు, బ్రహ్మాండోత్పత్తికి కారణమైన చతుర్ముఖ బ్రహ్మను తన గర్భములో నుంచుకొనినవాడవు, మంగళప్రద దేవతలకు మంగళ ద్రవ్యములకు మంగళము నిచ్చువాడవునగు ఓ పరమ మంగళమూర్తీ! శ్రీ వేంకటేశా! నీకు నమస్కారములు.

స్వద్వాయ శిపివిష్టాయ సచ్చిదానన్దరూపిణే।
కర్మజ్ఞాననిరూప్యాయ శ్రుతిస్మృత్యాలయాయ తే॥ 27

అ:- ఓ శ్రీనివాసా! ముక్తులకు మోక్షసుఖదాతవును, సూర్యరశ్మిలో ప్రవేశించియున్నందున శిపివిష్టుడవును, సత్-చిత్-ఆనంద (నిర్దోష - జ్ఞాన - సుఖ) స్వరూపుడవును, సత్కర్మ సుజ్ఞానముల సాధనమును ఉపదేశించువాడవును (లేక కర్మకాండ జ్ఞానకాండములనబడు శాస్త్రములచే ప్రతిపాద్యుడవును), హరి సర్వోత్తమత్వమును స్థాపించునట్టి శ్రుతి స్మృతులకు ఆశ్రయుడవును అగు నీకు నమస్కారములు.

విశేషార్థము: –

1. (ఎ) శిపివిష్టం = శిపిమ = కాష్ఠములలో అగ్న్యంతర్యామిగా నుండువని యర్థము.

(బి) పశవః శిపయః ప్రోక్తాః తత్రావిష్టోఽంతరాత్మనా।
శిపివిష్టః తతః ప్రోక్తః సర్వాంతర్యామిసంజ్ఞయా॥

అని స్మృతి. పశువులలో నంతర్యామిగా నుండుటచే 'శిపివిష్టు' డనబడుచున్నాడు.

(సి) 'యజ్ఞో వై విష్ణుః పశవః శిపిః యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠతి' అని శ్రుతి. విష్ణువే యజ్ఞస్వరూపుడు. శిపిః=పశువులు. శ్రీ విష్ణువే పశువులయందు సన్నిహితుడైయుండును.

(డి) 'శిపయో రశ్మయో మతాః, తేషుప్రవేశాద్విశ్వేశః శిపివిష్ట ఇహోచ్యతే' అను ఉక్తిచే శ్రీహరి సూర్యరశ్మిలో నుండును.

2. 'సచ్చిదానంద ఆత్మేతి మానుషైషు', 'ఆనందాదయః ప్రధానస్య' – ఇత్యాదులచే శ్రీహరి సచ్చిదానంద స్వరూపి.

3. 'శ్రుతిస్మృతీ హరేరాజ్ఞే' - వేదములు, స్మృతులు భగవంతుని ఆజ్ఞలు. 'సర్వేవేదాః యత్పదమామనన్తి। సర్వే వేదాః యుక్తయః సుప్రమాణాః, బ్రాహ్మం జ్ఞానం పరమం త్వేకమేవ ప్రకాశయంతే' – ఇత్యాది శ్రుతులు.

4. 'అహరహః సన్ధ్యాముపాసీత' 'దేవాన్నమేత్' 'జుహుయాత్' 'వేదానావర్తయీత'–ఇత్యాది సత్కర్మలను, హరి సర్వోత్తమత్వాది యథార్థజ్ఞానములను నుపదేశించువాడు.

5. శ్రుతి స్మృతుల కాశ్రయుడనగా —

"ఏకః శాస్తా న ద్వితీయోఽస్తి శాస్తా"

"ఏకో దాధార భువనాని విశ్వా"

"చతుర్విస్వాకం నవతిం చ నామభిః"

"ద్వావిమౌ పురుషౌ లోకే"

ఇత్యాదులందు చెప్పబడిన అర్థము నుపపాదించు విషయమునందు పెక్కుశ్రుతులు స్మృతులు వాశ్రయములుగా గలవాడు శ్రీహరి.

6. సంధ్యావందనము, వేదాధ్యయనము, దేవయజ్ఞములు ఇత్యాదులు "కర్మలు" యనబడును. జీవాత్మ పరమాత్మల జిజ్ఞాస, హరి సర్వోత్తమత్వమును తెలిసికొనుట, జ్ఞానము ఈ రెండింటను శ్రీహరియే ప్రతిపాద్యుడు.

యమాయ నియమాయాథ దానవ్రతకరాయ చ ।
తపస్వినే చ తప్యాయ తాపత్రయహరాయ చ ॥ 28

అ:— ఓ శ్రీనివాసమూర్తీ! అహింసా — అస్తేయ — అపరిగ్రహ — బ్రహ్మచర్యాది సద్గుణములను తన భక్తులకు ఇచ్చువాడును, సర్వ జగముల నియమించువాడును, సత్పాత్రులయందు చేయబడు మహాదానములు విష్ణు సంబంధ వ్రతాదులు ఇత్యాదులచేత మిక్కిలి సుఖము నిచ్చువాడును, బదరికాశ్రమములో వ్యాస—కపిల—ఋషభాది రూపములతో తపస్సు చేయుచున్నవాడును, భక్తులచే తపస్సు చేయించి అనుగ్రహించువాడును, ఆధ్యాత్మిక—ఆధిభౌతిక—ఆధిదైవిక ములను తాపత్రయముల పరిహరించువాడును అగు నీకు నమస్కారములు.

విశేషార్థము:—

"నియమయతీతి నియమః" "యమో-నియమవాద్ధరిః" అను ఉక్తిచే నియామకుడు.

యజ్ఞాయ విశ్వాయ సుమంగలాయ సుతీర్థపాదాయ సుతారకాయ ।
ప్రపన్నలోకానుగుణాయ శమ్భవే శుద్ధాయ శశ్వద్గుణవర్ష్మణే నమః ॥ 29

అ:— సజ్జనుల నుద్ధరించుటకు వైకుంఠమును వదలి ఇతర లోకములందు నవతరించువాడవు, సర్వజగత్తునందు వ్యాపించియున్నవాడవు, పరమ మంగళ

స్వరూపుడవు, గంగాది తీర్థములను పాదములందుంచుకొన్న వాడవు (లేక గయాది క్షేత్రములందు నీ పాదముల నుంచిన వాడవు), భక్తులను సంసారము నుండి తరింపజేయువాడవు, భక్తులకు వారి శరణాగతి ననుసరించి సుఖము నిచ్చువాడవు, ప్రాకృత దోషలేపము లేనందున పరిశుద్ధుడవు, శాశ్వతములైన జ్ఞానానందాది సద్గుణములను శరీరముగా గలవాడవువగు శ్రీ వేంకటపతీ! నీకు నమస్కారములు.

విశేషార్థము: –

1. 'యజ్ఞభోక్తృత్వాత్' అనగా యజ్ఞములం దివ్వబడిన హవిరాదులను భుజించుటచే "యజ్ఞ" డనబడుచున్నాడు. లేక "జపయజ్ఞశ్చేజ్యాం తపో యాజ్య ఏవ చ" – అని గీతా తాత్పర్యమునందు చెప్పిన ప్రకారమున యాజ్యుడగుటచే అనగా యజ్ఞభోక్తయగుటచే "యజ్ఞ" డనబడుచున్నాడు.

2. బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ వార్యుపస్పృశ్య మాధవః।
దధ్యౌ ప్రసన్నకరణః ఆత్మానం తమసః పరమ్॥

అను భాగవతవాక్యము ననుసరించి శ్రీహరి కృష్ణరూపముచే తనను తానే పూజించుకొనుచున్నాడని భావము. లేక రామరూపముచే అహల్యాదేవిని గౌతమఋషితో చేర్చినవాడు. 'యజ=దేవపూజా సంగతి కరణ దానేషు' - అనిధాతువు.

3. విశ్వాయ–విశ=ప్రవేశనే 'తదేవానుప్రావిశత్' అను శ్రుతిచే జగత్తున ప్రవేశించినవాడు. 'వా=గతిగంధనయోః' సర్వత్రప్రవేశించుటచే, లేక జ్ఞానస్వరూపుడగుటచే విశ్వరూపుడు. 'టు ఓశ్వి=గతివృద్ధ్యోః' అను ధాతువు. విః=పక్షి=గరుత్మంతుడు. శ్వయతి=గరుడునిపై కూర్చొని పోవువాడు. విశేషేణ శ్వయతి = వ్యాపించువాడు. విశేషేణ వర్ధతే = విశేషముగా అభివృద్ధి పొందుచున్నాడు. వాయుదేవుని అంతర్యామిగా నుండువాడు. విశ్వం వర్తయతి=జగత్తును తన అధీనమందే ఉంచుకొనువాడు. లేక జగత్తునకు కారణభూతుడైనందున, లేక జీవులకు నియామకుడైనందున 'విశ్వరూపుడు'.

శరీరేను ప్రవిష్టత్వాత్ విశ్వో జీవ ఉదీర్యతే।
జీవస్య తదధీనత్వాత్ విష్ణుః జీవ ఇతి స్మృతః॥

జీవుడు శరీరమునందు ప్రవేశించుటచే "విశ్వః" = జీవుడు. జీవుడు విష్ణువునకు అధీనుడైనందున విష్ణువు 'విశ్వః' అనబడుచున్నాడు. విశిష్టసుఖజ్ఞానబలరూపుడగుటచే 'విశ్వః'=విష్ణువు మొదలగు వర్థములను చెప్పవలెను.

4. 'మంగలానాం చ మంగలమ్'

5. 'తీర్థే శాస్త్రే అధ్వరే క్షేత్రే
జలోపాధ్యాయ మంత్రిషు' - అని కోశము.

కర్మిణేఽకర్మలిప్తాయ జ్ఞానాయ జ్ఞానదాయినే।
నిత్యముక్తాయ హరయే నిత్యముక్తిప్రదాయినే॥ 30

అ:- ఓ లక్ష్మీపతీ! జగత్సృష్ట్యాది వ్యాపారములం జేయువాడవును, దైత్య సంహారాదులవలన దోషలేపము లేనివాడవును, జ్ఞానస్వరూపుడవును, భక్తులకు యథార్థజ్ఞానము (అపరోక్షజ్ఞానము) నిచ్చువాడవును, నిత్యముక్తుడవును, భక్తుల పాపదుఃఖముల హరించువాడవును, భక్తులకు (దుఃఖనివృత్తిపూర్వక స్వరూపానందావిర్భావరూప) శాశ్వతముక్తి నిచ్చువాడవును అగు నీకు నమస్కారములు.

శుద్ధం వపుః పరమయోగమతుల్యసౌఖ్యం
భూమిం ద్యులోకముత తత్త్వమతిం సుభక్తిమ్।
వైరాగ్యమన్యసుగుణాన్ భజకేషు దాన -
శీలం దయోదయమహం శరణం ప్రపద్యే॥ 31

అ:- సజ్జనులకు సాధనానుష్ఠాన యోగ్యమైన పరిశుద్ధమైన శరీరము నిచ్చి అణిమాద్యష్టైశ్వర్యములతో కూడిన పరమసౌఖ్యము నిచ్చి, ఆ పిదప సార్వభౌమత్వము, అనంతరము స్వర్గసుఖము నిచ్చెదవు. పుణ్యము క్షీణించిన పిదప మరల భూలోకప్రాప్తి, ఆపైన పరమయోగము అనగా సమాధి పరిపక్వావస్థ,

తత్త్వజ్ఞానము మఱియు పరమభక్తియు విచ్చి దానిచే అత్యంత వైరాగ్యము, సత్త్వాది గుణములు, క్రోధాద్యభావము - ఇత్యాదుల నన్నిటిని ప్రసాదించు మిక్కిలి దయ గలవారవైన వేంకటేశా! నిన్ను శరణుపొందుచున్నాము.

విశేషార్థము :

1. అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా।
   ప్రాప్తిః ప్రాకామ్యమీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః॥

(అమరకోశము).

2. పరమయోగమనగా యోగధ్యానము. సమాధి పరిపక్వావస్థ 'యోగము'.

3. మధ్యమధ్యలో ఖండించి గుణముల ననుసరించి చింతించుట 'ధ్యానము'.

4. ఏకాగ్రచిత్తముతో తైలధారవలె అవిచ్ఛిన్నముగా గుణములను చింతించుట 'సమాధి'.

5. విషయములందు అభిలాషను వదలి మనస్సులోపల ధారణ చేయుట 'ధారణము'.

6. చక్షురాదీంద్రియములను విషయముల దిశకు వెళ్ళనీయక మఱలించి స్వాధీనములో నుంచుకొనుట 'ప్రత్యాహారము'.

7. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
   యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।
   తే పుణ్యమాసాద్య సురేంద్రలోకం
   అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్।
   తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
   క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి।
   ఏవం త్రయీధర్మమనుప్రపన్నాః
   గతాగతం కామకామా లభన్తే।

(భగవద్గీతా అధ్యా 9; శ్లో 20-21)

కొందఱు మూడువేదములను అధ్యయనమొనర్చి, అందు అప్రధానముగా చెప్పబడిన కర్మపరమైన యజ్ఞాదులకంటె అమ్యడవైన నన్నుఆరాధించి, సంతోష ముతో సోమపాన మొనర్చి పాపములను తొలగించుకొన్నవారై అల్పమైన స్వర్గ ఫలము నపేక్షింతురు. అట్టి పురుషులు వారివారి పుణ్యకర్మప్రాబల్యమున స్వర్గమునకు బోయి దేవేంద్రభవనమునందు దివ్యములగు భోగముల ననుభ వింతురు. వారు విశాలమగు స్వర్గలోకమునందు సుఖములననుభవించి వారి పుణ్యము క్షీణింపగా మర్త్యలోకమునకు తిరిగివత్తురు. ఇట్లు భోగపరులగు వారు వేదములయందు అప్రధానముగా చెప్పబడిన కర్మకాండ నాశ్రయించి, వచ్చుచు పోవుచునుండెడి అశాశ్వతము, సంసారహేతువునైన అల్పఫలమును పొందుదురు.

అవ:- సాధన పారంపర్యము దేనివలననగా -

సులభం దుర్లభం వన్దే భగవన్తం సనాతనమ్।
సదసత్ క్షేత్రగం విష్ణుం మూర్తామూర్తం శుభాశుభమ్॥ 32

అ:- ఓ శ్రీనివాసా! (జిజ్ఞాస, నిధిధ్యాసనము, పరమేశ్వరానుగ్రహము, తద్దర్శనము, పరమభక్తి, పరమానుగ్రహము తద్ద్వారా మోక్షము అను) భక్తి తపస్సుల సాధనపరంపర కలవారికే సులభముగా పొందుటకు శక్యుడవును, సాధనపరంపరలేమిచే దుర్జనులకు దుర్లభుడవును, షడ్గుణైశ్వర్య సంపన్నుడవును (అనగా సమస్తజగత్తుల ఉత్పత్తిప్రళయములు, ప్రాణుల జననమరణములు, విద్యా మరియు అవిద్యా-వీనిని పూర్ణముగా తెలిసినవాడవును, లేక పూర్ణైశ్వర్యము, ధర్మము (వీర్యము), యశస్సు, కాంతి, జ్ఞానము, వైరాగ్యము (విజ్ఞానము) లను ఆరు ముఖ్యగుణములచే సర్వదా సర్వత్ర పూర్ణముగా నున్నవాడవును), అనాదికాలము నుండియు నున్నవాడవును, సమస్త సజ్జనుల దుర్జనుల శరీరము లందుండు వాడవును, సర్వవ్యాప్తుడవును, మూర్తామూర్తములందు (పృథివీ-జల తేజస్సులు మూర్తములు. వాయు - అంతరిక్ష - మనస్సులు అమూర్తములు) వ్యాప్తుడు, నియామకుడు మరియు ప్రేరకుడుగా నున్నవాడవును, సద్వర్గమునకు (ఉత్తమప్రాణి సమూహములకు) శుభదాయకుడుగాను అసద్వర్గమునకు (దుష్ట ప్రాణి సమూహములకు) అశుభముల నిచ్చువాడవుగాను ఉండు నిన్ను శరణుపొందెదను.

విశేషార్థము :-

శ్రీహరి వ్యాప్తుడైనప్పటికిని 'సత్' 'అసత్' క్షేత్రముల వానము ఎట్లగువవగా 'మూర్తామూర్తం' 'మూర్తం సదితి సంప్రోక్తం అమూర్తం అసదుచ్యతే' అని పైంగి శ్రుతి. మూర్తము 'సత్' అనబడును. అమూర్తము 'అసత్' అనబడును.

గోవిన్దం గోగణాతీతం కల్మషఘ్నమకల్మషమ్।
ప్రతికల్పేఽకల్పకల్పతరుం సర్వార్థకల్పకమ్॥ 33

అ: ఓ శ్రీనివాసా! సర్వవేద ప్రతిపాద్యుడవును, సర్వవేదరాశి నతిక్రమించినవాడవును (అనగా సమస్తవేదములచే సంపూర్ణముగా ప్రతిపాదింప వీలుగానివాడవును), భక్తుల పాపములను పరిహరించువాడవును, నిష్కల్మషుడవును. ప్రతికల్ప-దివకల్ప-మనుకల్పములయందు, మరియు ప్రతి యుగమునందును సకలాభీష్టార్థముల నిచ్చు కల్పవృక్షము వంటివాడవును అగు నిన్ను శరణు పొందెదను.

దుష్టభావః ప్రమత్తో వా నామాద్యుచ్చారకో హి యః।
బ్రహ్మహత్యాదిపాపాని దహత్యేవ న చాన్యథా॥ 34

అ:- ఉన్మత్తుడైనను, దుష్టభావముతోకూడిన వాడైనను, ఎవడు నీ నామగుణ క్రియాదుల నుచ్చరించునో, ఆతడు కావించిన బ్రహ్మహత్యాది మహాపాతకములు, ఉపపాతకములు మొదలగు దోషములనన్నిటిని నీవు దహించుచున్నావు. (శుద్ధమైన మనస్సుతో నీ నామస్మరణముచేయు భక్తులు ఉద్ధరింపబడుదురని చెప్పుటలో సందేహమేమి? నీ నామస్మరణ మహిమ అంతగొప్పది!) నీ నామస్మరణాదులను ఆచరింపని వారికి దోషపరిహారమే లేదు.

విశేషార్థము :-

1. బ్రహ్మహత్య, సురాపానము, బంగారమును దొంగిలించుట, గురుభార్యాగమనము, పై పాపములను చేయువారితో సంబంధము కలిగియుండుట- ఇవి పంచమహాపాతకములు.

2. గోవధ, స్త్రీవధ, బాలవధ, భ్రూణహత్యాదులు – ఉపపాతకములు.

3. మాతృ–పితృ–భ్రాతృ– భర్తృ – మాతుల – ఆచార్యాదుల నిందాదులు చేయుట అతిపాతకములు.

అజ్ఞానా దథవా దమ్భాత్ పుణ్యశ్లోకస్య నామ తే ।
యో వదేత్ తాని నశ్యన్తి తూలరాశి ర్యథాఽనలాత్ ॥ 35

అ:- తెలియకనో కపటముగనో పుణ్యకీర్తనుడవైన నీనామములను ఎవ్వడేని ఉచ్చరించునో అంతమాత్రముచే నతని మహాపాపములన్నియు అగ్నిలో దూది రాశివలె దహింపబడుచున్నవి.

క్షుధితో దుఃఖితః శ్రాన్తః త్వన్నామ యది సంస్మరేత్ ।
తస్య దుఃఖాని సర్వాణి నశ్యన్తి క్షణమాత్రతః ॥ 36

అ:- ఆకలిగొన్నవాడు, దుఃఖముతోనున్నవాడు, శ్రమచే డస్సినవాడు ఎవ్వడైనను నీనామములను భక్తితో స్మరించెనేని వాని దుఃఖములన్నియు క్షణములో నశించును.

సర్వాణ్యశుభజాతాని దురితాఘాని యాని చ ।
తాని సర్వాణి లభతే మత్తస్త్వం విస్మృతో యది ॥ 37

అ:- ఎవడు అజ్ఞానముచే నీ నామ స్మరణాదులను చేయక విస్మరించి యుండునో ఆ మదమత్తుడు సర్వ అమంగళములను, దుఃఖములను, బ్రహ్మహత్యాది మహాపాతకములను పొందుచున్నాడు.

విశేషార్థము :-

ఎవడు భగవంతుని కృపచే సకలసాధన సంపదలను (శరీర-ఆయురారోగ్య-ద్రవ్య-గృహ-పుత్ర-కళత్రాదులను) కలిగియుండియు, మదోన్మత్తుడై నీ నామస్మరణాదులను చేయడో అతడు కృతఘ్నుడగుచున్నాడు. అతడు చేసిన పాపము లన్నియు నశింపక అట్లే యుండును.

న తీర్థయాత్రా న చ దానయజ్ఞా
వ్రతం తపో నార్చనమన్యదైవమ్।
యత్ శ్రీనివాసస్య చ నామకీర్తనం
తదేవ సర్వార్థసమృద్ధికారణమ్॥ 38

అ :- గంగాది తీర్థయాత్రలు, షోడశమహాదానములు, జ్యోతిష్టోమాశ్వమేధ వాజపేయాది యజ్ఞములు, కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములు చేయుట, శీతోష్ణ సుఖ దుఃఖాదులు, కాయక్లేశాదులు మున్నగు వ్యయప్రయాసలకు ఓర్చి త్రేతాగ్ని మధ్యమున భగవద్ధ్యానమునందే ఆసక్తితో చేసెడు తపస్సు, ఇతర దేవతల నుద్దేశించి చేయు పూజాదులు మున్నగునవి భక్తితో నాచరింపబడు నీ నామ కీర్తనలకు సరితూగవు. ఎచ్చట శ్రీ శ్రీనివాసుని నామకీర్తనము జరుగునో అచ్చట సకల పురుషార్థములు సమకూరును.

విశేషార్థము :-

1. భగవంతుడు కావలసినంత ఐశ్వర్యాదులను ఇచ్చియుండగా, దానిని భగవత్ప్రీతికొరకు దానభోగములతో సార్థక పరచవలెననుట భక్తుల సమ్మతము. భూదానము, శయ్యాదానము, గోదానము. ఛత్ర-ద్రవ్య-దీప-చామర-ఆసన-జలపాత్ర-కమండలు-దర్పణ దానములు చేయగల స్తోమత లేనివారు భగవన్నామ స్మరణచేతనే దానఫలములను బడయుదురు.

2. షోడశ మహా దానములు: -

మహాదాన మనుత్తమం సర్వపాపక్షయకరం నృణాం దుస్స్వప్న నాశనమ్।
పుణ్యం పవిత్రమాయుష్యం సర్వపాపహరం శుభమ్।
పూజితం దేవతాభిశ్చ బ్రహ్మ విష్ణు శివాదిభిః।
ఆద్యం తు సర్వదానానాం తులా పురుష సంజ్ఞకమ్।
హిరణ్యగర్భదానం చ బ్రహ్మాండం తదనంతరమ్।

కల్పపాద ప్రదానం చ గోసహస్రం చ పంచమమ్ ।
హిరణ్య కామధేనుశ్చ హిరణ్యాశ్వస్తథైవ చ ।
హిరణ్యాశ్వ రథస్తద్వత్ హేమహస్తి రథస్తథా ।
పంచలాంగలకం తద్వత్ ధరాదానం తథైవ చ ।
ద్వాదశం విశ్వచక్రం తు తతః కల్పలతాఽత్మకమ్ ।
సప్త సాగరదానం చ రత్నధేనుస్తథైవ చ ।
మహాభూతఘటస్తద్వత్ షోడశం పరికీర్తితమ్ ।

(మత్స్యపురాణము 273 వ అధ్యాయము)

1) తులాపురుషదానము 2) హిరణ్యగర్భదానము 3) బ్రహ్మాండదానము 4) కల్పపాదదానము 5) గోసహస్రదానము 6) హిరణ్యకామధేను దానము 7) హిరణ్యాశ్వదానము 8) హిరణ్యాశ్వరథదానము 9) హేమ హస్తి రథదానము 10) పంచలాంగలకాన్విత భూదానము 11) హేమ ధరాదానము 12) విశ్వచక్రదానము 13) మహాకల్పలతాదానము 14) సప్తసాగరదానము 15) రత్నధేనుదానము 16) మహాభూతఘట దానము — ఇవి షోడశమహాదానములు.

వారి వారి విత్త విభవానుసారముగ దానము చేసిన వారికి సకలపాప దుఃఖపరిహారము, ఆయుష్యాభివృద్ధి, ఇష్టార్థసిద్ధియు కలుగును. బ్రహ్మాది దేవతలు, చక్రవర్తులు, మహారాజులు అత్యాదరముతో ఆ విధముగచేసినట్లు మత్స్య పురాణమున విస్తారముగ నిరూపింపబడియున్నది. శ్రద్ధాభక్తులతో హరినామ కీర్తన చేయువారు ఈ మహాదానఫలములను పొందుచున్నారు.

యాత్రా యజ్ఞా వ్రతా ధర్మా దానాన్యన్యా న్యసంఖ్యయా ।
తవ నామస్మృతే ర్భక్త్యా కలాం నార్హన్తి షోడశీమ్ ॥ 39

అ:- అనేకములైన బదరికాశ్రమాది క్షేత్రయాత్రలు, యజ్ఞములు, ధర్మ ములు, వ్రతములు, అన్నదాన - భూదాన - గోదానాది దానములు

మొదలగువవన్నియు, భక్తితో చేయబడు నీ నామస్మరణవలని ఫలితముయొక్క పదునారవ భాగమందలి యొక భాగముతో కూడ సరితూగజాలవు.

అహో భాగ్య మహో భాగ్యం విష్ణునామానువర్తినామ్।
తేషాం దూరో యామ్యలోకః స్వర్గో మోక్షశ్చ తత్ఫలమ్॥ 40

అ:— ఓ స్వామీ! హరినామ స్మరణ కీర్తనాదుల చేయు సజ్జనుల భాగ్యమే భాగ్యము. ఎంతటి మహాభాగ్యము! ఎందువలననగా, వారికి నరక దుఃఖము, యమలోకము మిక్కిలి దూరము. స్వర్గము, అనంతరము మోక్షమును పొందుటయే భగవన్నామ స్మరణము వలన కలిగెడి మహత్ఫలము.

మాహాత్మ్యం విష్ణునామ్నో హి వర్ణితుం కేన శక్యతే।
అజామిలో మృత్యుపాశాత్ ముక్తో వైకుంఠగో యతః॥ 41

అ:— శ్రీహరి నామములకు గల మహిమను వర్ణింప నెవరి తరము? అది యసాధ్యము. ఎందులకనగా, హరిస్మృతిచే అజామిళుడు కూడ మృత్యుపాశము నుండి విముక్తుడై, వైకుంఠమును చేరెను గదా!

అయమేవ మహాధర్మో నరాణాం తారకః స్మృతః।
విష్ణౌ సదా భక్తియోగః తన్నామగ్రహణాదిభిః॥ 42

అ:— అట్టి భగవన్నామ స్మరణ మొక్కటియే శ్రీహరియందు భక్తిని వృద్ధి పొందించును. మఱియు సంసారతారకమై అత్యుత్తమమైన మహాధర్మమగుటచే అవశ్యకర్తవ్యము.

నైకోఽజామిల ఏవ పాపజలధిం సన్తీర్ణవాన్ నామతః
ప్రహ్లాదోఽపి గజేన్ద్రపూర్వబహవో దుఃఖామ్బుధేస్తారితాః।
యన్నామ స్మరణాఽమృతాంబుధినిమగ్నోఽద్యాపి గౌరీపతిః
యద్ధ్యానే నిరతాః ప్రజాపతిముఖాః ప్రాప్తా మహావైభవమ్॥ 43

అ:— అజామిళు డొక్కరుడు మాత్రమే శ్రీహరి నామస్మరణచే పాప సాగరమును దాటి పోయెనా? కాదు. ఇంకను ప్రహ్లాదుడు, గజేంద్రుడు మొదలుగా

గల అనేకులు హరి నామస్మరణచే దుఃఖసాగరమును తరించియున్నారు గౌరీపతియగు మహారుద్రదేవుడు ఇప్పటికిని "రామనామస్మరణ" మనెడు అమృత సముద్రములో నిమగ్నుడై యున్నాడు. చతుర్ముఖాది దేవతలు కూడ మహావైభవోపేతములైన పదవులను పొందియున్నవారయ్యును, హరినామధ్యాన నిమగ్నులైయున్నారు.

విశేషార్థము :—

1. అజామిళుడు సదాచార సంపన్నుడు, శమదమాది రూప గుణ సంపన్నుడు, మాతా పితరులందు మహాభక్తి కలవాడు. ఒకనాడు ఫల పుష్ప సమిధల దెచ్చుటకై యడవికివెళ్ళి మరలి వచ్చునపుడు దారిలో అంత్యజాతికి చెందిన యొక స్త్రీ నగ్నముగా నుండగా జూచి మోహపరవశుడాయెను. నాటి నుండి ఎంత ప్రయత్నము చేసినను మనస్సును నిగ్రహించుకోలేక మిగుల కామపీడితుడై ఆమెను వశపరచుకొని, తన తల్లి దండ్రులను భార్యా పుత్రులను, అన్ని సద్ధర్మములను విడచి స్వేచ్ఛానుసారము భోగలాలసుడై ఆమెతో పెక్కు సంవత్సరములు గడపెను. కొద్దికాలమునకు పిల్లలు కూడ కలిగిరి. పిదప తన యంత్యకాలమున పుత్రుని పిలుచు నెపముతో "నారాయణా!" అని ఉచ్చరించినంతనే పూర్వస్మృతికలిగి తనపాపకృత్య ములకు మిక్కిలి పశ్చాత్తాపము నొంది, పూర్వ సంస్కార బలమువలన భక్తి పూర్వకముగ భగవంతుని స్మరించుటచే అతడు అమృతత్వము నొందెను.

'సర్వదాఘహరం విష్ణోర్నామ తద్భక్తి పూర్వకమ్ ।
అభక్తోదాహృతం చైవ ఫలదాతా భవిష్యతి ।
అజామిళోఽపి స్మరణాత్ భక్త్యా మృత్యోరముచ్యత' ।

— అను నారదీయ పురాణ వచనాను సారము శ్రీహరి నామములను భక్తులుచ్చ రించిన వెంటనే దోషములు నశించును. భక్తులు కానివారుచ్చరింపగా దోష శాంతి కలుగదు. అజామిళుడు భ్రష్టుడై నిందితుడై యుండినను పుత్రుని పిలుచు నెపముతో, భక్తి శ్రద్ధలతో, "నారాయణ" స్మరణము చేయుటవలన

మృత్యువునుండి తప్పించుకొని వైకుంఠము నొందెను. ఇట్లుండగ పక్షములు భక్తితో హరినామోచ్చారణము చేసిరేని సద్గతి నొందుదరని వేరుగ చెప్ప వలెనా ?

సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా।
వైకుంఠనామ గ్రహణమశేషాఘహరం విదుః॥

(భాగవతము స్కంధము 6; అ. 2; శ్లో. 18)

– ప్రియమైనవారి పేరు నిమిత్తముగా గాని, పరిహాసముతోగాని, ఏ విధముగా నైనను భగవన్నామమును కీర్తించినచో సకల పాపములు నశించును.

2 ప్రియో హి నితరాం కృష్ణశ్రవణం కీర్తనం ప్రియాః।
వాచా గాయన్తి తల్లీలాం కర్ణే శృణ్వన్తి తద్యశః॥
పద్భిః గచ్ఛన్తి క్షేత్రాణి కరైర్మందిరమార్జనమ్।
పశ్యన్తి రూపం చక్షుర్భ్యాం గన్ధం జిఘ్రన్తి నాసయా॥
హరేర్నిర్మాల్యపుష్పస్యాసేవనం చైవ కుర్వతే।
భక్త్యా పాదోదకం పీత్వా యాన్తి సద్తర్పణం హ్యాది॥
మానసే చరణం విష్ణోః నైవేద్యముదరే తథా।
నిర్మాల్యం చన్దనం ఫాలే మస్తకే తులసీదళమ్॥

(ఆదిపురాణము 4; 10-13)

– శ్రీకృష్ణకథాశ్రవణము, వాక్కుతో లీలాగానముచేయుట, చెవులార భగ వానుని యశస్సువే వినుట, పాదములతో క్షేత్రములకు వెడలుట, చేతులతో హరిమందిరమును శుభ్రముచేయుట, కన్నులతో దివ్యమంగళరూపమును దర్శించుట, ముక్కుతోగంధము నాఘ్రాణించుట, నిర్మాల్యపుష్పములను సేవిం చుట, శ్రీహరి పాదోదక పానము, నైవేద్యస్వీకారము, మనసా శ్రీహరి పాద ములను ధ్యానించుట - ఇత్యాది కార్యములు శ్రీహరికి మిక్కిలి ప్రియములు.

యన్నామ తే సర్వజగద్ధురన్త
దుష్కర్మశైలాంశ్చ బహూన్ భినత్తి।
స సర్వశక్తే స హి విశ్వరూప
ప్రసీద మామనిరుక్తాత్మశక్తే॥ 44

అ:— ఏ నీ నామస్మరణము సర్వ జగత్తుయొక్క అపార దుష్కర్మ లనెడు పర్వతములను విచ్ఛిన్నము చేయునో అట్టి సర్వశక్తులు గలవాడవు, విశ్వరూపుడవు, ఎవరి చేతను జయించుట కశక్యమైన స్వరూపశక్తి గల వాడవు నగు నో వేంకటేశా! నీ నామ భజకుడనైన నన్ను ప్రసన్నుడవై యనుగ్రహించుము.

అనుగ్రహార్థం భజతాం పదాబ్జం
అనామరూపస్త్వ గుణో హ్యజన్మా।
నామాని రూపాణి గుణాన్ క్రియాశ్చ
జన్మాని గృహ్ణాసి స మాం ప్రసీద॥ 45

అ:- నీవు ప్రాకృత నామ-రూప-గుణ-క్రియాదులు, భూమిపై జన్మించుటయు॥ వానికి అతీతుడవైనప్పటికిని, నీ పాద పద్మముల నారాధించువారిని అనుగ్రహించుటకే అనంతములైన అప్రాకృత రామకృష్ణాది నామములను, శుక్లాది రూపములను, జ్ఞానానందాది గుణములను, జగత్సృష్ట్యాది క్రియలను, మత్స్యకూర్మాద్యవతారములను స్వీకరించుచున్నావు. అట్టి నీవు నన్ననుగ్రహించుమా!

విశేషార్థము:—

1. భగవంతునికి నామ రూపాదులు లేవందురు. ఇందులకు నిదర్శనము క్రింది సూక్తులు:—

'న విద్యతే యస్య చ జన్మ కర్మ వా'
అనామరూపాత్మని రూపనామనీ।
విధిత్సమానో అనపపార శాస్త్రికృత్॥
'అనామా సోఽప్రసిద్ధత్వాత్ అరూపో భూతవర్జనాత్'

భగవంతుని నామరూపములను సమగ్రముగా వచింప దగినన్ని పద ములు శబ్ద ప్రపంచములో లేవు. అందుచే "అనామా" యనియు, అట్లే పాంచభౌతికమైన రూపములు లేకుండుటచే "అరూపు" డనియు చెప్పుచున్నారు.

"యోఽసావసౌ నిర్గుణః సగుణః" — అని శ్రుతి.

"స నిత్యః శుద్ధః కేవలో నిర్గుణశ్చ"

"స హి సర్వగుణైః పూర్ణః"

"అజాయమానో బహుధా విజాయతే" — అను శ్రుతిలో చెప్పినట్లు దేహ యోగాదిరూపమైన జన్మము లేనివాడైనను అనేక రూపములతో నవతార ముల నెత్తుచుండును.

"స ఏతేభ్యో అభ్యదీక్షపత్"

"వ్యమిశ్రాణి వ్యమిశ్రయత్"

"శుక్లం కృష్ణం కనీనికా' ఇత్యాది శ్రుతులు

— ఆ యవతార దేహములు సాత్త్వికములు, భౌతికములు మాత్రమే గాక అసాధారణములు, అలౌకికములు కూడ అయియున్నవని చెప్పుచున్నవి.

జన్మాదిభిర్జనే మోహానుగ్రహావధికారతః ।
కరోషి సామ్ప్రతం భూయోఽనుగ్రహస్తు భవేన్మయి ॥ 46

అ: — నీ యవతారముల వలన జనసముదాయములో వారి వారి యోగ్యతాను సారముగ కొందరికి మోహము (అజ్ఞానము) కలిగించుచున్నావు. కొందరిని అనుగ్రహించుచున్నావు. ఓ శేషగిరివాసా! ఇప్పుడు నా యందు విశేషాను గ్రహమువే ప్రసరింపజేయుము.

దయాపాంగలవో భూయాదిహాఽముత్రేష్ట వర్షణః ।
అన్యథా నాత్ర సన్దేహ ఇతి చిత్తే సునిశ్చితమ్ ॥ 47

అ: — ఓ పరమాత్మా! కృపాపూర్ణుడవైన నీ యొక్క క్రీగంటి చూపునందలి లేశమాత్రము చేతనే ఇహలోక పరలోకములకు సంబంధించిన అభీష్టములు

లభించును. అనగా మోక్షసుఖము పరిపూర్ణముగా ప్రాప్తించును. నీవు కటాక్షింపకున్న యెడల ఇతర ప్రయత్నము లెన్ని చేసినను, మరెవ్వరి వలనను నా కోరికలు చేకూరవని నా దృఢ నిశ్చయము. ఇందులో ఎట్టి సందేహములేదు (అనగా నీవు తప్ప నా కోర్కెను తీర్చువారెవ్వరును లేరని భావము) ఓ దేవా! అందువలన నా యందు పూర్ణానుగ్రహము నుంచుము.

అవ: పాపినగు నన్ను నీ వెట్లనుగ్రహింతువనగా —

ఓం నమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే।
మహానుభావాయ మహామాయినేఽమేయ కర్మణే॥ 48

అ: — ఓ శ్రీపతీ! "జపతో నాస్తి పాతకం" అని స్మృతి చెప్పినట్లు 'ఓం నమో వేంకటేశాయ ఓం' అను నీ మంత్రమును నేనెల్లప్పుడు జపించుచున్నాను అమృతైశ్వర్యములకు స్వామివియు, పదునాల్గులోకములయందలి భక్తుల హృత్కమలముల యందు వసించి వారికి మనోనిగ్రహము, తపస్సు మొదలైనవి యొసంగి, వారి మనోరథములను పూర్తిచేయువాడవు, భక్తులను కాపాడుటలో అమితోత్సాహము గలవాడవు, పూర్తిగా తెలియజాలని అనంత మహిమలు గలవాడవు, అత్యద్భుతమైన మాయాశక్తి కలవాడవు, ఎవరికైనను పూర్తిగా తెలిసికొన వీలుగాని చరిత్రలు కలవాడవు నగు నీకు అంజలి ఘటింతును. (ఈ రీతిని నేను నీ యనుగ్రహమునకు పాత్రుడనయ్యెదను.)

విశేషార్థము: —

1 1) వేంకటేశ శబ్దార్థము: -

శ్రీ విష్ణుశర్మ 'వేంకటేశ' నామ మంత్రమును ఎల్లప్పుడు జపించుటచే అతనికి పాపము లెట్లు కలుగును? "జపతో నాస్తి పాతకం" శ్రీహరి నామజపములచే పాపములు నశించి పోవునని స్మృతులు చెప్పుచున్నవి. అంతమాత్రమే గాక "వేంకటేశుడు" అనగా సమస్త పాపములను దహించువాడు అమృతత్వమును, మహైశ్వర్యములను

ఇచ్చువాడు. అందుచే అతని పాపములన్నియు దహింపబడినవి. మఱియు

2) 'వకారోఽమృతబీజం స్యాదైశ్వర్యం కటముచ్యతే ।
అమృతైశ్వర్య దేవత్వాత్ వేంకటేశం హరిం విదుః ।' అని స్మృతి

— అమృతైశ్వర్యములకు స్వామియగుటచే "వేంకటేశుడు" అనబడు చున్నాడు. అందుచే ఐశ్వర్యమోక్షాది సమస్త పురుషార్థములను కలిగించు శ్రీహరి పాదములను విడిచి ఎట్లుండగలడు?

2 1) పురుషశబ్దార్థము :-

'పౄ=పాలనపూరణయోః'-సమస్త జగత్పాలకుడు, సమస్త పురుషార్థములను ఇయ్యగలవాడు. అందుచే 'పుః' అనబడుచున్నాడు. 'ఋ=గతౌ' గత్యర్థకములకు జ్ఞానార్థకత్వముండుటచే జ్ఞానస్వరూపుడై 'రుః' అనబడుచున్నాడు. 'షకారో బలం ణకారః ప్రాణ ఆత్మా' అను శ్రుతిననుసరించి బలాత్మకుడైనందువలన అనగా భక్తులకు మనో విగ్రహాత్మకమైన తపస్సు మొదలగు సమస్త బలములను కలిగించుటచే 'షః' అనబడుచున్నాడు.

2) 'తథా చ పుశ్చాసౌ రుశ్చాసౌ షశ్చ పురుషః'

3) 'న కేవలం మే భవతశ్చ రాజన్ న వై బలం
బలినాం చాపరేషాం'-అని భాగవతము. లేక

పురి శేతే ఇతి పురుషః = సర్వుల హృదయములందు ప్రేరేపించి, శయనించి యుండువాడు.

4) పరషః షాః యస్య=పూర్ణములైన షడ్గుణములుగలవాడు.

5) పురాణి షట్ యస్య=అత్యుత్కృష్టములైన శ్వేతద్వీపము, అనంతాసనము. వైకుంఠము, అవ్యాకృతాకాశము, సత్యలోకము, సర్వప్రాణి హృత్కమలములు - ఈ యారు స్థానములయందు నివసించువాడు.

6) బ్రహ్మాండము లోపలను వెలుపలను సర్వత్రపూర్ణుడగుటచే పుః, ఋతంభరుని యవతారమగుటచే రుః, 'షం షడ్గుణాయనమః' అని షడ్గుణావతారుడగుటచే షః, – ఇత్యాదులచే 'పురుష' శబ్దవాచ్యుడు

3. మహాత్మా – "మహ ఉద్ధవ ఉత్సవః" అని అమరకోశము. భక్తులను చూచుటలో అమితోత్సాహము కలవాడు "భక్త దర్శన మాత్రేణ ప్రసాదాన్ మందహాసితం" అని స్మృతి. భక్తులను చూచిన వెంటనే వారిననుగ్రహించి మందహాసము చేయుచున్నాడు.

4. మహానుభావః – సంపూర్ణముగా తెలిసికొనుట కశక్యమైన స్వరూపము గలవాడు, మహత్తరమైన సంపూర్ణజ్ఞానముగలవాడు. (అనగా దయకు పాత్రుడో కాదో యని తెలియుట) గొప్ప ఇచ్ఛగలవాడు.

5. మహామాయీ – "మహామాయేత్యవిద్యేతి నియతిర్మోహినీతి చ" – అత్యద్భుతమైన మాయాశక్తి కలవాడు.

6. అమేయకర్మా – "ప్రకృతిర్వ్యాసవేత్యేవం తవేచ్ఛాఽనన్త కథ్యతే" – ఎవరివలనను తెలిసికొనని వీలులేని చరిత్రలుకలవాడు.

7. 1) వేతి ఉత్తమవాచీ స్యాత్ యేతి జ్ఞానముదీరితమ్।
కకారః సుఖవాచీ స్యాత్ టేతి చిత్త్వముదీరితమ్॥
ఈశత్వమాత్మవాచీ స్యాత్ ఏవేదం వంచ కన్యకే।
పూర్ణజ్ఞానం సుఖం చిత్త్వం ఆత్మత్వాద్వ్యంకటాభిధః॥

పూర్ణజ్ఞాన – ఆనంద – చిత్ – రూపుడై సర్వస్వామియగుటచే "వ్యంకటేశ" డనబడుచున్నాడు.

(గారుడపురా. అ. 26; శ్లో 36-37)

2) వ్యమింద్రియాదికం ప్రోక్తం వ్యంగభూతా హరౌ యతః।
కటమ్తు సముదాయోక్తః వ్యంకటశ్చేంద్రియాగణాః॥

3) వ్యష్టిన్ ప్రేరయతే యస్మాత్ తస్మాత్ వ్యంకటనాయకః ।
వ్య=ఇంద్రియాదులు, కట—సముదాయములు. ఇంద్రియసమూహ
ములకు ప్రేరకుడగుటచే "వ్యంకటేశ" డనబడుచున్నాడు

4) "విషయేష్వేవ వా నిత్యం వ్యంకటేతి ఉదాహృతః" సమస్తేంద్రియ
ములకు ప్రేరకుడగుటచే "వ్యంకటేశ" డనబడుచున్నాడు.

5) విశిష్టజ్ఞానరూపత్వాత్ వేతి ముక్తాః సదా స్మృతాః ।
ముక్తానాం చ సమూహస్తు వ్యంకటేతి ఉదాహృతః ।

6) "సదా ముక్తసమూహానాం ఈశత్వాత్ వ్యంకటాధిపః" - విశిష్టజ్ఞాన
రూపుడగుటచే వ=ముక్తులు. ముక్తుల సమూహము "వ్యంకట"
మనబడును. ముక్తుల సమూహమునకు నియామకుడగుటచే "వ్యంక
టేశ" డనబడుచున్నాడు.

7) 'లింగదేహయుతో జీవో వ్యంకటేతి ఉదాహృతః'
లింగినాం చైవ స్వామిత్వాత్ వ్యంకటేశేతి సంజ్ఞకః'
లింగదేహయుక్తులైన జీవులు "వ్యంకటు" లని పిలువబడు చున్నారు.
ఆ జీవులకు స్వామియగుటచే "వ్యంకటేశ" డనబడుచున్నాడు.

8) దైత్యానాం చ సమూహస్తు జ్ఞానాది విధురో యతః
అతో దైత్యసమూహస్తు వ్యంకటేతి ప్రకీర్తితః
తేషాం సంహరణేఽపీశః అతో వ్యంకటనాయకః

దైత్యుల సమూహములు జ్ఞానాదులు లేనందున "వ్యంకటము" లనబడు
చున్నవి. దైత్యుల సమూహములను సంహరించుటకు సమర్థుడైనందున
"వ్యంకటేశ" డనబడుచున్నాడు.

9) అనవద్యస్య విరుద్ధత్వాత్ కామ క్రోధాదయో గుణాః ।
వ్యంకటా ఇతి సంప్రోక్తాః తేషాం నాశయితుం ప్రభుః ।

(గా. పు. అ. 26, శ్లో. 44)

10) "అతస్త్వ వ్యంకటేశాఖ్యః" — ఆనందమునకు విరుద్ధములుగా నుండుటచే కామ క్రోధాది దుర్గుణములు "వ్యంకటము" లనబడుచున్నవి. వానిని నాశనమొనరించుట యందు సమర్థుడై నందున "వ్యంకటేశుడు" అనబడుచున్నాడు. ఈ మొదలగునవి 'వ్యంకటేశ' శబ్దార్థములు.

నామ్నైవ భావ్యం ఖలు సర్వరక్షణం
 మాయావినో విశ్వకుటుంబిన స్తే।
స్థలేషు దుర్గేషు జలేషు ఖేషు
 నర్వేష్వరణ్యేషు చ శైలవేషు॥ 49

అ:- సర్వప్రాణుల రక్షకుడవును, సమస్తమును రక్షించువాడవును, భక్తులు కాని వారికి మహామాయావియును, జగత్కుటుంబియు నగు ఓ వేంకటేశా! సర్వ స్థలములు, సమస్త దుర్గప్రదేశములు, నద్యాది జలములు ఆకాశము, గర్భములు, శృతిమాది విషయములు — ఇత్యాదులలో సంభవించు మహా విపత్తు లన్నిటి యందును నీ నామ స్మరణ మాత్రము చేతనే సర్వులు దుఃఖరహితులై నీచే సంరక్షింపబడుచున్నారు. (ప్రహ్లాదుడు, గజేంద్రుడు, ద్రౌపది మొదలైనవారు వేర్వేరు విధముల రక్షింపబడుటయే ఇచట ఉదాహరణముగా తెలుసుకొనవలెను).

విశేషార్థము:—

1. జలేషు మాం రక్షతు మత్స్యమూర్తిః
 స్థలే చ మాయావటు వామనోఽవ్యాత్।
 త్రివిక్రమః ఖేఽవతు విశ్వరూపః
 దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః॥
 పాయాన్నృసింహోఽసురయూథపారిః

జలములందు మత్స్యమూర్తియు, భూమియందు వామనరూపియు, ఆకాశమునందు త్రివిక్రముడు, అరణ్యదుర్గాదులందు నరసింహరూపియు అయిన శ్రీ పరమాత్మ రక్షించునని భాగవత వచనము.

2. యది యోన్యాః ప్రముచ్యేయం తత్ స్మరిష్యే పదం తవ।
తముపాయం కరిష్యామి యేన ముక్తిం వ్రజామ్యహమ్॥
విణ్మూత్రకూపే పతితః దగ్ధోఽహం జఠరాగ్నినా।
ఇచ్ఛన్ ఇతో వివసితుం కదా నిర్యాస్యతే బహిః॥
యేనేదృశం మే విజ్ఞానం దత్తం దీనదయాలునా।
తమేవ శరణం యామి పునర్మే మాస్తు సంసృతిః॥

(గారుడపురాణము)

మాతృగర్భమునందున్నప్పుడు జీవుడు ' ఈ యోనినుండి నాకు విముక్తి కలిగినయెడల నీచరణములను స్మరించెదను. ఓ శ్రీహరీ! దేనిద్వారా ముక్తిని పొందగలనో అందులకు వలసిన ఉపాయమును ఆచరించెదను. అమేధ్య మూత్రముల మధ్యనున్న నేను జఠరాగ్నిచే దగ్ధుడనై యున్నాను. ఎపుడు ఇచటి నుండి వెళ్ళగలను? ఎవడు ఇంతటి జ్ఞానమునిచ్చెనో ఆతనినే శరణువేడెదను. మఱల సంసారమువలదు ' అని భగవంతుని ప్రార్థించును.

3. గర్భే వ్యాధౌ శ్మశానే చ పురాణే యా మతిర్భవేత్।
సా యది స్థిరతాం యాతి కో న ముచ్యేత బన్ధనాత్॥

(గారుడపురాణము)

గర్భమునందుండునపుడు, రోగముచే పీడింపబడునపుడు, శ్మశానము నందును, పురాణాదులను వినునపుడును ఎట్టి బుద్ధికలుగునో అట్టి బుద్ధియే స్థిరముగా మన్నచో సంసారబంధమునుండి యెవడు విముక్తుడు కాడు? (తప్పక ప్రతివ్యక్తియును ముక్తుడగునని భావము.)

మహావిపత్సు త్వన్నామస్మరణే తద్వినాశనమ్।
బహుసంపత్సు తే నామవిస్మృతౌ తద్వినాశనమ్॥ 50

అ :- గొప్పగొప్ప ఆపదలు సంభవించినప్పుడు నీనామములను తలంపగనే అవి నశించును. అట్లే గొప్పగా సంపదలు వచ్చినప్పుడు నీ నామస్మరణమును మఱచినవాని సంపదలు నశించును.

విశేషార్థము :—

"యదనుగ్రహతస్సన్తి నసన్తి యదుపేక్షయా"— అన్నట్లు లోకములు, లోకాధిపత్యములు కూడ ఆయన యొక్క ఇచ్ఛామాత్రమున స్థిరముగా నిలిచి యున్నవి. ఆయన ఉపేక్షించెనేని ఏదియు నుండదు. మా వంటి సామాన్యులకు ఆపదలు పోవుట, సంపదలు వచ్చుట అనునవి వాని సంకల్పమున కెంత మాత్రములు.

**తస్మాత్త్వన్నామసక్తోఽహం సన్త్వదా త్వదనుగ్రహాత్ ।**
**త్వత్ప్రేరిత స్త్వదీయత్వాత్ మత్పుణ్యం త్వద్దయాబలాత్ ॥ 51**

అ:— ఆ కారణముచే నేను నీచే ప్రేరితుడనై నీ యనుగ్రహముచేతనే సదా నీ నామస్మరణము చేయుట యందాసక్తుడనై యున్నాను. నీ భక్త బృందములో చేరినవాడనగు నా పుణ్యము నీ కృపాబలముచే కలిగినది.

న కదాచిద్భయం మేఽస్తి దివ్యనామరతో యతః ।
తథాఽపి తే కృపాఽపాంగలేశలేశోఽస్తు మయ్యహో ॥ 52

అ:— నీ దివ్యనామ స్మరణ దీక్ష కలవాడనైనందున నా కెల్లప్పుడును ఎవ్వరి వలనను భయములేదు. అయినను నాపై నీ కృపాకటాక్షము లవలేశ మాత్రమైన ఉండనిమ్ము. అదియే నా భాగ్యము!

అవ :- భయములేనివాడు ప్రార్థించుటేల ? అనగా

**శ్రీశ! చిత్రం చరిత్రం తే న జానే బహుదుష్కృతిః ।**
**సర్వజ్ఞ మే కదా కిం వా వదే త్వాం కృపయాఽవ మామ్ ॥ 53**

అ:— శ్రియఃపతీ! పెక్కు దుష్కర్మలను చేసిన నేను చిత్ర విచిత్రములైన నీ చరిత్రల నెఱుంగ జాలకున్నాను. ఓ సర్వజ్ఞ శిఖామణీ! నీతో నా విషయమేమని చెప్పుకొనగలను? నన్ను కృపతోడ రక్షింపుము.

విశేషార్థము :—

1. శ్రియః = శం = సుఖము - యస్మాత్ = లక్ష్మీదేవికి సుఖమును కలిగించువాడు. లేక శ్రియః + ఈశః = లక్ష్మీదేవికి స్వామియు.

2. సర్వజ్ఞః = సమస్త వస్తు విషయక జ్ఞానము కలవాడు.

నామ్నా మహాఘౌఘహాని స్తేన దేహహృదోః శుచిః ।
తం దృష్ట్వా ప్రీయసే విష్ణో తకః సత్కర్మసంగ్రహః ॥ 54

అ: — శ్రీహరీ! నీ నామస్మరణము చేయుట వలన మహాపాపముల రాశి నశించుచున్నది. అందుచే దేహము, మనస్సు పరిశుద్ధము లగుచున్నవి. విశ్వవ్యాపకుడవగు దేవా! నీవు అట్టి శుద్ధుడైన వానిని గాంచి మిగుల ప్రీతి నొందుచున్నావు. అనుగ్రహించుచున్నావు. పిదప అతనిచే సత్కర్మలను అనుష్ఠింప జేసెదవు.

కర్మణా జ్ఞానసిద్ధిశ్చ తేవ ప్రీతిస్తవాద్భుతా ।
అపరోక్షమగర్భశ్చ ముక్తిరానన్ద వర్ధనమ్ ॥ 55

అ: — సత్కర్మానుష్ఠానము వలన యథార్థజ్ఞానము (హరిసర్వోత్తమత్వ జ్ఞానము) కలుగును. అట్టి యథార్థ జ్ఞానము వలన నీ యెడ నాకు అసదృశమైన ప్రీతి కలుగును. అటుపైన అపరోక్షానుభవము (భగవత్సాక్షాత్కారము) కలుగును. అందువలన గర్భవాసాది క్లేశము లుండవు. అనంతరము ముక్తి కలుగును. అటుపైన మోక్షము నందును దినదినమునకు ఆనందాభివృద్ధి యగుచుండును.

విశేషార్థము: —

మానవుడు ప్రథమమున నామస్మరణముతో భగవత్సేవ నారంభించి, అటుపై అనేక దశలు మారి, తుదకు సంసారమునుండి ముక్తుడై ఆనందానుభవమునకు చేరుకొనుచున్నాడు!!! ఈశ్వరుని అపారకరుణాకటాక్షమే భక్తుని మహాభాగ్యము! భక్తు డెంతటి భాగ్యశాలి!

అవ :— (మఱొక విధముగ) నామస్మరణవలన కలుగు ఇతర ఫలముల నిట్లు చెప్పుచున్నారు.

గోదాన కన్యాదానాది పృథివీరేణుసంఖ్యయా ।
దుర్భిక్షే జాహ్నవీతీరే ప్రత్యహం కోటిభోజనమ్ ॥ 56

త్వన్నామస్మరణే తుల్యం నామమాహాత్మ్యమీదృశమ్।
తస్మాన్నామస్మృతిః శుద్ధా సులభా పురుషార్థదా॥ 57

అ:- పృథివియందలి ధూళిరేణువుల యంతటి లెక్కింప వీలుకాని గోదాన కన్యాదానములను, సువర్ణదానాదులను, అశ్వమేధాది యజ్ఞములను చేయుట, దుర్భిక్ష కాలములో గంగాతీరమున ప్రతిదినము కోటి బ్రాహ్మణులకు భోజన మొసంగుట - ఇవి యన్నియు నీ నామస్మరణకు సాటిరావు. నీ నామ కీర్తన మహిమ అంత గొప్పది! కనుక నీ నామస్మరణ ద్రవ్యసాధ్యములైన యాగాదుల కంటె పరిశుద్ధమైనది సజ్జనులకు కడు సులభము. ఇదియే అన్ని పురుషార్థముల నిచ్చును

లోకోత్తరస్త్వయం మార్గః ప్రజానామకుతోభయః।
యత్ర భక్తివశాద్విష్ణోః నామస్మృతిపరాయణాః॥ 58

అ.- భక్తివశమున శ్రీహరినామస్మరణయందే నిమగ్నులైన జనులకు (సజ్జనులకు) నామస్మరణమను ఉత్తమమార్గమొక్కటే పాపహరము, పుణ్య వర్ధకము, లోకోత్తరము, శ్రేయస్కరము, నరకాదిభయరహితము. స్వర్గాది పుణ్యలోకములను వెనుకకునెట్టి పైనుండు వైకుంఠమును పొందునట్లుచేయును. అనగా వైకుంఠప్రాపకము.

యేవైకదా విష్ణుపదాబ్జయుగ్మే
సమర్పితం చిత్తమనన్యబుద్ధ్యా।
యమోఽపి తద్దూతగణాస్సపాశాః
పశ్యన్త్యహో ఘూత్రయమప్యహో న హి॥ 59

అ:- ఓ శ్రీనివాసా! ఎవడు భగవద్భక్తి సంసారతారకమను వివేకముతో ఒకేవిధముగ నీ పాదారవిందములపై చిత్తము, మనస్సు, బుద్ధులను సమర్పించునో, అట్టివాడెంతటి పాపియైనను వానిని యముడుగాని, పాశధారులైన యమభటులుగాని కంటితోనైనను చూడరు, చూడలేరు. ఆశ్చర్యము! అనగా నీ నామస్మరణచేయువారికి నరకభయము లేశమైనను కలుగదు. ఇది ప్రసిద్ధము.

విశేషార్థము :-

జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దమ్।
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాఽపి
తానానయధ్వమసతోఽకృత విష్ణుకృత్యాన్।

(భాగవతము)

'నాలుకతో నోరార హరినామముల కీర్తింపనివానిని, మనసార హరి పాదములను స్మరింపనివానిని, శిరస్సుతో హరిచరణములకు మ్రొక్కనివానిని మాత్రము నావద్దకు తీసికొనిరండు.' అని యముడు తన భటులకు చెప్పినట్లు భాగవతమున కలదు. కనుక భగవద్భక్తులకు ఎన్నడును యమభటుల దర్శనము కాని, నరకభీతికాని లేదు.

ఇతి శ్రీమదాదిత్యపురాణే శ్రీ వేంకటేశమాహాత్మ్యే

భగవద్గుణమహిమానువర్ణనం నామ చతుర్థాధ్యాయః

నాలుగవ అధ్యాయము ముగిసెను.

। శ్రీ కృష్ణార్పణమస్తు ।

# అథ పంచమాధ్యాయః

అథ దేవశర్మాణం ప్రతి స్తుతిప్రసన్న శ్రీనివాసకృత వరప్రసాదాది వర్ణనమ్.

అవ: – బ్రహ్మాది దేవతలను రక్షించుటలో కడు సమర్థురాలును, సర్వదోష శూన్యురాలును, సర్వ సద్గుణ పరిపూర్ణురాలును, సమస్త లోకములకు తల్లియును అయిన శ్రీ లక్ష్మీదేవియే సర్వదా నిన్ను ప్రార్థించుచుండగ నావంటి సామాన్యుడు ప్రార్థించుట నేమని చెప్పవలెనను భావముతో దేవశర్మ లక్ష్మీ మహిమ నిట్లు వర్ణించుచున్నాడు.

దేవశర్మోవాచ —

సర్వలోక జననీ కమలా యా
దేశకాలవితతా రమణీ తే।
సాతిమృద్వతసికాకుసుమాభో –
త్సంగగాఽపి తవ హృత్కమలస్థా ॥ 1

అ: – ఓ శ్రీనివాసా। సర్వలోక మాతయు, దేశకాలాదులలో నీతో సమానముగ వ్యాప్తురాలును, నీ భార్యయు నగు లక్ష్మీదేవి, నీ హృదయ కమలములో వసించునదయ్యు, అవిసె పూవులవలె మిక్కిలి ప్రకాశము గల, మృదువైన నీ యొడిలో కూర్చొని సదా నిన్ను ధ్యానించుచున్నది.

(అనగా నీ హృదయములో నున్న లక్ష్మియే నీ యొడిలో కూర్చొన్నది. ఒడిలో కూర్చొనియున్నను ఆమె నీ హృదయములో నున్నదియే. ఇట్లు రెండు విధములను లక్ష్మీదేవి నీతో అనన్య సంబంధము కలిగి యున్నదని భావము.)

బ్రహ్మ శంకర పదార్పణదక్షా సర్వలోకశుభదా ద్రవచిత్తా।
యత్కటాక్షలవమాత్ర పదస్థాః ప్రార్థయన్త్యజశివేన్ద్రముఖా హి ॥ 2

అ: – చతుర్ముఖుడు, శివుడు, ఇంద్రుడు మొదలుగాగల దేవతలకు సత్యలోకాధిపత్యాది పదవుల నిచ్చుటయందు సమర్థురాలును, సర్వలోకములకు

శుభమును ప్రసాదించు దయార్ద్రపూర్ణమైన మనస్సు గలదియు నగు శ్రీ లక్ష్మి దేవిని, ఆమె దయవలన తమ పదవులను పొందియున్నప్పటికిని, బ్రహ్మ రుద్రాదులు మరల మరల నామె కృపా కటాక్ష లేశ మాత్రమునకై ప్రార్థించుచున్నారు:—

విశేషార్థము: -

'హి' శబ్దముచే

యం కామయే తం తముగ్రం కృణోమి

తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్।

అహం రుద్రాయ ధనురాతనోమి

బ్రహ్మద్విషే శరవే హంత వా ఉ।

'నేను తలంచితినేని ఎవరినైనను బ్రహ్మగా, రుద్రునిగా, ఋషిగా, జ్ఞానిగా చేయగలను. నేను చతుర్ముఖ ఘాతకుడైన రుద్రుని సంహరించుటకు ధనుస్సు చేతబట్టి యున్నాను.' అని లక్ష్మిదేవి చెప్పినట్లు శ్రుతి కలదు. ఇందు లక్ష్మిదేవియొక్క శక్తి, మహిమ తెలియుచున్నవి

భారతీప్రముఖసుందరయోషిద్ -

గణమతీతబహుసుందరరూపామ్।

ఆలిలింగని చతుష్కరపద్మైః।

మందహాసవదనాం నరసార్థమ్॥ 3

అ:- శ్రీహరీ! పార్వతి, భారతి, సరస్వతి మొదలగు దివ్యసౌందర్యము గల వనితలకంటెను మిగుల సౌందర్యవతియు, మందహాసవదనారవిందయునగు శ్రీలక్ష్మిదేవిని, పూర్ణకాముడవైనప్పటికిని నీవు పద్మసదృశములైన నీ నాలుగు హస్తములతో సరసముకొరకును, ఆయమ్మకు ఆనందాభివృద్ధియగుటకును ఆలింగనము చేసికొనుచున్నావు.

నిత్యముక్తా దోషదూరా త్వదూనాధికసద్గుణా।
త్వత్పాదపూజనే నిత్యం బద్ధకంకణభూషితా॥ 4

అ :- శ్రీహరీ! నిత్యముక్తురాలును, దోషలేశము లేనిదియును, నీకంటె తక్కువ గుణములు కలదియును, బ్రహ్మాదులకంటె అత్యధికములైన సద్గుణములచే ఉత్తమురాలును అగు శ్రీలక్ష్మీదేవి నిత్యము నీపాదారవిందములను పూజించుటలో బద్ధకంకణురాలై శోభిల్లుచున్నది.

అభీష్టదానే భక్తానాం కల్పవృక్షాయితా రమా।
చిన్తామణికామధేనుకరుణాసాగరాయితా॥ 5

అ :- లక్ష్మీదేవి తనభక్తుల కభీష్టములనిచ్చుటలో కల్పవృక్షముగా, చింతామణిగా, గొప్పదయాసముద్రముగా నున్నది.

విశేషార్థము :-

'సహాఽఽయాతి పురో యాతి స్థిత్వా పూరయతే హరిః' -

'శ్రీహరి కరుణింపదలచినచో వెనువెంటవచ్చును. ముందర నడచును. ఆతనికి దగ్గరగ నుండి కోరికలను నెరవేర్చును' అను ఈవాక్యమునుబట్టి రమాదేవి వెంటనుండి కోరికలను నెరవేర్చునని తాత్పర్యము.

లక్ష్మీః పురస్తాత్పశ్చాచ్చ దక్షిణోత్తరతశ్చ యా।
ఊర్ధ్వాధరాదిభాగస్థా జగత్సృజతి పాతి హి॥ 6

అ :- శ్రుతి స్మృతి ప్రతిపాద్యురాలైన శ్రీలక్ష్మీదేవి నీ యనుగ్రహముచే నీముందు-వెనుక, నీకుడి-ఎడమలయందు, పైన-క్రింద, సర్వత్ర నీతో కూడి యుండి లోకములను సృష్టించును; మఱియు పాలించును.

విశేషార్థము :-

'హి' శబ్దముచే
'సవితా పశ్చాత్తాత్ సవితా పురస్తాత్ సవితోత్త
రాత్తాత్ సవితాఽధరాత్తాత్ సవితా న స్సువతు
సర్వతాతిం సవితా నో రాసతాం దీర్ఘమాయుః'

లక్ష్మీదేవి ముందు - వెనుక, కుడి - ఎడమలయందు, పైన - క్రింద, ఇట్లు అన్నిభాగములయందు నున్నదై సమస్త జగత్తును సృష్టించుచున్నది. ఆ లక్ష్మీదేవి మనందరకు దీర్ఘాయుష్యమును ప్రసాదించుగాక.

అవ :- రమాదేవి గాయత్రీమంత్ర ప్రతిపాద్యురాలని నిరూపించుచున్నారు. (ప్రథమముగా గాయత్రీమంత్ర ప్రతిపాద్యుడు శ్రీహరియే).

గుణైస్తతా ప్రసవిత్ర్యపి జీయగుణోర్జితా ।
ప్రకాశమతిమూర్తిశ్చ ధ్యేయా బుద్ధిప్రచోదికా ॥ 7

అ :- శ్రీలక్ష్మీదేవి గాయత్రీమంత్ర ప్రతిపాదితములైన జ్ఞానానందాది గుణములచే వ్యాపించియున్నది. సర్వజగత్తును సృష్టించుచున్నది. జ్ఞానులచే అపేక్షింపదగియున్నది. జగద్రక్షణాది గుణములచే నుత్తమురాలు. జ్ఞాన ప్రకాశమే శరీరముగా గలది. అందుచే సజ్జనుల ధ్యానమున కర్హురాలైనది. సమస్తజనుల బుద్ధికి ప్రేరకురాలు.

విశేషార్థము :—

'అందరి బుద్ధికి ప్రేరకురాలు. జగత్తును సృష్టించునది. క్రీడాదిగుణ సంపన్నురాలు. అట్టి రమాదేవియొక్క కాంతిజ్ఞానాత్మకమైన దివ్యస్వరూపమును ధ్యానింతుము' అని గాయత్రీమంత్రమున కర్థము చెప్పబడినది.

అవ :- ఆ తరువాత 'గాయత్రి' శబ్దమునకు అర్థము చెప్పుచున్నాడు.

దురన్నాద్ దుర్గ్రహత్వాచ్చ పాతకాదుపపాతకాత్ ।
స్వగాయకత్రాణదక్షా గాయత్రీత్యుదితా రమా ॥ 8

అ :- శ్రీహరియొక్క మహిమలను తన (శ్రీలక్ష్మీదేవియొక్క) మాహాత్మ్య జ్ఞానముచే స్తుతించు తన భక్తులను అపరిశుద్ధాన్నములను భుజించుటవలనను, దుర్దానములను స్వీకరించుటవలనను, పాతక - ఉపపాతకములవలనను కలిగెడి దోషములనుండి విడిపించి రక్షించును గనుక 'గాయత్రి' యనబడినది. గాయత్రీమంత్రముతో శ్రీలక్ష్మీనారాయణులను ధ్యానించువారికి సర్వదోషములు శమించునని భావము.

విశేషార్థము :-

1. శ్రీలక్ష్మీదేవి తనమహిమలను మఱియు 'స్వ' శబ్ద వాచ్యుడైన శ్రీవిష్ణువు యొక్క మహిమలను గానముచేయువారిని రక్షించుటలో సమర్థురాలైనందున 'గాయంతం త్రాతి' అను వ్యుత్పత్తిచే 'గాయత్రీ' యనబడుచున్నది. అనగా రమాదేవి తనను, తనపతియగు నారాయణుని ధ్యానించువారిని సర్వదోషములనుండి రక్షించునని భావము.

2. 1) మ్లేచ్ఛహూణాది నికృష్టుల యన్నము, 'అమంత్రమన్నం యత్కించిత్ హూయతే చ హుతాశనే' అను వాక్యానుసారము దేవునికి నివేదింపబడనియన్నము, మఱియు 'అహుత మవైశ్వదేవ మవిధినా కృతం అసత్తమాన్ తస్య లోకాన్ హినస్తి' అను ప్రమాణానుసారముగ వైశ్వదేవాది క్రియలచే సంస్కరింపబడని యన్నము - ఇట్టివి అపరిశుద్ధాన్నములు.

2) "పాపేభ్యశ్చ ప్రతిగ్రహాత్" - అనురీతిని పాపిష్ఠులనుండి దానము తీసికొనుట, తిలదానాదుల తీసికొనుట మున్నగునవి దుర్దానము లనబడును.

3) బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుదారాగమనము, ఈ పాపములు చేసినవారితో స్నేహ మొనరించుట - యనునవి పంచ మహాపాతకములు.

4) స్త్రీవధ, గోవధ, బాలవధ, భ్రూణహత్యాదులు – ఉపపాతకములు.

5) మాతృ, పితృ, భర్తృ, మాతుల, ఆచార్యాదుల నిందాదులు - అతిపాతకములు.

అవ :- 'సావిత్రీ' శబ్దమునకు అర్థము చెప్పుచున్నాడు.

సవితు ర్ద్యోతకత్వాచ్చ భక్తేష్టప్రసవే రతా।
చరాచరప్రసవితా సావిత్రీ కమలా స్మృతా॥ 9

అ:— సూర్యుని ప్రకాశింప జేయుటవలనను, భక్తులకు సర్వాభీష్టములను అనుగ్రహించుటవలనను, ఈ చరాచర జగత్తును సృష్టించుటవలనను, లక్ష్మీదేవి 'సావిత్రీ' అని పిలువబడుచున్నది.

అవ: 'సరస్వతీ' శబ్దమున కర్థము చెప్పుచున్నారు.

వాగీశత్వాత్ వచోదానాత్ కీర్తితా చ సరస్వతీ।
కాన్తిరత్యాది దానాత్ సా భారతీత్యాదినామికా॥ 10

అ:— శ్రీ లక్ష్మీదేవి వాగభిమాని యగుట వలనను, భారతీదేవి మొదలగు వారికంటె నుత్తమురాలగుటవలనను, తన భక్తులకు వేదార్థముల నుపదేశించుట వలనను 'సరస్వతీ' నామధేయురాలై కీర్తింపబడుచున్నది. భక్తులకు ప్రకాశమును, విశేష సుఖములను, వేదోక్త కర్మలయందు శ్రద్ధను సకల పురుషార్థములను ప్రసాదించుట వలన 'భారతీ' మొదలగు నామములతో పిలువబడు చున్నది.

విశేషార్థము :—

'భా = దీప్తౌ' అనగా భా=కాంతి, రతి=రమించుట (సుఖవిశేషము) లేదా వైదిక కర్మలయందు అత్యాసక్తి అని యర్థము. జ్ఞానమును, సుఖమును, ప్రకాశమును, పురుషార్థములను ఒసంగుటచే లక్ష్మీదేవి 'భారతీ' మొదలగు శబ్దములచే సార్థక నామధేయురాలగుచున్నది.

అవ:— లక్ష్మీదేవి 'బ్రహ్మా' యనబడుచున్నదని చెప్పుచున్నారు.

గుణ పూర్ణత్వ యోగేన బ్రహ్మా బ్రహ్మవశే స్థితా।
బ్రహ్మాణ్డావర్ణబహిర్వ్యాప్తా స్థూలా సూక్ష్మా చ మధ్యమా॥ 11

అ:— శ్రీపతీ! నీ సంబంధముతో గుణపరిపూర్ణురాలైనందువలనను, పరబ్రహ్మయగు నీ యధీనమున నుండుట వలనను, లేక చతుర్ముఖ బ్రహ్మను

వశము నందుంచుకొని యుండుటచేతను శ్రీ లక్ష్మీదేవి 'బ్రహ్మ' శబ్ద
ష్యరాలైయున్నది తన విశ్వరూపముచే బ్రహ్మాండమునకు లోపల వెలుపల
పించియుండుట వలన 'స్థూలా' యనియు, సర్వుల యందంతర్యామి
టుట వలన 'సూక్ష్మా' యనియు, సీతా రుక్మిణీ సత్యభామాది రూపములతో
వుల దృష్టికి గోచరించుట వలన 'మధ్యమా' యనియు ఆ మంగళదేవత
ప్రబడుచున్నది.

షార్థము :—

'యదధీనా యస్య సత్తా తత్తదిత్యేవ భణ్యతే — అను ప్రమాణము
'బ్రహ్మ' యనబడుచున్నది.

కర్మణాం గుణరూపాణాం సర్వేషాం చ నియామికా।
యద్దయాపాంగలేశేన త్వైహికీః సర్వసంపదః॥ ।2

అ:— బ్రహ్మాదులు మొదలుగాగల సర్వజీవులు చేయు కర్మలకు, గుణము
, రూపములకు నియామకురాలగు శ్రీ లక్ష్మీదేవియొక్క కృపా కటాక్ష లేశ
త్రమునవే ఐహికములైన సర్వసంపదలు కలుగుచున్నవి.

స్వర్విరక్తిశ సద్భక్తి జ్ఞప్తి ముక్తిర్వ్రజన్తి హి।
లోకాతీతా లోకపూజ్యా తవాత్యన్తప్రియా మతా॥ ।3

అ:- శ్రీహరీ! ఆ బ్రహ్మాదులు స్వర్గాది భోగములయందు వైరాగ్యమును,
యందు పరమ భక్తిని, తత్త్వజ్ఞాన జన్యమైన అపరోక్ష జ్ఞానమును, తద
తరము ముక్తిని శ్రీదేవి దయవలన పొందుచున్నారు. ఇది శ్రుతి స్మృత్యా
చే ప్రసిద్ధమైన విషయము. చరాచరాత్మకమైన ప్రపంచమునకు అతిరిక్త
ను, సమస్త జ్ఞానులకు (సమస్త లోకములందలి జనులందఱకు)
జ్యరాలును అగు శ్రీ లక్ష్మీదేవి నీకత్యంత ప్రియతమయై యలరారుచున్నది.

సర్వశక్తా సర్వసుఖా సర్వలక్షణ సంయుతా।
అనేక గుణ సంపూర్ణా పూర్ణకామా చ సర్వదా॥ ।4

అ:- లక్ష్మీదేవి సృష్ట్యాది సర్వకార్యములయందు పూర్ణశక్తి కలదియును, సర్వసుఖములు గలదియును, సర్వ శుభలక్షణములతో (ద్వాత్రింశల్లక్షణోపేతా) గూడినదియును, అపార సద్గుణములతో గూడినదియును, పూర్ణకామురాలును, సర్వాభీష్టముల నొసంగునదియునై యున్నది.

అవ:- శ్రీనివాసుని యద్భుత మహిమను ఎంతని వర్ణింపగలవని పలుకుచున్నారు.

> అప్రమేయ ప్రమేయాపి సమస్త పురుషార్థదా।
> మహదైశ్వర్య సౌభాగ్యా తథాఽపి త్వాఽనువర్తినీ॥ 15

అ:- ఈమెకు గల జ్ఞానము, శక్తి, మహిమ ఇంతయని తెలియ వలవి కానట్టివి. అనగా నీమె భక్తులు కాని వారిచే తెలిసికొన వీలులేని మహిమలు గలది. భక్తుల యోగ్యత ననుసరించి తెలిసికొన వీలుగల మహిమలు గలదని భావము. భక్తులకు సర్వ పురుషార్థముల నిచ్చునది. బ్రహ్మాదులకు అర్హము లగు అత్యుత్తమ ఐశ్వర్య సౌభాగ్యముల నిచ్చునది. అట్లయ్యును ఈమె నిన్ను సదా అనుసరించుచుండును. అనగా నీ వశములోనే యుండునదని తాత్పర్యము.

అవ:- ఆ యనుసరణ ప్రకార మెట్టిదన —

> స్మరతి ధ్యాయతి స్తౌతి నమత్యర్చతి పశ్యతి।
> తపతి త్వాం జపతి చ సేవతే త్వాం ప్రతీక్షతే॥ 16

అ:- ఈమె సదా నిన్ను స్మరించును. ధ్యానించును (పొగడును). స్తోత్రము చేయును (కొనియాడును). నమస్కరించును. అర్చించును. ప్రత్యక్షముగా చూచుచుండును. నిన్ను ఉద్దేశించి తపమాచరించును. నీ నామమునే జపించును. సేవించును. నీ కొఱకే నిరీక్షించును. (నీ దయకై ప్రతీక్షించును. అనగా పరోక్షాపరోక్షములందు నిన్ను జూచి ఆనందించును).

విశేషార్థము:-

1. శ్రోత్రాదుల అనుభవముచే కలిగిన అర్థసన్నికర్షరూపమైన, సంస్కారముతో సహాకృతమైన మనస్సనెడి ఇంద్రియముచే పుట్టినది "స్మరణము"

సచ్ఛాస్త్ర - శ్రవణ - మనన - దర్శనాదులచే కలిగిన మానస వాసనామయ వస్తువును మనస్సుచే తెలియుట "ధ్యానము".

శాస్త్రాదులందు ప్రతిపాదితములైన హరిసర్వోత్తమత్వాది గుణములను కీర్తించుట "స్తుతి".

'మత్తస్త్వముత్కృష్టః' 'త్వత్తోఽహమపకృష్టః' అని జ్ఞాన పూర్వకముగా చేసిన నమస్కారము కాయికము వాచికము, మానసికము అని మూడు విధములు.

1) 'ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా ।
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోఽష్టాంగ ఈరితః' ॥
— అని చెప్పిన విధమున సాష్టాంగముగా నమస్కారము చేయుట 'కాయికము'.

2) 'హరయేనమః'— అని భగవన్నామమును ఉచ్చరించుట 'వాచికము'.

3) మనస్సుచేతనే నమస్కరించుట 'మానసికము'

సదాప్రసన్నుడగు శ్రీహరికి దేనియందును అపేక్షలేకుండుటచే అనావశ్యకమైనను మనకు భగవదనుగ్రహము కలుగుటకై భక్త్యతిశయముతో భోజ్యవస్తువులను ప్రతిదినము సమర్పించి పూజించుట 'అర్చనము'.

'ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ' ఈ విధముగ భగవంతుని పరోక్షముగా చూచిన తరువాత లభించునది 'అపరోక్ష దర్శనము'

'సదా అఖండితం ధ్యానం తప ఇత్యుచ్యతే' - సర్వదా ఎడతెగక భగవంతుని ధ్యానించుట "తపస్సు". మఱియు భగవత్ప్రీతికొఱకై కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములనాచరించుట, లేక భగవన్మాహాత్మ్యవిషయక వేదశాస్త్రాదులను మననము చేయుట, లేక స్వాధ్యాయప్రవచనాదులు చేయుట "తపస్సు".

8. ఇతరులకు తెలియనీయక (వినబడనీయక) నిదానముగా మంత్రములను మనస్సులోనే ఆవృత్తిచేయుట, లేక మంత్రములతో భగవంతుని మనస్సులోనే మరల మరల ధ్యానించుట "జపము".

9. 1) శ్రవణం మననం చైవ నిదిధ్యాసనమేవ చ ।
పరే గురౌ చ యా భక్తిః పరిచర్యాదికం హరేః ॥
ఏషా సేవేతి సంప్రోక్తా యయా తద్దర్శనం భవేత్ -

అనగా భగవన్మహిమలను వినుట, మనస్సులో అనేక పర్యాయములు చింతించుట, మనస్సులోనే ధారణచేయుట, పరమాత్మకును గురువునకును భక్తితో పరిచర్యచేయుట-మొదలగు పనులు "సేవ" యనబడును. దీనిచేతనే ఆయనయొక్క సాక్షాత్కారము కలుగును.

2. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥
అను ప్రమాణానుసారము భక్తిసేవలు నవవిధములు.

3. 'యావత్సేవా పరే తత్త్వే తావత్సుఖవిశేషతా'-
పరమాత్మని సేవ ఎంత అధికముగా చేసినయెడల మోక్షసుఖము అంత అధికముగా కలుగును.

10. సదా భగవంతుని ప్రత్యక్షముగా చూచుటకై నిరీక్షించుట 'ప్రతీక్ష' యనబడును.

నిత్యాఽవియోగినీ నమ్రా సంప్రార్థయతి సర్వదా ।
కిముతాఽన్యేఽల్పజీవాశ్చ మాదృశా వృత్తివర్జితాః ॥ 17

అ:- ఎప్పుడును వియోగములేని రమాదేవి మిక్కిలి నమ్రతతో సదా నిన్నే ప్రార్థించుచున్నది. ఇట్లుండగా ఇతరులు, అత్యల్పులు, వృత్తిలేని నావంటి జీవులు నిన్ను ప్రార్థించుటను గురించి ఏమని చెప్పవలెను!

దరిద్రా బంధురహితా అనాథా జీవనార్థినః।
తేషాం త్వత్ప్రార్థనాకాంక్షా నాశ్చర్యం భువనత్రయే॥ 18

అ:- అత్యంత దరిద్రులు, బంధువులులేనివారు, అనాథలు, జీవనాపేక్ష కలవారు నిన్ను ప్రార్థింపవలెనని అపేక్షించుట మూడులోకములయందును ఆశ్చర్యకరమైన విషయము కానేరదు.

శ్రీ వేంకటేశ! మత్స్వామిన్! జ్ఞానానన్ద దయానిధే।
శరణాగతసత్త్రాణ వరణాభీష్టవర్షణ॥ 19

అ:- నాకు ప్రభుడవును, జ్ఞానానంద దయాపరిపూర్ణుడవును, శరణాగతులను రక్షించువాడవును, కోరినవారికి మిగుల దయతో అభీష్టములనిచ్చువాడవును - ఐన శ్రీవేంకటాచలపతీ! నన్ను అనుగ్రహింపుమా!

శ్రీశ తే రూపకర్మాణి బ్రహ్మరుద్రాదిపాదిభిః।
అగణ్యాని హ్యవేద్యాని హ్యచిన్త్యాన్యత్యద్భుతాని చ॥ 20

అ:- శ్రీపతియగు ఓ శ్రీనివాసా! నీయవతారములు, చరిత్రలు, బ్రహ్మరుద్రాది దేవతలకైనను గణింపరానివి, తెలియరానివి, చింతించుటకైనను అందనివి, అత్యద్భుతములైనవి.

విశేషార్థము:—

భగవద్రూపమును కొందరు 'శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్' అనియు మఱికొందరు 'పీతాంబరం నీలవర్ణం' అనియు ఇంకను కొందరు "స్వర్ణాంబరం స్వర్ణవర్ణం" అనియు వేఱుగా కొందరు "మేఘశ్యామం పీతకౌశేయవాసం" అనియు నానావిధముల వర్ణించుట వలన అత్యద్భుతమని కీర్తించియున్నారు.

ఏవం పూర్ణే త్వన్మహిమ్ని నాఽహం శక్తోఽస్మి వర్ణనే।
కశ్చాహం కా చ మే శక్తిః కిమితి స్తౌమి మద్ధీః॥ 21

అ :- ఇట్లు నీమహిమలు సంపూర్ణములు, అగాధములు, అత్యద్భుతములువై యుండగా వానిని వర్ణింప నెవరితరము? నేనెవరు? నాకెంతమాత్రము శక్తి కలదు? మందమతి గల నేను నిన్నేమని స్తుతించగలను?

అలసోఽహమహంకారీ చాజ్ఞో మూర్ఖః శఠః ఖలః।
జ్ఞానభక్త్యాదిహీనశ్చ కామక్రోధాదిపూరితః॥ 22

అ :- నేను సోమరిని, అహంకారిని అజ్ఞానిని, మూర్ఖుడను, విధినిషేధములు (యుక్తాయుక్తములు) తెలియని దుష్టుడను, వంచకుడను, నీవిషయమైన జ్ఞానము, నీయందు భక్తియు లేనివాడను, కామక్రోధాదులతో నిండినవాడను.

మనోజయాదిహీనశ్చ సదా విషయలమ్పటః।
పాంసూనాం వృష్టిబిన్దూనాం మద్దోషాణాం మితిర్న హి॥ 23

అ :- నేను మనోనిగ్రహము లేనివాడను, ఎల్లప్పుడు సుగంధతాంబూలవనితాది సుఖభోగములయందే ఆశగలవాడను, నాదోషములన్నియో ధూళిరేణువులవలె, వానచినుకులవలె అసంఖ్యాకములు అపరిమితములువై యున్నవి.

విశేషార్థము :—

కృశం కృతఘ్నం దుష్కర్మకారిణం పాపభాజనమ్।
అపరాధసహస్రాణామాకరం కరుణాకర॥
నృశంసః పాపకృత్ క్రూరః వంచకో నిష్ఠురః శఠః॥

(జితంతేస్తోత్రము)

— ఇన్ని దోషములతో గూడియున్నవాడనని చతుర్ముఖుడు చెప్పుకొనిన మాటలు మనకు సరిపడుచున్నవి.

గుణాస్త్వయి యథా పూర్ణాః దోషాః పూర్ణాస్తథా మయి।
అలసత్వాదహంకారాత్ అజ్ఞానాల్లోభతో మయా। 24

ఒమ్భ్యాద్ప్రమాదాద్ దాక్షిణ్యాత్ స్వభావాత్ సంగతః కృతాన్ ।
అపారానపరాధాన్ మే హ్యగణేయాన్ క్షమస్వ మామ్ ॥ 25

అ :– ఓ శేషగిరివాసా! ఎట్లు నీలో అనంతకల్యాణగుణములు సంపూర్ణములై
న్నవో, అట్లే నాలో అనంతదోషములు పూర్ణముగా యున్నవి. సోమరితనము
నగాని, నేనే కర్తనను దురహంకారమువలనగాని, అజ్ఞానమువలనగాని,
ర్యాశ(వలయునంత ధనమున్నను త్యాగబుద్ధిలేకపోవుట)వలనగాని, దంభము
ను అల్పుడైనను గొప్పవాడనని తెలియవలచుట) చేగాని, ప్రమాదము
జాగ్రత్త) వలనగాని, ఇతరుల బలవంతము (దాక్షిణ్యము) చేగాని, జన్మ
యూప స్వభావములవలనగాని, దుర్జన సాంగత్యము వలనగాని చేసిన యప
రములు లెక్కకు రానన్ని యున్నవి. వానిని లెక్కింపక నన్ను క్షమింపుము.
రాధ సహస్రములకు నిలయమైన నన్ను కేవలము నీ కృపచే మన్నించి
యనుగ్రహ పాత్రునిగా స్వీకరించుము.

పితా మాతా గురుర్భ్రాతా సఖా బన్ధుస్త్వమేవ మే ।
విద్యా సత్కర్మ విత్తం చ పురః పృష్ఠే చ పార్శ్వయోః ॥ 26

మూర్ధ్ని హృత్కమలే మేఽన్తర్బహిర్జన్మని జన్మని ।
కులస్వామీష్టదేవో నో వృతః పితృపితామహైః ॥ 27

అ :– ఓ స్వామీ! శ్రీహరీ! నీవే నాకు తత్త్వశిక్షకుడవైన తండ్రివియును,
షకురాలవైన తల్లివియును, హితోపదేశకుడవైన గురుడవును, ప్రేమగల
దరుడవును, అనిమిత్తోపకారివైన మిత్రుడవును, ఆపదలయందాదుకొను
ధుడవును, సద్విద్యోపదేశకుడవును, సత్కర్మకారకుడవును, ఐశ్వర్య
కుడవును, ముందు, వెనుక ఇరువైపులను రక్షకుడవును అయియున్నావు.

శిరమున, హృదయమున, లోపల, వెలుపలను యుండి నన్ను
ంచుచున్నావు. ప్రతి జన్మమునందును నా పితృపితామహ ప్రపితామహు
కులదేవతగను, ఇష్టదేవతగను నీవే అంగీకృతుడవైయున్నావు

విశేషార్థము :–

పితా మాతా సుహృత్ బంధుః భ్రాతా పుత్రస్త్వమేవ హి ।
విద్యా ధనం చ కామశ్చ నాన్యత్ కించిత్ త్వయా వినా ॥

(జితంతే స్తోత్రము)

సర్వం త్వమేవ లక్ష్మీశ న జానే త్వాం వినా పరమ్ ।
దుస్స్మృతిం హర దూరాన్మే విస్మృతిం తే విలోపయ ॥ 28

అ:– ఓ లక్ష్మీపతీ! సర్వము నీవే. నిన్నుగాక మఱియొకనిని 'సర్వోత్తము' నిగ నెఱుగను. నాకుగల దుష్టచింతనలను (దుష్టుల స్మరణము, దుష్ట వస్తువుల స్మరణము, లౌకిక వ్యవహార స్మరణము – మొదలగునవి) పరిహరింపుము. నీ విస్మృతిని (మఱపును) పోగొట్టుము. నీ స్మరణయందు నావలన లోపము కలుగకుండునట్లు చేయుము. (సదా నిన్ను ధ్యానించునట్లు చేయుము).

త్వత్స్మృతిం సంప్రదేహ్యద్య త్వత్సమో నాస్తి మే ప్రియః ।
త్వన్మనా స్త్వద్గత ప్రాణః త్వత్పాదాంబుజ సంశ్రితః ॥ 29

అ: – ఓ స్వామీ! సదా నీస్మృతిని కలిగించుము. నీవంటి ప్రియుడు నాకు వేఱొకడు లేడు. నీయందే నా మనః ప్రాణముల నుంచితిని. నీ పాదములనే ఆశ్రయించియున్నాడను.

తవ భక్తోఽస్మి దాసోఽస్మి శిష్యః పుత్రోఽస్మి కేవలమ్ ।
భర్తా త్వమేవ విశ్వస్య స్మరామి త్వామహర్నిశమ్ ॥ 30

అ :– నేను నీ భక్తుడను, సేవకుడను, శిష్యుడను, పుత్రుడను. ఈ ప్రపంచమునకే నీవు పోషకుడవు. రేయింబవళ్ళు నిన్నే తలంచుచున్నాడను

అవ :– బింబమూర్తియైన హరిని స్మరించు విధము ఎట్టిదనగా : —

శ్రీహరి ర్మమ హృత్పద్మ కర్ణికాస్థోఽతి సున్దరః।
పద్మాసన సమాసీన ఇన్ద్రనీల సమద్యుతిః॥ 31

అ :— నన్నుద్ధరించునట్టి ఓ శ్రీహరీ! నాహృదయకమల పీఠముననుండు నీవు అత్యంత సుందరుడవై, పద్మాసనాసీనుడవై, ఇంద్రనీలమణివంటి కాంతి గలవాడవై యున్నావు.

కంజకోమల పాదాబ్జః కుంకుమాధిక వర్ణవాన్।
వజ్రాంకుశధ్వజాబ్జాంక పాదాబ్జనఖరక్తవాన్॥ 32

అ :— పద్మదళములవంటి కోమలములైన నీ పాదములు కుంకుమ వర్ణమును మించిన యెఱుపురంగు గలవైయున్నవి. వజ్ర. అంకుశ, ధ్వజ, కమలముల చిహ్నములతో గూడిన నీ పాదకమలములయొక్క నఖములు మిక్కిలి యెఱ్ఱనివై యొప్పుచున్నవి

క్వణన్నూపురసన్నాద వలయాఢ్య పదాంబుజః।
అతసీపుష్పసంకాశ తేజఃపుంజోరురంజితః॥ 33

అ :— గజ్జెలతో ధ్వనించు అందెలుగల నీ పాదకమలములు అవిసె పూవులతో సమానమైన తేజోరాశిచే ప్రకాశించుచున్నవి

నితంబే పీతవసన స్వర్ణకాంచ్యంచితోఽచ్యుతః।
విరించాధారసౌవర్ణ గంభీరాబ్జాభనాభికః॥ 34

అ :— నాశరహితుడవగునో స్వామీ! భవ్యమైన నీ నడుము పీతాంబరముచేతను, బంగారు (కటిసూత్రము) ఒడ్యాణముచేతను, మఱియు నీ నాభిప్రదేశము చతుర్ముఖున కాధారమైన సువర్ణ కమలమువలె గంభీరమైనదై శోభించుచున్నది.

బ్రహ్మాండగూహకమృదు శ్లక్ష్ణరేఖాత్రయోదరః।
ధర్మస్తనోఽధర్మపృష్ఠః శ్లక్ష్ణసూక్ష్మతనూరుహః॥ 35

అ:- ఓ వేంకటేశా! బ్రహ్మాండమును కల్పించుకొనిన మృదువైన నీ యుదరము సూక్ష్మమైన మూడురేఖలతో కూడియున్నది. నీవు ధర్మోత్పాదకమైన స్తనప్రదేశమును, అధర్మోత్పాదకమైన పృష్ఠప్రదేశమును కలిగియున్నావు. మెత్తని సన్నటి అందమైన రోమములను కలిగియున్నావు.

శ్రీవత్సాంకః కౌస్తుభాది వైజయన్తీహృదంబుజః ।
ఉన్నతాంసో జానులంబి బాహ్వభీతివరప్రదః ॥ 36

అ:- నీవు శ్రీవత్సచిహ్నము, కౌస్తుభాదులచే రచితమైన వైజయంతీ మాలాదులచే నలంకృతమై శోభాయమానమైన హృత్ప్రదేశము కలవాడవును, ఉన్నతములైన భుజములు, శిరస్సుగలవాడవును, ఆజానుబాహువులు కలవాడవును, అభయవరప్రదుడవును అయిఉన్నావు.

కుంకుమాంకే కరతలే శంఖ చక్ర సులక్షణః ।
కింకిణీకంకణలసద్వలయాంగద భూషితః ॥ 37

అ:- ఓ స్వామీ! నీవు కుంకుమవలె కాంతిగల హస్తములయందు శుభలక్షణములతో కూడిన శంఖ చక్రములు, శబ్దించుచున్న కంకణములు, చేతి కడియములు మొదలగు నాభరణములచే భూషితములైన కరకమలములు కలవాడవు.

కంబుగ్రీవః సుబింబోష్ఠః కుందకుడ్మలదన్తవాన్ ।
ఆదర్శవద్ దృశ్యసూక్ష్మ గణ్డయుగ్మసుమండితః ॥ 38

అ:- ఓ వేంకటేశా! నీవు శంఖమువంటి కంఠప్రదేశమును, సుందరమైన పెదవులును, మల్లెమొగ్గలవంటి దంతములును, అద్దమువలె నగపడు సున్నితమైన చెక్కిళ్ళను గలిగి ప్రకాశించుచున్నావు.

సునాసోఽనిమిషః సుభ్రూః కరుణాపూర్ణలోచనః ।
శరత్పూర్ణేన్దువదనో నతనీలసుకున్తలః ॥ 39

అ:— ఓ శ్రీనివాసా! నీవు సుందరమైన నాసిక కలవాడవును, మూత పడని కనురెప్పలు గలవాడవును, ఇంద్ర ధనుస్సువంటి చక్కని కనుబొమ్మలు గలవాడవును, అత్యంత కరుణాపూర్ణమైన నేత్రములు గలవాడవును, శరత్కాల పూర్ణిమ చంద్రుని బోలిన ఆహ్లాదకరమైన ముఖము గలవాడవును, అనంతము లైన వంపులు తిరిగిన నీలిముంగురులు గలవాడవును అయియున్నావు.

అతుల్యతిలకోపేతో రత్నకుండలమణ్డితః।
స్ఫురద్రత్నకిరీటీ చ సర్వలక్షణ సంయుతః॥ 40

అ:— ఓ స్వామీ! నీవు అసదృశమైన తిలకముచే శోభితుడవును. రత్న ఖచిత కుండలాలంకృతుడవును, ప్రకాశించు రత్నకిరీటము కలవాడవును, సర్వ శుభలక్షణములు గలవాడవును అయియున్నావు.

జగద్విలక్షణః శ్రీమాన్ మద్బింబో నిత్యచిత్సుఖః।
సూర్యకోటిప్రతీకాశః చంద్రకోటిసుశీతలః॥ 41

అ:— నా బింబరూపియగు నో శ్రీహరీ! నీవు చరాచర జగత్తుచే విలక్షణు డవు, శ్రీమంతుడవు, నిత్య చిదానంద స్వరూపుడవు, కోటిసూర్య ప్రకాశము గలవాడవు, కోటిచంద్రులంతటి చల్లనివాడవును అయియున్నావు.

అనన్తవేదైర్బ్రహ్మాద్యైః అవేద్యోఽప్రాకృతో హరిః।
శ్రీధరాభ్యాం సమాశ్లిష్టో బ్రహ్మరుద్రేన్ద్ర సేవితః॥ 42

అ:— ఓ శ్రీపతీ! నీవు అనంతవేదములచే బ్రహ్మాదులకైనను గోచరింపని వాడవు, ప్రాకృతగుణరహితుడవు, శ్రీ భూదేవులచే నాలింగితుడవు, బ్రహ్మ రుద్రేంద్రాదులచే సేవితుడవు.

పూర్ణానన్దజ్ఞానదయామూర్తిః పరమమంగలః।
మంగలాంగో మంగలాంకో భక్తమంగలదాయకః॥ 43

అ:— ఓ శ్రీనివాసా! పరిపూర్ణమైన ఆనందము, జ్ఞానము, దయ అను గుణములే స్వరూపముగా గలవాడవు, పరమ మంగళ స్వరూపుడవు, మంగళ

పదములైన చిహ్నములతో గూడిన అవయవములు కలవాడవు, భక్తులకు
ంగళముల నిచ్చువాడవు.

కరుణామృతపూర్ణాభ్యాం లోచనాభ్యాం నమీక్షతే।
కా చిన్తా మ ఇహాముత్ర సర్వారిష్టం హరత్యహో॥ 44

అ:— శ్రీ రమాపతీ! కరుణామృత పూర్ణములైన నేత్రములతో నీవు నదా
న్ను చూచుచున్నావు. అందుచే ఇహపరముల చింత నాకెందులకు? నీవు
ర్వారిష్టములను పరిహరించుచున్నావు కదా!

త్వత్పాదాంబుజవిశ్వాసం సర్వాభీష్టం దదాతి హి।
ఇతి స్మరన్నహోరాత్రం త్వామహం శరణం గతః॥ 45

అ:— శ్రీహరీ! నీ పదపద్మములయందే అత్యంత విశ్వాసముగల వారికు
కలాభీష్టముల నిచ్చుచున్నావు. అట్టి మహిమోపేతుడవైన నిన్ను రేయింబవళ్లు
లంచుచు, శరణుపొందియున్నాడను.

భో స్వామిన్ పూర్ణకామస్త్వం సంపూర్ణైశ్వర్యవానపి।
స్వప్రయోజనహీనోఽపి మాయయా బహురూపవాన్॥ 46

అ:— ఓ స్వామీ! నీవు పరిపూర్ణకాముడవు, సంపూర్ణైశ్వర్యములు కల
డవు, స్వప్రయోజనరహితుడవువైయున్నను, ఇచ్ఛామాత్రముచే భక్తుల
నుగ్రహించుటకై బహురూపములు కలిగియున్నావు.

అవ:— ఇతరులు చేయలేని పనులను జెప్పుచున్నాడు.

లోకోపకరణాయైవ త్వితరాఽసాధ్యకృత్యవాన్।
బహ్వాద్రిధారణం సేతో రనాయాసేన కల్పనమ్॥ 47

అ:— సజ్జనుల నుద్ధరించుటకే ఇతరులు చేయవీలుగాని గోవర్ధన మంద
ది పర్వతోద్ధరణము, అనాయాసముగ సేతువును నిర్మించుట మొదలైన
ర్యములను చేసియున్నావు.

బ్రహ్మాండమద్భుతం స్థూలం క్షణేనోత్పాదితం త్వయా ।
వహసి త్వముపాయేన బహుసూక్ష్మమృదూదరే ॥ 48

అ :— నీచే క్షణకాలములో లీలగా సృష్టింపబడిన అతి స్థూలమును అత్యాశ్చర్యకరమునయిన ఈ బ్రహ్మాండమును అతి మృదువును, సూక్ష్మమును - అయిన నీ యుదరమునందే ఏ బాధయులేక ఉపాయముతో ధరించియున్నావు.

ఏవం మహాభారవహస్య విశ్వకుటుంబినః కరుణాపూర్ణసింధోః ।
మమ త్వదీయస్య సుసూక్ష్మలేశలవాత్మకస్యోద్ధరణం కియత్ తే ॥ 49

అ :— ఇట్లు మహాభారములను వహించువాడవు, విశ్వకుటుంబివియును, కరుణాసాగరుడవునైన ఓ వేంకటేశా! నీ సృష్టిలో అత్యల్పమాత్రుడను, నీ భక్తుడను అయిన నన్ను కృపతో నుద్ధరించుట నీకు ఎంత మాత్రవు పని? అనగా నీవు చేయుచున్న ఘనమైన జగద్రక్షణ మొదలగు కార్యములలో నన్ను రక్షించుట, సంసారము నుండి తరింపజేయుట యనునవి యెంతమాత్రమును బరువైనవి కావని భావము.

అవ :— కూపాదులలో పడినవారిని ఎవరైన అసమర్థులు సైతము ఉద్ధరింపగలరు కదా! నీవు సర్వసమర్థుడవగుటచే నన్నేల యుద్ధరింపవు? అని యనుచున్నారు

శ్రీవేంకటేశ మత్స్వామిన్ జ్ఞానానందదయానిధే ।
దుఃఖసాగరమగ్నం మాం త్వయం నోద్ధరసే కుతః ॥ 50

అ :— జ్ఞాన-ఆనంద-దయలకు ఆశ్రయుడవును, నాకు స్వామివియును, శ్రీ వేంకటాచలమున కధిపతివియును అగు నో వేంకటేశా! దుఃఖ సాగరములో మునిగియున్న నీ భక్తుడనైన నన్నింకను ఏల యుద్ధరించకున్నావు?

విశేషార్థము :—

సర్వజ్ఞుడవగు నీకు నా వృత్తాంతము తెలియనిది కాదు. నీకు నాపై దయ కలుగలేదనుటయును తగదు. ఎందులకనగా నీవు దయానిధివి.

అవ :— దుఃఖసాగరమార్గమునే చూపెట్టుచున్నాడా, అన్నచో అట్లు కాదనుచున్నారు.

శ్రీనివాస కృపాపూర్ణ భక్తపోషణ దీక్షిత।
సంసారారణ్యపతితం దయయా వేక్షసే కుతః॥ 51

అ :— కృపాపూర్ణుడవు, భక్తులను పోషించుటలో దీక్షకలిగిన వాడవు వైన శ్రీనివాసమూర్తీ! ఈ సంసారమను పెదు మహారణ్యమున బడియున్న నన్నెందులకు దయతో చూడకున్నావు?

విశేషార్థము :—

'సంసారారణ్యపతిత భక్తపోషణ దీక్షితుడు' అని బిరుదుగాంచిన నీకు నీ భక్తుడవైన నన్ను పోషించుటలో నీ దీక్ష యేమైసదని నిలువరించి ప్రశ్నించి నట్లున్నది.

అవ :— వినోదమును చాలించి, భక్తితోను, మృదువాక్యములతోను ప్రార్థించుచున్నాడు.

భక్తబన్ధో దయాసిన్ధో త్వత్పాదాబ్జే నమామ్యహమ్।
సూక్తాసూక్తమిదం సర్వమపరాధం క్షమస్వ మే॥ 52

అ:— భక్తబంధువు, దయాసింధువునయిన ఓ వేంకటాచలపతీ! నీ పద పద్మముల నెల్లవేళల నమస్కరింతును. ఈ శుభాశుభరూపవచనములను సర్వాపరాధములను క్షమింపుము.

అవ : స్తోత్రమును సమాపనము గావించి వరముల నడుగుచున్నాడు.

వరం వరద మే దేహి భక్తిం త్వత్పాదయోః స్మృతిమ్।
సదా నామార్థ విజ్ఞానం దేహీహాఽముత్ర సౌఖ్యదమ్॥ 53

అ:— భక్తులకు వరములనిచ్చు శ్రీహరీ! నాకు నీ చరణములందు 'భక్తి' యనబడు వరమును, నీ పాదములందు 'స్మృతి' యనబడు వరమును ప్రసాదించుమా! ఓ వాస్వామీ! సదా సమస్త గ్రంథార్థముల 'సుజ్ఞానము'ను, ఇహపరములయందు సౌఖ్యమును అనుగ్రహించుము!

అవ :— ఆపై ముక్తిని ప్రసాదించుమని ప్రార్థించుచున్నాడు.

శ్రీస్వామి తీర్థ దుగ్ధాబ్ధౌ శ్వేతద్వీపే సుమండపే।
శ్రీభూభ్యాం విహరన్ విష్ణో ముక్తిం భక్తాయ దేహి మే॥ 54

అ:— క్షీరసముద్రము వలె నున్న శ్రీస్వామిపుష్కరిణి తీర్థమునందు శ్రీ శ్వేత ద్వీపమునం బోలిన శోభన మండపములో శ్రీ భూదేవీ సమేతుడవై విహరించుచున్నవాడవును, సర్వవ్యాప్తుడవును, మోక్షప్రదుడవును, వాసుదేవ మూర్తివియు నగు ఓ శ్రీనివాసా! నీ భక్తుడవైన నాకు "ముక్తిని" ప్రసాదింపుము!

విశేషార్థము:—

1. 'ముక్తి ప్రదో వాసుదేవ స్త్వమేవ' అని సూచించుటకై 'విష్ణో' అని చెప్పబడెను.

2. నీవు సర్వత్ర వసించువాడవు.

వాసనాద్వాసుదేవోఽసి వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే॥

అను ప్రార్థనాశ్లోకమున చెప్పబడినట్లు 'వాసుదేవ' నామము భగవానుని యెడ సార్థకమై, ముక్తి నిచ్చుటలో సమర్థవంతమగుచున్నది.

శ్రీ సూత ఉవాచ:—

ఇత్థం స్తుత్వా వేంకటేశం రమేశం
తూష్ణీం భూతో దేవశర్మా సుభక్తః।
భక్తేభ్యోఽభీష్టార్థవర్ష ప్రబుద్ధం
సాష్టాంగం తం ప్రాణమత్స్వేష్టదేవమ్॥ 55

అ:— పరమభక్తుడైన దేవశర్మ యీ విధముగా లక్ష్మీపతియగు శ్రీ వేంకటేశుని అత్యంతభక్తితో స్తోత్రముచేసి, ఊరక నిలచియుండెను. పిమ్మట నాతడు భక్తులకు అభీష్టములను వర్షించుటలో అతి జాగరూకుడును, తనకు ఇష్ట దైవమును అగు శ్రీ వేంకటేశునకు సాష్టాంగముగ ప్రణమిల్లెను.

అథ స్తోత్రేణ సంతుష్టః శ్రీనివాసః సతాం గతిః ।
మేఘగంభీరయా వాచా వరదాన మథాబ్రవీత్ ॥ 56

అ: — పిమ్మట సజ్జనులకు ముక్తిప్రదుడైన శ్రీ శ్రీనివాసుడు ఈ స్తుతిచే సంతోషించి మేఘగర్జనము బోలిన గంభీర వాక్కులతో దేవశర్మతో వరదానమును గూర్చి యిట్లు వచించెను.

'ప్రీతో ఽహం తే ద్విజశ్రేష్ఠ! మదుపాసనకర్మణా ।
మహదైశ్వర్యసంసిద్ధికారణం స్తోత్రముత్తమమ్ ॥ 57

కృతవానసి తస్మాత్ త్వం మాభైష్మాత్ర పరత్ర హి ।
మత్ప్రియప్రాణశిష్యస్య గురుపాదావలంబినః ॥ 58

విపన్నాశస్సంపదాప్తిః భూయాత్ తే మదనుగ్రహాత్ ।
మమ భక్తస్య తే గేహే స్వర్ణవృష్టి ర్దివే దివే ॥ 59

అయుతాయుశ్చ తే దత్తం పుత్రపౌత్రాస్త్వదాయుషః ।
శతపూరుషపర్యంతం భుక్త్వా భోగా ననేకశః ॥ 60

తతో మత్పదమాప్నోషి ' త్యుక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 61

అ: — శ్రీ శ్రీనివాసుడు చెప్పుచున్నాడు: "ఓయీ విప్రోత్తమా! నీవు చేసిన స్తుత్యుపాసనాది క్రియలచే (తపస్సుచే) నేను అత్యంత సంతుష్టుడనైతిని మఱియు అత్యుత్తమము, మహత్తరము, ఐశ్వర్యసిద్ధి ప్రదము నయిన నా స్తోత్రమును ఇప్పుడు ఉత్కృష్టరీతిని గావించితివి. కనుక నీవు ఇహపరములందును, నరకాదులవలనను భీతి నొందకుము. నాకు మిక్కిలి ప్రియుడైన ముఖ్యప్రాణునకు (ముఖ్య వాయుదేవునకు) శిష్యుడవై నీ వాతని చరణములను ఆశ్రయించియున్నాడవు. కావున నా యనుగ్రహము వలన నీయొక్క సమస్త విపత్తులు నశించి సంపదలు కలుగును. నా భక్తుడవగు నీ గృహమున అనుదినము సువర్ణ వృష్టి కలుగుగాక! (సుఖానుభవార్థము మాత్రమే). నీకు, నీ పుత్రులకు, పౌత్రులకు, ప్రపౌత్రులకు, నీవలె దీర్ఘాయువు నొసంగుచున్నాను. శతపూరుష పర్యంతము అనేక భోగముల ననుభవించి పిమ్మట నా పాదకమలములను (వైకుంఠమును) జేరెదవు". అని యానతిచ్చి యూరకుండెను.

ూత ఉవాచ: —

భోః శౌనకాద్యా మునయో నిస్సంగాశ్చ తపస్వినః ।
భక్తవశ్యో వేంకటేశః ప్రసన్నో భవతి ధ్రువమ్ ॥ 62

అ: — శ్రీ సూతమహర్షి చెప్పుచున్నారు. ఓ శౌనకాది మునులారా! మీరు
హంకార మమకారములు లేనివారు. తపస్సంపన్నులు. శ్రీ వేంకటేశుడు భక్త
ంవదుడు గావున నిజభక్తులైన మీ కందఱకు తప్పని సరిగా ప్రసన్నుడగును.

యూయం గత్వా వేంకటేశం రమేశం
నత్వా స్తుత్వా వేదవేద్యం సుభక్త్యా ।
భక్తేభ్యోఽభీష్టార్థవర్షప్రబుద్ధం
సంప్రీణీధ్వం తేన వోఽభీష్టసిద్ధిః ॥ 63

అ: — శౌనకాది మునులారా! మీరును సర్వవేద ప్రతిపాద్యుడును,
ంకటాచలపతియు, లక్ష్మీపతియునైన శ్రీ వేంకటేశుని యాత్రార్థము వెళ్ళి
క్తితో నమస్కరించి స్తోత్రాదులచే సంతుష్టుని గావింపుడు. భక్తులకు సమస్త
ుషార్థముల నిచ్చు శ్రీహరి మీ యభీష్టముల సిద్ధింప జేయగలడు.

శ్రీవేంకటేశస్య కథామృతం త్విదం
మాహాత్మ్యసారం సుతపస్విగమ్యమ్ ।
శ్రీ వేంకటేశస్య మహాప్రియప్రియం
లోకోత్తరం దేవఋషిప్రియం చ ॥ 64

అ: — శ్రీ వేంకటేశ్వరుని ఈ కథామృతము భక్తులకు జన్మ మృత్యువులను
ారింపజేయునది. సమస్త పురాణముల యందలి భగవన్మాహాత్మ్యముల
ొక్క సారభూతమైనట్టిది. అత్యంత శ్రేష్ఠములైన మహిమములు గలది.
అందరికిని దుర్లభము. మహాతపస్విజనములకే లభ్యము. శ్రీనివాసునకు
త్యంత ప్రియములగు షోడశోపచారములకంటె మిక్కిలి ప్రియమైనది.
కములో సత్యుత్తమమైనది. దేవతలకు ఋషులకు మనుష్యోత్తములకు కూడ
సార తారక మగుటచే మిక్కిలి ప్రియమైనదై మోక్షప్రదముగా నున్నది.

సమస్త పాపౌఘ వినాశకారణం
సమస్త పుణ్యౌఘ సమృద్ధికారణమ్ ।
శ్రీవేంకటేశస్య పదారవిన్దయోః
సద్భక్తివృద్ధావసమాన కారణమ్ ॥ 65

అ:— మఱియు ఈ కథామృతము సర్వపాపరాశిని బోగొట్టునది. సర్వ ణ్యరాశి సమృద్ధిని గలుగజేయును. శ్రీ వేంకటేశ్వరుని పాదార విందముల ందు సద్భక్తిని పెంపొందించుటయందు నసమానమైనది (సాటిలేనిది).

వక్తుః శ్రోతుః పాఠకస్య పారాయణపరస్య చ
పరాత్పరో వేంకటేశః ప్రసన్నో భవతి క్షణాత్ ॥ 66

అ:— ఈ వేంకటేశ మాహాత్మ్యమును చెప్పువారికి, వినువారికి, చదివించు ారికి, సర్వదా పారాయణ మొనర్చువారికిని లక్ష్మీపతియగు శ్రీ వేంకటేశ్వరుడు ణముగా ప్రసన్నుడగును.

స్తోత్రేణైవ హి సంతుష్టో వేంకటేశో రమాపతిః ।
యాన్ యాన్ కామాన్ కామయంతే తాంస్తాన్ ముక్తిం దదాతి చ ॥ 67

అ:— భక్తిచే చేయు ఈ స్తోత్రముచేతనే సంతుష్టుడైన రమాపతియైన వేంకటేశుడు భక్తులు ఏమేమి కోరెదరో వాటినన్నిటిని వారి వారి యపేక్షాను రము ప్రసాదించి తుదకు ముక్తిని గూడ ప్రసాదించును. ఇందుల కెట్టి ంశయ లేశము అవసరము లేదు. ఇది సత్యము.

ఇతి శ్రీ మదాదిత్యపురాణే శ్రీ వేంకటేశ మాహాత్మ్యే
శ్రీ వేంకటేశస్య సకలాభీష్ట వరప్రదాన
మహిమానువర్ణనం నామ పంచమాధ్యాయః
అయిదవ అధ్యాయము ముగిసెను.
శ్రీ వేంకటేశ మాహాత్మ్యము ముగిసెను.
॥ శ్రీ కృష్ణార్పణమస్తు ॥

మంగళం భగవాన్ విష్ణుః మంగళం మధుసూదనః ।
మంగళం దేవకీపుత్రో మంగళం గరుడధ్వజః ॥

T.T.D. Religious Publications Series No.123
Price: Rs. 14-00

'ఆదిత్యపురాణాంతర్గత శ్రీవేంకటాచల మాహాత్మ్యం' అభీష్టార్థ సిద్ధికి ఉపయోగపడే అత్యుత్తమ పారాయణ గ్రంథం.

ఇది అయిదు అధ్యాయాల గ్రంథం.

వేంకటేశుని నోరార స్తుతించి, కోరకుండానే సకలాభీష్టములు పొందిన దేవశర్మ కథ దీనిలో ప్రధాన ఇతివృత్తం.

గురువుపట్ల శ్రద్ధ, అశుచిదోషంలేని వేంకటాచల క్షేత్ర మహిమ, దేవశర్మ శ్రీనివాసుని పాదనఖాగ్రాది మహిమలను వర్ణించటం -- ప్రథమాధ్యాయంలోని విషయాలు.

రెండవ అధ్యాయంలో శ్రీనివాసుని దివ్య సౌందర్యాన్ని, గుణ గణాలను గూర్చిన ప్రస్తుతి నెలకొన్నాయి.

తృతీయాధ్యాయంలో భగవానుని నానావతారములను గూర్చిన వర్ణన, నాలుగవ అధ్యాయంలో పురుషసూక్తానుసారంగా కొనసాగిన స్తోత్రాలు, చతుర్వ్యూహాల వర్ణన, శ్రీనివాసుని నామ సంకీర్తన మహిమ చోటుచేసుకొన్నాయి.

అప్రమేయురాలు, మహదైశ్వర్యదేవత -- అయిన లక్ష్మీ దేవితో కూడియున్న భగవంతుణ్ణి దేవశర్మ ప్రస్తుతించటం, స్వామివారు సమస్తైశ్వర్యాలను ప్రసాదించటం -- అయిదవ అధ్యాయంలోని వస్తువు.

ఈ రీతిగా ఈ గ్రంథం మానవాళి హృదయసీమల్లో వేంకటేశ్వర భక్తిని చక్కగా ప్రేరేపించే స్తోత్రరత్నంగా అలరారుతూవుంది.

Published by the Executive Officer, T.T. Devasthanams, Tirupati
and Printed at Keerthi Offset Printers, Tirupati, on behalf of T.T.D.